# భారతి

మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్



ఆగస్టు 1971



సంపుటము : **48** : సంచిక : 8 :

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఆగస్టు 1971



— ——

# మందార మాలిక

## శ్రీ పోచిరాజు శేషగిరిరావు

తోరపు నవ్వులొక్కపరి
దొంతర దొంతరలై యెసంగ, ప్ర
జ్ఞా రుచిరమ్ముగా మనసు
చాలిక లీరిక లెత్తు — తత్త్వ సం
పూరితమై యెడంద పొలుపుల్
హవణిల్లు — గభీర దివ్య శం
ఖా రవముల్ వినంబడు
ప్రకర్షమెయిన్ ప్రచలన్మనీషతో.

తఱియగునంతదాక కనుదామరకున్ గనరావు — నిత్య భా
స్వర మహనీయ—రూపుడవు చాలిత చాలనముల్ గ్రహింప దు
ష్కరమొ! ప్రలోభ మోహ మయ జాలములోఁ బడియుంట చేతనో!
విరిసిన భక్తితత్పరత వేణికలై ప్రవహింపకుంటనో!

చరణయుగమ్ము పట్టితి! విశాంపతి! నన్ దరియింపఁజేయవో!
కరములు మోడ్చి భక్తి యెసకమ్మెసగ న్నుతిసేయుపూన్కి, నీ
చరితము నల్లనల్లన విచక్షణతోఁ బఠియింపఁ బూన, తా
మురలును బాష్పధారలు — మహోదయమై యొక వెల్గు కప్పెడిన్.

అఖిలశోభాకలాప కళ్యాణమూర్తి!
నిన్ను గనుపూన్కి, జన్మల నెన్ని యెత్త
వలయునో! కాక సద్దయా కల్పకమ్ము
విరియ, నిప్పుడ నా కోరు వరము లిడుదొ!

కన్నులన్ వెన్నెలలు గాయు క్రమమూర్తి
దేహమున దివ్యతలు చిందు దీప్తమూర్తి

భావనామయలోకవిభ్రాజితులకుఁ
గానవత్తువా ! ఆనందకందళముగ.

ఏ పదము నిన్నుగూర్చి యూహింతమనిన
శక్తమొక్కటి కాదేమి సరస భణితి ?
శబ్దసుందరరూప ప్రచాలితుఁడవె !
అజ్ఞతకు తావు — నా వ్యవహార మింతె.

పలుకు పలుకున నీవె తోపంగవలయు
మనసు లోపలి పొరలలో మసలవలయు
అణువణువు దైవలీల ప్రత్యగ్రముగను
మునిగి తేలఁగవలె లోకమోహనముగ.

దివిజగంగాజలమ్ము లందీయ గలనె !
నందనవనీమహీజమందారమాల
కేలుగవ దోయిలించి, సలీల నిచ్చు
రక్తియున్నది తేఁగల శక్తి యీవె.

కరుణామయ దృక్కోణము
అరుణారుణరాగరక్తి యంచులు మోవన్
విరబూచి పుడమి యెల్లెడ
పరిమళములు రాశి వోసి పల్లవితమ్మౌ.

ఒకలీల నొయ్యార మొలికించు రాగమ్ము
ఒకపరి వేదనా యుతము నౌను
ఊపిరాడని రీతి నుండును నొకయెడ
విశ్రాంతి సర్వత్ర విచ్చునొకట !
ఆనంద జలధి నుయ్యాల లూగు నొకవు
ఒకమాఱు డెంద ముఝ్ఝాత లూగు
ఒకతూరి చైతన్య మువ్వెత్తుగా లేచు
ఒక్కచో జడురీతి నొడ్డగిల్లు

ఒక్కచో దీపమాలలు రిక్క వెలుఁగు
ధిక్కరించెదు కాంతి నం దిచ్చుచుండు
తమము సాంద్రతమమ్మయి భ్రమసి భ్రమసి
అజపజలులేక తిరుగు జనాళి యొకట.

ఆశాలేశమొకందు నిల్పును ప్రజాళిన్ ప్రేమ హేరాళమై
గ్రాసోవాససుఖమ్మలే యునికి వ్యాఖ్యానించు చిత్రమ్ముగన్
ధిశాలుర్ జగతీరహస్యమును ప్రత్యేకించి కానంగ లే
రీశా! దీనికి మూలకారణము నూహింపంగ లే నేమయా!

తరుణ పవమాన వేగ సంచరణ శీల
జీవనమునందు రస హావ భావములను
వెదకుటన్నది — నెఱజాణ వేణిచూచి
తీవ పొదరిండ్ల నూహించు తెఱఁగుకాదె.

మల్లికా దామ పరిమళ మంజులతను
మలయ మారుత వీచికా విలసనమును
పొలమిాగడ తఱకల వలయములను
స్వామి! బింబించెదవు చిత్రమే! మనీషి!

నీ మణిముద్రిక చాలిక
నీ ముఖలాలిత రమ్య నిత్య నిర్మలతయు, నీ
ప్రేమ విలాస మరీచులు
స్వామీ! తులకింప వేమి జాణవొ తలఁపన్.

చిగురు జొంపమ్ములో దూఱి బుగులుకొనెదొ!
సార నీరధిలోఁ దేలు జాడలేమొ!
విపుల వైహాయసమ్మున విహరణమ్మొ!
పుడమి పొడమిన ప్రకృతిలోఁ బుల్కరింతొ!

అభినవ స్ఫురదుద్దామ యౌవనంబు
భోగతృష్ణలు పెంచు ప్రఫుల్లరక్తి

కోటి కోర్కులు కుప్పలుగూరి యొదుగ
లోవెలుఁగు కానఁ డెవ్వాఁడు జీవితమున.

చల్లని చూపు చాలికల జాడలలో మధుధారలొల్కు — ను
త్పుల్ల హృదబ్జమందు పరిపూర్ణ సుధానిధి కాయు వెన్నెలల్—
పల్లవితమ్ములౌ విమల భావము లూరు క్షణక్షణమ్ము — ఆ
చల్లనిమూర్తి నా హృదయ సారస వేది నలంకరించుతన్.

ప్రియములు గీల్కొనన్ రసిక పేశల బంధుర భావవీచికల్
రయమున పర్వులెత్తు — మధురమ్ముగ మంజు విలాస భూమికా
చయములు దాల్చు నా మనసు —సద్మమె తానొక నాట్యశాలయై
నయము దొరంగి యిచ్చమెయి నాట్యముచేయు వినూత్నభంగిమన్.

చండ తీవ్రత మెఱయు జాజ్వల్యముగను
హైమ శీతలమగు తెప్ప లార్చులోన
ఒలయు రాగంబు కతన నాకులత నొందు
అద్భుతమ్మగు మధుశాల యగునె మనసు'

భువన సంపూజనీయమై పొలుపు మిగిలి
క్రమపరీపాకవశమున కలసి మెలసి
తనువు దాల్చిన పీయూషధార పగిది
అర్చనీయ మహోమూర్తి అవతరించె.

లలిత నేత్రాంచలమ్ముల నలువు లొప్ప
ప్రత్యణువు పుల్కరించి శోభనము లిడగ
ముకుళ హృదయ సరోజమ్ము వికసితమయి
కెరలు కోర్కులు ఆనంద కేళిఁదేలె.

మల్లెపూవును బోలిన మందహాస
మలలు కదలని సాగరమట్లు దోప,
శిల్ప రమ్యత పొదివిన చిత్రమగుచు
నంద సుందరమయ్యె ప్రజ్ఞానగరిమ.

———

# తెలుగు సంకీర్తన లక్షణము : లక్ష్య లక్షణ సమన్వయము

డా. వేటూరి ఆనందమూర్తి

నేడు మనకు దుర్లభముగానున్న 'సంకీర్తన లక్షణ' మను సంస్కృత లక్షణ గ్రంథమునకు తాళ్లపాక చినతిరుమలాచార్యుడు కావించిన యాంధ్ర కృతియే తెలుగు సంకీర్తన లక్షణ మను కృతి. పద కవితా పితామహుడనియు, హరికీర్తనాచార్యుడనియుఁ బేర్వడసి జీవితమెల్ల స్వామిసేవలోను సంకీర్తన రచనలోను గడపిన సుప్రసిద్ధ వాగ్గేయకారుడైన తాళ్లపాక అన్నమాచార్యుడే తొలుత నీ సంకీర్తన లక్షణ మును సంస్కృతములో రచించెనని చినతిరుమలాచార్యుని యీ లక్షణగ్రంథమును బట్టి తెలియు చున్నది.

క. భరతాదులు గ్రంథంబుల
విరచించిన లక్షణములు వేంకటభూమీ
ధర వర కీర్తనలక్ష్యము
లురుపద కవితా పితామహుం డేర్పరచెన్.

ఆ॥ అట్టి యన్నయార్యుఁ డానతిచ్చిన పద
లక్ష్యలక్షణముల లాగు దెలిసి
పలుక నేర్చెనేని బాలుండు ప్రోడయౌఁ
దత్ప్రబంధ మమృతధారఁ బోలు

మ॥ ధరలోఁ దాళ్ళపాక యన్నయ గురూ
త్తంసుండు సంకీర్తనా
పరిశుద్ధిన్ మును జేయఁబూని తగ ను
త్పాదించెఁ దల్లక్షణం
బరుదై మించిన సంస్కృతంబున గవీం
ద్రానంద సంధాయియై
బరిపూర్ణాఖిల శాస్త్ర సమ్మతముగా
భావజ్ఞు లౌనౌననన్.

(సం॥ ల॥ 13–15)

ఇట్లు భరతాదుల లక్షణములకు లక్ష్యములుగా జూపదగిన కీర్తనములనెన్నో స్వయముగా రచించిన అన్నమాచార్యుడే, 'సంకీర్తనా పరిశుద్ధి' నేర్పరచుటకై యీ లక్షణగ్రంథమును సంస్కృతమున రచింపగా దాని కాతని కుమారుడగు పెదతిరుమలాచార్యు డొక లఘువ్యాఖ్యను గూడ గావించియుండెను. (ఆ వ్యాఖ్యయు నేడు మనకు లభించుట లేదు.) ఇట్లు అన్నమాచార్య కృతమును, పెదతిరుమలాచార్య వ్యాఖ్యాతమును నగు సంకీర్తనలక్షణమును మూల వ్యాఖ్యా సహితముగ అన్నమాచార్యుని పౌత్రుడును, పెదతిరుమలాచార్యుని పుత్రుడును నగు చినతిరుమలాచార్యు డాంధ్రీకరించెను. ఈ యంశము నాతడే ఇట్లు జెప్పుకొనెను.

'అలరుఁ దాళ్లపాక యన్నయార్య సుతుఁడు
తిరుమలార్యుఁ డఖిల దేశికుండు
తత్పుత్రాగ్రజుండ ధరలోనఁ జిన తిమ్మ
యాహ్వయుండ దండ్రి యనుమతమున

పరమామ్నాయసమానమై వెలయు
మ త్పైతామహగ్రంథమున్
వరచాటూక్తి మదీయ పుణ్యజనక
వ్యాఖ్యాతమున్ వేడ్కదా
చరణాంభోరుహముల్ మదిం దలచి
సచ్ఛాస్త్రజ్ఞు లింపొందఁగా
వరుసం జెప్పెదఁ బద్యరూపమునఁ
దద్వ్యాఖ్యానుసారంబుగన్.'

(సం॥ ల॥ 16–17.)

అని ఇట్లు 'మహనీయమగు సంకీర్తన నామక పద సంప్రదాయము' సంపూర్ణముగా వివరింపబడిన

యీ లక్షణగ్రంథమును చినతిరుమాలార్యు డందరికిని సుబోధమగురీతినే యనువదించెను. గ్రంథారంభమున చినతిరుమలాచార్యుడు తాతగారిని భక్తిపురస్సరముగ 'పూర్వ పదకవిమణి తేజో వరహారమున నాయకమణి'గా వర్ణించెను. అటుపై అన్నమాచార్యుని కీర్తనముల యోగ్యతను పది పండ్రెండు పద్యములలో గీర్తించెను.

పావనములు హరిభక్తి ని
భావనములు సర్వమంత్ర పరమ రహస్యో
ద్భావనములు గాయక నిక
రావనములు తాళ్లపాక యన్నయ పదముల్ (3)
లక్షణములు పదకవితా
రక్షణములు వివిధ కుకవి రాజీ మద స
మ్మోక్షణములు వేంకటపతి
వీక్షణములు తాళపాకవిభు సత్కవితల్. (7)

ఇట్లే వారి పదములు 'బహుదేశ విహారంబు' లనియు' 'వాణీవీణానాదంబు'లనియు బహుధాస్తుతించి, **తుదకు—**

'శ్రుతులై శాస్త్రములై పురాణకథలై
సుజ్ఞాన సారంబులై
యతిలోకాగమవీథులై
విపుల మంత్రార్థంబులై నీతులై
కృతులై వేంకటశైల వల్లభ
రతిక్రీడా రహస్యంబులై
నుతులై తాళ్ళపాక యన్నయ
వచోమాత్రక్రియల్ చెన్నగున్!

అని వివరించెను. వేంకటాద్రిపతిపై నాయన చెప్పిన పదమే తుదిపదమయ్యెనట!

ఈ విధమున గ్రంథము నారంభించి చినతిరుమలార్యుడు మూలానుసారముగ పదసంప్రదాయము ననుసరించి పదముల లక్షణమును, వాని స్వరూపభేదములను, అందలి భాషానియమములను, పదవిభాగములను, తదనంతర రూపములను, విపులీకరించి యంతమున కుపదకవిత్వనిరసనమును గూడ చక్కని శైలిలో రచించినాడు.

ఈ గ్రంథమందలి విషయము పదకవితకు సంబంధించినది.[1] తొలుతనే కవి 'పదమగు సుప్తిఙ్గంతము, పద మవయవ మవయవియును పదమనబరగున్' అని వివరించెను. అందు 'అవయవపద' మనునదే మనకిందు ప్రస్తుతము. ఇది చతుష్పాదంబగును. దీనినే వృత్త, ధాతు, అవయవములను సంజ్ఞలతోడను బాటింతురు. శరీరధారణమునకు వాతపిత్తకఫములవలెనే పదశరీర సముద్భవ కారణంబులై వృత్తము లలరుట చేతనే వానికి ధాతుసంజ్ఞ లేర్పడెనని భరతాదులు వివరించిరి.

పదములు వర్ణ్యవిషయమునుబట్టి శృంగార పదములనియు, వైరాగ్యపదములనియు ద్వివిధము. శృంగారపదములందు పాత్రోచితభాష యవసరము. గ్రామ్యములైనను బొంకమెరిగి పలికిన జెల్లుబడి యగును. వైరాగ్యపదము లట్లుగాక అగ్రామ్యరమ్య విష్ణుచరితోదారములై యుండవలెను. వీనినే ఆధ్యాత్మ పదములనియు నందురు. పదము సంస్కృతమందేని, ప్రాకృతమందేని, ఒండె దేశభాషలందేని పలుకవలయును. అందు యతిప్రాసలు పద్యభంగినే చెల్లుననిరి భరతాదిమునులు. పదములు లక్షణభేదమును బట్టి 1. వృత్తపదము, 2. నిబంధపదము, 3. అనిబంధపదము—అని మూడు తెరగులు.




వీనిలో వృత్తపదములు భరతుడు వివరించినట్లు సంస్కృతఛందమున ప్రసిద్ధములగు 26 ఛందః ప్రక్రియలనుండి రూపొందింపబడిన పదములే. (చూ. భరతుని నాట్య శాస్త్రగ్రంథము—ధ్రువాధ్యాయము. ఉక్త అత్యుక్తా మున్నగు షడ్వింశచ్ఛందో భేదములనుండి తీసిచూపిన వృత్త (పద) భేదములు). ఈ వృత్తపదము మరల—విషమము; సమము; అర్ధ సమము అని మూడు విధములు.

---

1. తి. తి. దేవస్థానమువారు (1935)లో ముద్రించిన 'సంకీర్తన లక్షణము'నందలి గ్రంథస్థ విషయమును పద్యములును కలగాపులగముగ కలసిపోయినట్లున్నవి. వాని నొక క్రమమున నేర్పఱచి విషయము నిందు వివరించుచున్నాఁడను. కొంతవొచ్చట నేని గ్రంథపాతముకూడనున్నదేమో అని అనుమానమగుచున్నది. ఉదా: గొబ్బిళ్ళ పదమున కిందు వివరణము కానరాదు.

వృత్తపదము:
- విషమము: పదము నందలి చరణములలోని నాలుగు పాదములును నాలుగు విధములుగ నుండును.
- సమము: చరణమునందలి నాలుగు పాదములు నొక్క జాలున వర్తిల్లును.
- అర్ధసమము:– చరణమునందలి విషమపాదము లొకరీతిని సమపాదము లింకొకరీతిని వర్తిల్లును.

నిబంధపదము 'యతులుం ప్రాసములుం బదంబులును మాత్రానీకముల్ తాళసంగతులుంగల్గి - ఆఖ్యాతార్థ సంయుక్త సత్కృతియై— అన్నయ గురూక్తిన్ లోకవిఖ్యాతమై' రాజిల్లును. నిబంధపదమునకే యతులును, ప్రాసలును, మాత్రాగణప్రధానములగు పదములును, మార్గ దేశి తాళములును, ముద్రయు— నను నంగము లయిదు గలవు.

నిబంధపదము (అంగములు)
- యతి
- ప్రాస
- మాత్రాగణములు
- మార్గదేశితాళములు
- ముద్ర

ఈ నిబంధపదమునకే మరి యైదవయవము లున్నవి. అవి వరుసక్రమమున 1. ఉద్గ్రాహము (లేదా – ఉగము), 2. మేళాపము, 3. ధ్రువము, 4. అంతరి, 5. ఆభోగము అనునవి.

నిబంధపదము (అవయవములు)
- ఉద్గ్రాహము
- మేళాపము
- ధ్రువము
- అంతరి
- ఆభోగము

నిబంధపదమున పదమనబడు నాలుగు పాదముల చరణ మొక్కటియేని, అంతకుమించిన సంఖ్యలోనేని నుండును. అట్టి పదముల (చరణముల) యర్థమును వదలక అన్నిటికి నేకవాక్యత జేయన్ గుదిగ్రుచ్చినట్లు తగులై పదము తుదిన్ మరియు మరియు భాసిల్లునట్టి 'పల్లవి' యుండును. ఇది 1. పల్లవి, 2. శిఖాపదము నని రెండు విధములు. 'పదసమానమాన పాదయుగ్మము' గలది పల్లవి. అందు అర్ధమైనది (అనగా ఏకపాదమాత్రమైనది) శిఖాపదము.

పల్లవి — శిఖాపదము
(పాదయుగ్మము గలది.) (ఏకపాదము కలది.)

ఈ నిబంధపదము విషయమున పల్లవియున్న శిఖాపద ముండదు. శిఖాపదమున్న పల్లవి యుండదు. ఇట్లని యీ విషయము 'సంగీత చూడామణి'యందు చెప్పఁబడినట్లుగా 'సంగీత చంద్రిక'యను లక్షణ గ్రంథమున[2] నుదాహృతమైనది.

ఇట్టి పల్లవి శిఖాపదములతోగూడిన నిబంధ పదము ప్రయోగసంప్రదాయమునుబట్టి నాలుగు విధములగు నవాంతరపదము లగును. అవియే చతుర్ధాతుక, త్రిధాతుక, ద్విధాతుక, ఏకధాతుక పదములు.

నిబంధపదము
- చతుర్ధాతుకము
- త్రిధాతుకము
- ద్విధాతుకము
- ఏకధాతుకము

వీనిలో చతుర్ధాతుక నిబంధపదమున ఉద్గ్రాహ మేళాపక ధ్రువములుండి ఆభోగయుక్తమగు పల్లవి యుండును. అంతరి వర్జితము. త్రిధాతుక నిబంధపదమున ఉద్గ్రాహధ్రువాభోగములును, పల్లవియు నుండి మేళాపమును అంతరియు వర్జితము లగును. ద్విధాతుక నిబంధపదమున ఉద్గ్రాహమును ధ్రువమును పల్లవియు నుండును. మిగిలినవి వర్జితములు. ఇందు ముద్రతో

---

2. ఈ లక్షణగ్రంథములేకాక అన్నమాచార్యుని సంకీర్తన లక్షణమున మరికొన్ని లక్షణగ్రంథములు కూడ నుదాహరింపబడినవి. వాని వివరణ మిది. (చూ. వాగ్గేయకార చరిత్రము—శ్రీ రజనీకాంతరావు గారు.)

1. భరతుని లక్షణము—క్రీ. పూ. 200–400 క్రీ. శ. నడిమికాలమున వర్తిల్లినట్లు చెప్పఁబడు భరతముని చెప్పిన 'భరతనాట్యశాస్త్రము'.

2. సంగీతరత్నాకరము—క్రీ. శ. 1210—1242 ప్రాంతములందు వ్రాయఁబడినట్లు తలపఁబడు శార్ఙ్గదేవుని లక్షణగ్రంథము.

3. సంగీతచంద్రిక— వారణాసి వాస్తవ్యులగు మాధవభట్టు అనువారి గ్రంథము.

4. సంగీత చూడామణి—ఉత్కళదేశపురాజగు ప్రతాపుని లక్షణగ్రంథము.

5. సంగీత సుధాకరము—క్రీ. శ. 1309—1312 ప్రాంతములందు రచింపబడిన హరిపాలదేవుని లక్షణగ్రంథము.

జెలువొందు ఆభోగముకూడ నుండదుకావున ఆ ముద్ర ధ్రువమునందే చేర్చబడును. ఇక ఏకధాతుక మీ జగముననే లేదు. కాని నాట్యశాలలో దేశిమర్యాద చొప్పున పాడబడు 'మొగవరి' యనబడునదే ఉద్గ్రాహము మాత్రము పల్లవితోగూడి ఏకధాతుక మనబడును. పై విషయములెల్ల ధాతుప్రయోగమునకు సంబంధించినవే.

1. చతుర్ధాతుక నిబంధపదము:— ఉద్గ్రాహ, మేళాపక, ధ్రువ, ఆభోగము (ముద్రతో)లుండును. అంతరి ఉండదు. పల్లవి కలదు.

2. త్రిధాతుకపదము:—ఉద్గ్రాహ, ధ్రువ, ఆభోగము (ముద్రతో) లుండును. మేళాపము, అంతరియు వర్జితములు. పల్లవి కలదు.

3. ద్విధాతుకపదము: ఉద్గ్రాహ, ధ్రువము లుండును. ధ్రువమునందే ముద్ర చేరును. పల్లవి కలదు.

4. ఏకధాతుక పదము:— ఈ పదము అరుదు. నాట్యశాలలో పాడబడు 'మొగవరి' రచన ఇట్టిదన వచ్చును. ఇందు ఉద్గ్రాహము మాత్రమే పల్లవిని గూడియుండును.

వృత్తములు నాలుగు పాదములతోను, జాతులు రెండు పాదములతోడను నుండునట్లే సంకీర్తనములును చతుష్పాద ద్విపాదాకృతిని వర్తిల్లుచుండును. ఇట్టి కీర్తనములలో దరువులు, జక్కులరేకులు గొబ్బిళ్లు, భాసురవాక్యములు, చందమామ పదములు పేర్కొనదగినవి.

పద్యజాతి ముక్తకము, కుళకము అను రూపముల నుండునట్లే ముక్తకమువలె వ్యస్తమై దరువును; కుళకమువలె పంచధాతు మిశ్రితమై పదమును నొప్పుచుండును.

వృత్తము—చతుష్పాదాకృతి గలది.
జాతి — ద్విపాదాకృతి గలది.
దరువు — పద్యజాతిలోని ముక్తమును బోలినది.
పదము — పద్యజాతిలోని కుళకమును బోలినది.

పదములలో దరువు, వాక్యము, అర్ధచంద్రిక, ఏల, గొబ్బిళ్లు, చందమామపదము అనునవి పాదయుగళమున బరగునవి. వీనిలో—

1. దరువు — ద్రుతమధ్యమానములు, చిత్రవర్ణము, తాళము కలిగి మునుపుపాడిన పదవాక్యముల బోసంగి—ద్విచతుష్పాదాకృతితో జెలగును.

2. వాక్యము — తానాంచితమై, విలంబమానమై, తాళవిరహితమై, పదార్థంబుచెంది కేవల ద్విచతుష్పాదాకృతిని జెలగును. అన్నమాచార్యు డిట్లు చెప్పెను.

3. అర్ధచంద్రిక పదము — ఉద్గ్రాహము, ధ్రువము, ఆభోగము—సగమె పలికి పల్లవము సంధించి—తానప్రతానకాంచితమైనది.

4. ఏలపాట — నాయకాహ్వాన పూర్వమై, మ్లేచ్ఛపరిభాషతో రాగమిళితమై—నాయకసంబుద్ధిమధ్యమగుచు పదమన బరగునది.

5. గొబ్బిళ్లు—(ఇందు దీని వివరణము కానరాదు. లోపించి యుండునేమో!)

6. చందమామ పదము — విప్రలంభమున నాయకుడేనియు, గాంతయేనియున్ పాదపాదమున చందురుని పేర్కొని పాడగా ద్విచతుష్పాదాకృతిని బరగునది.

ఇట్లే యక్షగానపదములుకూడ అనేక విధ తాళ సంగతులతో నవరసాలంక్రియాసవర్ణము లగుచు భాసిల్లునని హరికీర్తనాచార్యుడు వివరించెను.

ఇవిగాక పదవిశేషము లెట్టివనిన—

1. అష్టపది—గీతగోవిందమున జయదేవుడు రచించినట్లు ఎనిమిది పదములును, పల్లవియు గల రచన.

2. పదమాలిక—సొగసైన పల్లవిని గూర్చుకొని, అర్ధచాతురితో బహువిధముల పదమాలిక సీసమాలికవలె శోభిల్లును.

3. శరభపాద పదము—ఎనిమిదేసి పాదములుగల పదము (చరణము) గలది. (ఇది అష్టపదికన్న భిన్నమైనది.)

ఇక వృత్తనిబంధపదముల తర్వాత పేర్కొనవలసినది అనిబంధపదము. ఇదియే అనిర్యుక్తనామ భాసితమై, తాళబంధచ్ఛందోవిరహితమై చూర్ణాఖ్యం బరగును. ఇది కృష్ణాచార్యాదిక పరికల్పిత పదము.

లలో రాగిరేకులపై చెక్కబడినవానిలో పెక్కు సంస్కృత కీర్తనములకే రాగనిర్దేశముతోబాటు తాళముగూడ సూచింపబడియున్నది.[4] అన్నమాచార్యుడు తన సంకీర్తన లక్షణమునకు దగిన లక్ష్యములనుగూడ (సంస్కృతమున) రచించియే యుండెను. సంకీర్తన లక్షణమున నిబంధపదమున కవాంతరపదలగు నవయవ పదములందలి పల్లవప్రయోగప్రక్రియ వివరింప బడియే యున్నది. తదనుగుణముననే తరువాత పెదతిరుమల చినతిరుమలాచార్యాదులు లక్ష్యలక్షణ సమన్వయమునకై ఒక కొన్ని సంస్కృతకీర్తనములనే పై శిలాఫలకములందు చెక్కించియుందురు. అందలి కీర్తనములు సంస్కృతభాషలో నుండుటయు, నా శిలాఫలకములు ఆలయప్రాకార కుడ్యములలో బొదుగదగిన పరిమాణములు గలవై యుండుటయు గుర్తింపదగిన యంశములు. లక్షణమువలెనే లక్ష్యమును సంస్కృత భాషలో నుండుటచేత నాలయమున స్వామి సందర్శనమునకువచ్చు భక్తులును, విద్వాంసులును ఆ ప్రాకార శిలలపైగల స్వరసాహిత్యములను గుర్తించి నేర్చి యానందింతురుగాకను భావమే తాళ్లపాకవారిని అట్టి చేతకు బురికొల్పియుండునని తలతును. ప్రాయశః స్వరసహితమగు సాహిత్యమును నిబంధించుటలో మన దేశమున జరిగిన తొలి యత్నమదియే యనుకొన వచ్చును. కాని యా దినములలో నట్టి యత్నము విస్తృతమగు పరిధిలో జరిగినట్లు మాత్రము కానరాదు. అవకాశము కూడ లేకపోయె నేమో! ఒకవేళ జరిగినను తరువాతి రాజకీయ కారణముల మూలమున మనకా యత్నము కనుమరుగై పోయినదో! లేకున్న వేలకొలందిగనున్న వారి సంకీర్తనలలో నాడు వారి కభిమతమగు సంగీతస్వరూప మెట్టిదై యుండునో ఈనాడు మనకుం బ్రత్యక్షముగా తెలియరాకుండునా? ఇప్పటికైనను ఈ విషయమున ఆ శిలాఫలకములందలి స్వరసాహిత్యములు సంపూర్ణముగా ప్రకటింపంబడినచో కొంత పరిజ్ఞానము మనకు కలుగ గలదు. శ్రద్ధతో మా మిత్రులు శ్రీమాన్ ఉదయగిరి శ్రీనివాసాచార్యులవారీ విషయమున పరిశ్రమించిరి కాని వారి కృషి యింకను వెలుగు మొగము చూడవలసియున్నది. స్థూలముగ శిలాఫలకములను జూచి యందలి పంక్తులను గొన్నిటి నుద్ధరించుటకు యత్నించిరిగాని అందు నేను గుర్తించిన సాహిత్యపు చరణభాగము లిప్పటివఱకును ముద్రితములైన తాళ్ళపాకవారి కీర్తనములందు గుర్తింపవీలుకాలేదు. భవిష్యత్తున దాని విషయము వెల్లడికావలసియున్నది.

1949 లో ఆ శిలాఫలకములను జూచినపుడు నేను గుర్తించి వ్రాసికొన్న కొన్ని పంక్తుల నిట నుదాహరించుచున్నాడను.

1. ఆభోగం॥ జనకసుతాజని...ర
   వినయ-గుణాన్విత భార్గవ—
2. ఉగ॥ విదిత హుత...
3. ...మపమరిస| మమమపరి సరి గగమ రిపమ పప
   గుణవరుణాదిక| తనుపాతిత తాటక|ప్రయోగం|ఇయ
   మ పపపమ మగరి సరిగమ—
   ఇయ ఇయ ఇయ—
4. ..............భూషణ|
   వరయ ◌ంచల పతితపోషణ|
   చరణనూపుర జయ ఝణంఝణ
   గురుర —◌త్సవ......
5. ఆభోగం॥ విహత దానవ—
6. అలంకారం॥...గతివిరహిత కంసవిదూషణ...
   ...మానస...మఘపోషణ...విదాయక...
7. ఆభోగం॥ జంతుహృదంతర జనితోపాశ్రయ
   కాంతా..................
   ...............ధారయ
   చింతయ మామిహ వేంకట గిరిశం॥

పై పంక్తులలో, గొన్నిట యతిప్రాసలును, అంత్యానుప్రాసలును, చతురస్ర మిశ్ర గతులును గుర్తింపనగుచున్నవి. అంతేకాక ఇట్టివే మరికొన్ని పంక్తులనుబట్టి యందలి రచన ప్రధానముగా రామాయణ కథా సంబంధి రచనగాం దోచినది. ఈ విషయము నింతటితో విడచి పై లక్షణగ్రంథమందలి పదలక్షణములకు గుర్తింపందగిన లక్ష్యములం గొన్నిటి

---

4. చూ. తాళ్లపాకవారి సంకీర్తనములు. సం. 3—612—కాంభోజి—రచ్చ; 3—39 శుద్ధవసంత—రచ్చ; 3—83 ముఖారి-జంపె, 5-170 కురంజి—అట.

ఇటి చూర్ణపదమే ఛందోగణముల నియతిలేక తాళ ప్రమాణమునమాత్రమొప్పి 'తాళగంధి'యనియుఁ బేర్కొనబడుచున్నది.




పైని వివరించిన రీతిని పదలక్షణ పద ప్రక్రియా వైవిధ్యమును జాటిన పిదప సంకీర్తన లక్షణకారుడు కొంత పదసంధులను గూర్చియు, దేశి పదములను గూర్చియు స్మరించి యా పిదప కుపద కవితా నిరసన మిట్లు గావించెను.

కII బూరుగు కాయం గొరికిన
నీరస తూలంబు దిశలనిండినగతి ని
స్సార పదబంధకవితా
పారీణుల పదము హాస్యపదమై యుండున్.

మరియు అన్య గీత చౌర్య మెట్టిదనిన—

ఆII వెII కూట సాక్షి సాక్షి గోరిన పలుకుట
అన్యవిత్తములకు నాశపడుట
సభల నితర గీత చౌర్యంబు సేయుట
భరతవరౌని యొక్క పాటి యనియె

## సంకీర్తన లక్షణము సమాప్తము

---

పై విషయ వివరణమునుబట్టి చినతిరుమలాచార్యుడు సంకీర్తన లక్షణమున చాలవఱకు సుబోధ మగురీతి ననువదించినాడనియే చెప్పవలెను. ఇందలి లక్షణమున ఆ కాలపు పదస్వరూపములతోబాటు వానికి ధాతురూపమగు సంగీత ప్రయోగ విధానమును గూర్చియు అన్నమాచార్యుడించుక వివరించినాడు. నిబంధపదలక్షణమున తదవాంతరపదభేదములను వివరించుపట్టునగల 'ఉగాభోగము' లనబడు పంచధాతువుల ప్రశంస సంగీతమున (ధాతుకల్పన)కు సంబంధించినదేగాని ధాతువునకు సంబంధించినది కాదను కొందును. వీరి లక్షణగ్రంథమున నాటి సంగీతపు ప్రయోగమునందు పై పంచధాతువులలో 'అంతరి' స్వరూపము చతుర్ధాతుకాది నిబంధపదములలో సంపూర్ణముగా వర్జితమై వర్ణింపబడినది. ఈ ప్రబంధ ధాతువులతోగూడిన 'ఉగాభోగము'లనబడు పదప్రక్రియలను కన్నడదేశమున నేటికిని సంప్రదాయజ్ఞులు గానము చేయుచున్నారు. తాళ్లపాకవారి ఉగాభోగములలోని సంగీత రచన నేటికి మరుగు పడియున్నను దాని నుద్ధరించు నవకాశము లేకపోలేదని తోచును. ప్రయోగస్వరసహితముగా ధాతువుల కూర్పుతో నీ ప్రబంధ ధాతువుల స్వరూపము లన్నింటిని వేర్పరచి చూపు రచనలు కొన్ని యానాటి శిలాశాసనములలో కానవచ్చుచున్నవి.[3] వానినిగూర్చి మన్మిత్రులు శ్రీమాన్ ఉదయగిరి శ్రీనివాసాచార్యులు గారు ఇట్లు వ్రాసియున్నారు. 'సరిగమాది స్వర విన్యాసముతోను, సాహిత్యముతోను తిరుమలలో శ్రీ స్వామివారి చంపక ప్రదక్షిణోపక్రమమున సుమారు 4 అడుగుల వెడల్పు 7 అడుగుల ఎత్తుగల శిలాఫలకములపై శాసనరూపముగా చెక్కించియుండిరి. అవి యెన్ని చెక్కి నాటియుండిరో తెలియరాదు. కాని 1949 లో నేను వెళ్లిచూచు నప్పటికి 4 వ వరుససంఖ్యగల శిలాఫలకమును, సంఖ్య లేనిది యొకటియు వెరసి రెండు ఫలకము లుండినవి.........అందలి సాహిత్యము తాళ్లపాకవారిదిగనే కలదు. అన్నమాచార్యులచే దేవభాషలో రచింపబడి, ఆయన పుత్రుడైన పెదతిరుమలాచార్యులచే వ్యాఖ్యానింపబడి, ఆయన మనుమడైన చినతిరుమలాచార్యులచే పద్యకావ్యముగా రచింపబడిన 'సంకీర్తన లక్షణ' మను గ్రంథమునకు లక్ష్యములందు చెక్కినట్లున్నారు. ఇందులో అక్కడక్కడ ఉద్గ్రాహము, మేళాపము, ధ్రువము, అంతరము, ఆభోగము, ఉగము, అవృత్త నియమము, ఝంప, అట, రూపక, తివడ—అని కలవు. శ్రీ వేంకటేశ్వర ముద్రతో సంస్కృతభాషలో కీర్తన కలదు. లిపితీరు వగైరాలన్నియు చినతిరుమలాచార్యుని నాటివే.' (చూ. శృం. సంకీర్తనములు. సం. 15. తి. తి. దే. ముద్రణము. 1961. పు. 3).

పైయభిప్రాయములు సమంజసములైన వనియే నేను విశ్వసించుచున్నాను. తాళ్లపాకవారి సంకీర్తనము

---

3. చూ. చి. తి. అధ్యాత్మ సంకీర్తనములు. సంII 16—పు. 41—44. తి. తి. దే వారి ముద్రణము. 1962.

నుద్దేశించి లక్ష్యలక్షణసమన్వయము గావించుట కించుక యత్నింతును.

తాళ్లపాకవారి పదరచనలలో నిబంధపదములే ప్రధానములు. వారి 'అనిబంధపదము'లకు పెదతిరుమలాచార్యుని వేంకటేశ్వర వచనములను నుదాహరింప వచ్చును. వృత్తపదములలోని త్రివిధభేదముల వలె వీరి నిబంధపదములలోను మనము, సమ, విషమ, అర్ధసమ పదములను గమనింపవచ్చును.

సమపదమునకు—

'గోవిందాశ్రిత గోకులబృందా
పావన జయ జయ పరమానందా
జగదభిరామా సహస్రనామా
సుగుణాధామా సంస్తుతనామా
గగనశ్యామా ఘనరిపు భీమా
అగణిత రఘువంశాంబుధి సోమా॥(2—268)

అర్ధసమపదమునకు—

'వేదవేద్యులు వెదకేటిమందు
ఆదినంత్యములేని ఆ మందు॥
అడవిమందులు; గషాయములు నెల్లవారు
కడగానక కొనంగా
తొడిబడ నొకమందు దొరికె మాకు భువి
నడియాలమైనట్టి ఆ మందు॥ (2—2)

విషమ పదమునకు—

'సకల దేవతలు నీ శరీరమని
సర్వేశ్వర నిను దలచుట మేలు
నికటమేల నిను యేకాగ్రబుద్ధినీ
వేడుకలతో సేవించే నింకను.

శివ దుర్గ రవి గణాధిప
క్షేత్రపాలక సహితముగా
భువిలో మిమ్మును పంచపూజగాఁ
బూజింతురు కొందఱు
తివిరియందఱును బంతినే పొత్తుల
దేవరలై పొరియాపు సేతురని
వివరముగా నిన్నే కొలిచితి
నీవే పహించుకొని రక్షించవే॥ (2—358)

వీరిపదముల నిర్మాణము సాధారణముగా రెండు పాదముల పల్లవితో నాల్గేసిపాదములుగల చరణములు మూడింటితో నొప్పుచుండును.

నిబంధపదముల కుండు యతి, ప్రాస, మాత్రా గణములు, మార్గదేశి తాళములు, ముద్ర — అను నయిదంగములను మనము వీరి పదములందు గుర్తింప నగును. యతిప్రాసలు తెనుఁగున వలెనే ఈ కవులు సంస్కృతభాషయందును దమ కీర్తనములఁ బాటించినారు. ముద్ర 'శ్రీ వేంకటేశ్వర' నామముతో సాధారణముగ తృతీయచరణమున కానఁగుచుండును. కొన్ని యెడల ముద్రాలంకారమును గూడ రాగవిషయమున వీరు పాటించినారు. పైన పేర్కొన్న 2—268 కీర్తనము 'లలిత'రాగమున గలది. అందు ద్వితీయ చరణమున వీరు 'దనుజహరణ లలిత స్వరణా' అని రాగముపేరు నం దాలంకారికముగా ముద్రించినారు. వీరి పదములలో ముద్రయనఁగా ప్రధానముగా స్వామి నామాంకమే. ఇక మాత్రాగణములకును, మార్గదేశి తాళములకును వీరి పదములన్నియు నుదాహరణములే యనవచ్చును.

పల్లవి—శిఖాపదములను గూర్చి సంగీత చూడామణి సంగీతచంద్రికల నుదాహరించి వీరు పల్లవం బున్నచో శిఖాపదము కల్గదనియు, శిఖాపదంబున్నచో పల్లవముండదనియు వారి మాటగా ననువదించిరి. కాని తాళ్లపాకవారి రచనలలో పల్లవిప్రధానమైన పదములు, శిఖాపదప్రయుక్తములైన పదములు నుండుటతోబాటు పల్లవి శిఖాపదములు రెండును ప్రయుక్తములైన పదములు కూడఁ గొన్నిలేకపోలేదు.

పల్లవికి—

'ప్రలపన వచనైః ఫలమిహ కిం
చలచల కుడ్య క్షాళనయా కిం॥ (3—39)

ఇది పదసమానమానపాదయుగ్మముకలది.

శిఖాపదమునకు—

'ఉపకారిదేవుడు అపకారిగాఁడు' (5—150)

ఇది ఏకపాదమాత్రమైన శిఖాపదము. ప్రాస యతి వాడినారు.

'డోలాయాం చలడోలాయాం హరేడోలాయాం'
(5—140)

అను వీరి సంస్కృతకీర్తనయు శిఖాపదమే.

శిఖా: 'పరమపురుష నిరుపమాన శరణు శరణు రే—
యిందిరా నిజమందిరా.

చరణము: కమలనాభ కమలనయన కమల చరణు రే
నమితసురముని నాథయూథప నాయకా
వరదాయకా' (5—133)

ఈ పదము కర్ణాటక సంప్రదాయమున నున్న ట్లున్నది. ఇందలి శిఖాపదము (పల్లవిలో సగమై) చరణమున నాలుగవ భాగముగా నుండుటను గుర్తింప వచ్చును. యతియో ప్రాసయతియో ప్రతిపాదమున మూడు తావుల పడుటను గుర్తింపుఁడు.

ఈ విధమున వీరి పల్లవి శిఖాపద రచన లున్నను నూతనముగా పల్లవి శిఖాపదములు రెండునుగల రచనలుకూడ కొన్ని తాళ్లపాకవారి పదములలో లేకపోలేదు. సంకీర్తన లక్షణకారుఁ డీ విషయమున తత్పూర్వ లక్షణకారుల నుదాహరించెనేగాని అవి యట్లు కూడి యుండరాదను నభిప్రాయమును ప్రకటించియుండ లేదు. అందుకేనేమో వీరి పదము లట్టివికూడ నున్నవి.

పల్లవి శిఖాపదములు కూడియుండుటకు—

శిఖా : చెలినేడు తానేమి సేయునమ్మా!
పల్లవము : చెలియేమిసేయు నీ చెలులేమి సేయుదురు
చెలువైన విభుమేని చెలువింత సేయంగ॥
(2—344)

(ఆ పిదప మూఁడు చరణములు).

మఱియొక యుదాహరణము—

శిఖా : ఇతరులకు నిను నెరుఁగఁదరమా
పల్లవము : సతత సత్యవ్రతులు సంపూర్ణమోహ విర
హితు లెఱుంగుదురు నిను నిందిరారమణా॥
(5—155)

(ఆ పిదప మూఁడు చరణములు.)

పైన పేర్కొన్న ఉదాహరణములందు తొలి పాదమును శిఖాపదముగను, మలి రెండింటిని పల్లవముగను పేర్కొనక తప్పదు. ప్రాయశః పదరచనా సంప్రదాయమున నీ శిఖాపదపల్లవములే పల్లవి—అనుపల్లవి అనురూపముల నందియుండునని తలఁప వచ్చును. ఇట్లు పల్లవి—అనుపల్లవి కూడియుండిన తరువాతికాలపు పదరచనలకుఁ దాళ్లపాకవారి పై పదములవంటి పదములే ప్రాతిపదికఁ గల్పించినవేమో!

ఏక ప్రబంధ ధాతువులనుగూర్చియు, ఏలాదులను (గానముచేయు విధానమును) గూర్చియు శార్ఙ్గదేవాదులు కొంత వివరించియున్నారు. అట్లే తాళ్లపాకవారును పంచధాతువులతోఁగూడిన ప్రబంధభేదాలను వివరించిరి. ఇందు వీరు 'అంతరి'ని అయిదవ అవయవముగాఁ బేర్కొనియు, ఏక, ద్విత్రి, చతుర్ధాతుక ప్రబంధాలలో దాని ప్రయోగము వర్జితమని చెప్పినారు. ఈ 'అంతరి' సాళగ సూడ ప్రబంధములందు మాత్రమే ప్రయుక్తమగునని తజ్ఞులందురు. ఏమైనను ఈ చతుర్ధాతుప్రయుక్తములగు ప్రబంధములను గానముచేయు పద్ధతినిగూర్చి లక్షణ గ్రంథములందున్న తెలుఁగు మనకంత విస్పష్టముగ నున్నట్లు తోఁపదు. శార్ఙ్గదేవుడు ఏలాదులను గానము చేయు విధానమును గొంత వివరించెను. కాని యా పద్ధతి తెలుగున ప్రసిద్ధములగు 'భానువంశమున బుట్టి—దానవకామినిగొట్టి' వంటి యేలలకెట్లు అన్వయించునో తెలియరాకున్నది. సంగీత శాస్త్రజ్ఞులీ విషయములను పూర్ణముగ శోధించి యెరుకపరుప వలసి యున్నది. ఉద్గ్రాహము ప్రబంధపుప్రారంభ భాగమనియు, ధ్రువము అంత్యభాగమనియు, మేళాపము వానిని రెంటిని సంధించున దనియు ఆభోగము వాగ్గేయకారుని నామాంకము గలదై ధ్రువమునకు ముందు గానము చేయబడున దనియు లక్షణ కర్తలు వ్రాసిన దానినిబట్టి తెలియుచున్నది. జయదేవుని గీతగోవిందమున అష్టపదులలో ధ్రువమను భాగమున్నది. ఈ ధ్రువమునకును తరువాతి పల్లవి—అనుపల్లవులకునుగల సంబంధమునుగూర్చి డా॥ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు సెప్టెంబరు 1961 భారతిలో చర్చించిన విషయమును పరిశీలింపఁదగును. ప్రబంధ పరిణామమున ధ్రువమే శిఖాపదము, పల్లవి, పల్లవి—అనుపల్లవి అనువిధముల రూపాంతరమందిన దేమో అనిపించును.

పల్లవి—

ఇతరులకు నిను నెరుఁగఁ దరమా
సతత సత్యవ్రతులు సంపూర్ణమోహ విర
హితు లెఱుంగుదురు నిను నిందిరారమణా!

చరణము 1 :

నారీకటాక్ష పటు నారాచ భయరహిత
శూరు లెఱుఁగుదురు నినుఁ జూచేటి చూపు
ఘోర సంసార సంకుల పరిచ్ఛేదులగు
ధీరులెఱుఁగుదురు నీ దివ్యవిగ్రహము॥

చరణము 3 :

పరమభాగవత పదపద్మ సేవా నిజా
భరణు లెఱుఁగుదురు నీ పలికేటి పలుకు
పరగు నిత్యానంద పరిపూర్ణ మానస
స్థితు లెఱుఁగుదురు నినుఁ దిరువేంకటేశ!

(5—155)

ఇందు తొలిచరణము ఉద్గ్రాహము. ఈ ఉద్గ్రాహా నంతరము పై పల్లవి అనఁబడు ధ్రువము గానము చేయఁబడును. ఇది 'ఇందిరా రమణా!' అని స్తుతి నామాంకితమై లక్షణకారులు వివరించినట్లు మధ్య విలంబిత పద్ధతియము గలదిగానే యున్నది. ఇట్లు చరణము—ధ్రువము కలిపి కలిపి గానముచేసిన పిదప తుదిచరణము గానముచేయబడును. ఇదియే ఆభోగ భాగము. ఇందు వాగ్గేయకారుని నామాంకము లేదు గాని 'వేంకటేశ' అను ముద్రయున్నది. ఈ ముద్ర సాధారణముగ ఆభోగమునందే యుండును. ఒక్క ద్వ్రిధాతుక పదమునందు మాత్రమే ఆభోగముండదు. కావున ధ్రువమునందే ముద్రచేరును.

పై పదమునందలి ధ్రువమే 'పల్లవి'గాఁ బేర్కొనఁబడినది. తాళ్లపాకవారు పేర్కొన్న యీ పల్లవియే తరువాతి కాలమున తొలిచరణము పల్లవి గాను, మఱి రెండు చరణములు అనుపల్లవిగాను పేరును సంతరించుకొని పల్లవి—అనుపల్లవి అను విధమున నేర్పడినట్లున్నది. పదమును బాడుటలో ముందు చర ణము (ఉద్గ్రాహ భాగము)ను పాడి పిదప పల్లవి (ధ్రువము) నందుకొను సంప్రదాయము తాళ్లపాకవారి కాలమున గలదని చెప్పవచ్చును. అచ్చులో పల్లవి— చరణము అను తెఱఁగుననే ముద్రితమైయున్నను పాడుటమాత్రము చరణము—పల్లవి అను క్రమముననే యుండెనని తోచును. తంజావూరులోని తాళపత్ర ప్రతి లోని తాళ్లపాకవారి పదము లీ తెఱఁగుననే వ్రాయఁ బడి యున్నవి. ఈ సంప్రదాయ మిట్లేయుండిన దనుటకు రాగిరేకులలోని యీ పదమును బరికింపఁ దగును.

పల్లవి—

'అనుచు రావణుసేన లటు భ్రమయుచు వీగె
యినకులచంద్ర నే డిదిగో నీ మహిమ.'

**చరణము—**

దదదద దదదద దశరథ తనయా
కదిశితిం గకకక కావవె
అదె వచ్చె బాణాలు హానాథహానాథ
పదపద పదపద పారరో వవుజులు, (2—164)

'అనుచు రావణుసేన'లని పదము నందుకొనుట అర్థరహితము. **ముందు చరణమును బాడిన పిదపనే** పల్లవి యందుకొనవలెననియు, నదియే నాటి గాన సంప్ర దాయమనియు దీనివలన **తెలియనగును.**

చతుర్ధాతుక, త్రిధాతుక పదములకుఁ దాళ్ల పాకవారి కీర్తన లన్నిటిని ఉదాహరణములుగాఁ బేర్కొనవచ్చును. (చూ. 5—155, 11-3-69). ద్వ్రిధాతుకములు వారి రచనలో నరుదుగా నున్నట్లు భావింతును. చూడుడు.

చరణము—

'మానుషముగాదు మఱి దైవికముగాని
రానున్నది రాక మానఁబోదు
అనుభవమునకుఁ బ్రాప్తమైనది తనకుఁ
దానెవచ్చి తగిలి కాని పోదు.'

పల్లవి—

తిరువేంకటగిరి దేవుని
కరుణచేతఁగాని కలుషమింతయుఁ బోదు.

(2—6)

ఇందు పల్లవియే ధ్రువము. 'తిరువేంకటగిరి దేవుఁ'డను ముద్రతోఁగూడి పల్లవమున్నది. ఇందున్న ఒక్కచరణము ఉద్గ్రాహభాగము కాఁదగును. అచ్చులో నీ కీర్తనయు, జరణమును ముందు పాడునట్టి సంప్ర దాయము చొప్పుననే మొదలిడినట్లున్నది. కాని వ్యత్యస్త ముగా ముద్రితమైనదని తలఁతును.

ఇక నేకధాతుకపదము లరుదనియు, నాట్యశాల లందుఁ బాడఁబడు **'మొగవరి'** యిట్టి రచన కాఁదగు ననియుఁ దాళ్లపాకవారే పేర్కొనిరి.

'మొగవరి కట్టడ మొనపు కోలాటంబు
చొక్కంపు మురువులు చిక్కణీలు
బరువు బారదుచేసి బహురూపుల దగ
బంధురగీత ప్రబంధ వితతి'

అనుపద్యము నుదాహరించి కీ॥ శే॥ సురవరం ప్రతాప రెడ్డిగారు 'పై పద్యములో చాలాపదాలు తెలియవు. కొన్ని అచ్చుతప్పులేమో! మొగవరి=మొగ్గవాలుటయని యర్థమేమో?' అనివ్రాసియున్నారు. (చూ. ఆంధ్రుల సాంఘిక చరిత్ర. పు. 343) మొగవరి యనగా మొగ్గవాలుట కాదనియు నిదియొక పదభేదమనియు దీనినిబట్టి తెలియుచున్నది.

చతుష్పాద, ద్విపాదాకృతులతో నొప్పెడి వృత్త జాతి భేదములను దాళ్లపాకవారు పేర్కొనిరి. వీరి రచనలలో వృత్తములు బహుళములు. జాతులుకూడ లేకపోలేదు. వృత్తమున కుదాహరణముగ దీనిని జూపవచ్చును. చూ.

పల్లవి :

'నిత్యాత్ముఁడై యుండి నిత్యుఁడై వెలుఁగొందు
సత్యాత్ముఁడై యుండి సత్యమై తానుండు
ప్రత్యక్షమై యుండి బ్రహ్మమై యుండు సం
స్తుత్యుఁ డీ తిరువేంకటాద్రి విభుఁడు.'

(మఱి మూడు చరణములు సుదీర్ఘములగు పాదములుగలవి యున్నవి.) (2—76.)

జాతి కుదాహరణముగ నీ క్రింది పదమును బేర్కొనవచ్చును.

పల్లవి—

యేరా యిప్పుడు నా యెదుట గడపరాయ
నారి నేను నిన్నెఱుంగుదు నను నీ వెఱుంగుదువు॥

చరణము—

పలుకులం బదరా కడుఁ బగటు చెలియ నేను
చెలఁగి యే పనులు మనసునఁ గలిగిన చేసి
చూపుదువుగాని॥ (2—235.)

ఇట్లే 'పరగున్ వృత్తము జాతి యంతయుఁ జతుష్పాద ద్విపాదాకృతిన్'అని చెప్పి తదాకృతులనే వర్తిల్లు పదప్రక్రియలను దాళ్లపాకవారు పెక్కింటిని పేర్కొనిరి. వాని కీ దిగువ నుదాహరణము లెత్తి చూపుచున్నాను.

**1. దరువునకు —**

'కూరిమెరిగి కైకోవు—నీ
బీరములే నెరిపేవు
రంతులె సేసిటురావు
యెంతైనం జన వీవు
చెంతలె కడఁ దలచేవు
యింతలో నెరవయ్యేవు (3—376).

ఇది చతుష్పాదాకృతిని బరగి ద్రుతమానమును, చిత్రవర్ణతాళములునుగల దరువును బోలిన రచన యనవచ్చును. తరువాతికాలపు యక్షగానములం దిట్టి దరువు లనేకములు కాననగును.

**2. భాసుర వాక్యమునకు —**

ఏ దైవము శ్రీపాదనఖంబునం బుట్టిన గంగ
త్రిలోకపావనము చేయను త్రిపథగామిని యాయెను
ఏ దైవము నాభి నలినంబున జనియించిన అజుండు
అఖిలాండంబులు సృజియింప నధిపతి యాయెను.
ఏ దైవము వురస్స్థలంబు తనకును మందిరమైన
యిందిర మాతయయ్యె యీ జగంబుల కెల్లను
ఏ దైవము అవలోకన మింద్రాది దివిజ గణంబుల
కెల్లప్పుడును సుఖంబు లాపాదించును—
(11—3—34)

ఈ పదముపై 'గీతం—నాట'అని గలదు. ఈ గీతమే భాసురవాక్యమగునాయని నేననుకొనుచున్నాను. ఏలన నిందలి రచన 'వాక్యము' నందువలెనే తానాంచితమై, విలంబమానమై, తాళవిరహితమై యున్నట్లున్నది.

**3. అర్ధచంద్రిక పదమునకు —**

అతిశోభితేయం రాధా
సతతవిలాసవశా రాధా
దర్పకబలబోధా రాధా
తర్పణగంధవిధా రాధా
దర్పయుతక్రోధా రాధా
దర్పక రసవేధా రాధా (4—48)

సుగ్రీవవిజయ యక్షగానము నందున్న 'చదువులు తెచ్చిన జలచరపతికిన్ – కుధరము మోఁచిన కూర్మంబునకున్' – కన్నుల నగ్రులు కమ్మగ వగచున్—ఔరా విధివశమని తల యూచున్—ఏటికి ప్రాణము లికనని తలఁచున్—'మున్నగు నర్ధచంద్రిక పదములను బోలినదే పై రచనయు. చతుష్పాదాకృతి గలది. పాదాంతమున నను ప్రాసలు గలది. తాన ప్రతాన కాంచితమైనది.

**4. ఏలపాటకు —**

మేడలెక్కి నిన్నుఁ జూచి
కూడేననే యాసతోడ
వాడుదేరి వున్నరందురా—వేంకటేశ
యాడనుండి విందాకానురా॥ 1. ॥

జోడుగూడి నీవు నేను
నాడుకొన్న మాట లెల్లా
గోడలేని చిత్తరువులై—వేంకటేశ
యాడా నా మతిఁ బాయవురా॥ 12. ॥

నెత్తమాడేనంటా రతి
పొత్తులా పందేలువేసి
వొత్తి నీవే వోడే వేలరా—వేంకటేశ
కొత్తలైన జాణవౌదువు॥ 20. ॥

వున్నతి శ్రీ వేంకటేశ
మన్నించి కూడితి విదే
నన్ను నెంత మెచ్చుమెచ్చేవు—వేంకటేశ
కన్నులపండువు లాయరా॥ 21. ॥
(13—223)

తాళ్ళపాకవా రీ పదములను 'యాలపదాలు—దేసాళం'అని పేర్కొనినారు. తాళ్ళపాకవారి యేలలలో రమ్యములైనవి యివి 25 మాత్రమే నేటికి లభించినవి. శార్ఙ్గదేవుఁడు ఏలా లక్షణమును వివరించుచు నందు 16 పదము లుండుననెను. కాని యిందు 25 పదము లున్నవి. మిగిలిన లక్షణములన్నియు సరిపోలుచున్నవి.

**5. గొబ్బిళ్లకు—**

'కొలనిదోపరికి గొబ్బిళ్లో—యదు
కులస్వామికిని గొబ్బిళ్లో
కొండగొడుగుగా గోవులగాచిన
కొండుక శిశువుకు గొబ్బిళ్లో
దుండగంపు దైత్యులకెల్లను—దల
గొండుగండనికి గొబ్బిళ్లో' (3—484)

ఇది చతుష్పాదాకృతి గలది.

**6. చందమామ పదమునకు—**

'చల్లనై కాయగదో చందమామా—నీ
వెల్లగా తిరువేంకటేశు నెదుర—
మొల్లమిగ నమృతంపు వెల్లిగొలుపుచు లోక
మెల్ల నిను గొనియాడగాను.' (3—296)

ఈ పదములేకాక పదవిశేషములుగాఁ దాళ్లపాక కవులు పేర్కొన్నవానికిగూడ వారి రచనలనుండి యుదాహరణములఁ జూపవచ్చును,

**7. అష్టపదికి—**

'అహో సురత విహారోయం
సహజ పరాజయ శంకా నాస్తి॥
యమునాకూలే సుమలతాగృహే
విమల సైకత విజన స్థలే
రమణీ రమణా రమత స్తయోః
ప్రమదస్య పరాత్పరం నాస్తి॥ 1 ॥
పరిమళభరిత ప్రచుర సుశీతల
వరమృదు వాయౌ వాతి సతి
తిరువేంకటగిరి దేవ రాధయా
సరస రతి సుఖ శాంతి నాస్తి॥ 8 ॥

ఇది వస్తువునందును, రచనారీతియందును నచ్చముగ జయదేవుని యష్టపదులను బోలిన రచనయే. ఎనిమిది చరణము లిందున్నవి.

**8. పదమాలికకు —**

పల్లవి—

'లేరా దేవతలు లేరా లావరులు
ఆ రీతి నాడెందువోయి రధికులే కలితె.'.

(అటుపిమ్మట నీ పదమునందు చతుష్పాదములు గల పదములు పదునైదున్నవి). తాళ్లపాకవారి నిర్వ

చనము ననుసరించి దీనిని పదమాలికయని పేర్కొన వచ్చును. ఇట్టివే 3—230, 440 కీర్తనములను గూడ చూడఁదగును.

## 9. శరభపాద పదమునకు–

2 – 76—శ్రీరాగమునగల పదమును శరభ పాద పదముగాఁ బేర్కొనవచ్చును. ఇందు స్థూల ముగా చరణములు చుతుష్పాదాకృతిగా సాగునట్లే తోచును. కాని యతులు పాదపాదమున నాలుగు తావుల బడుటచే వానినే విరచి యెనిమిదేసి పాదములు గల పదముగా నుదాహరింపవచ్చును. పల్లవి పదసమాన మాన పాదయుగ్మము కలది. కావున నిందలి పల్లవి నాలుగు పాదములతో నున్నది. దానినిబట్టియే దీనిని శరభపాదపదమని నేను గుర్తించుట !

నిబంధ పదముల తర్వాత తాళ్లపాకవారు పేర్కొన్న అనిబంధపదములలో చూర్ణమునకును, తాళ గంధికిని గూడ నుదాహరణ లెత్తిచూపవచ్చును. కష్ణమా చార్యుని వచన సంకీర్తనములను తాళబంధచ్ఛందో విరహితములగు చూర్ణములుగానే వారు పేర్కొనిరి. పెదతిరుమలాచార్యుని వేంకటేశ్వర వచనములు రాగ తాళ నిర్దేశముతో నున్నవి గావున వానిని తాళగంధి వచనము లనవచ్చును. ఉదాహరణములకు ఆ యిరువురు కవుల వచన సంకీర్తనములను బరికింపఁదగును.

ఇట్లు తాళ్లపాకవారు సంకీర్తనలక్షణమును రచించుటయేకాదు, వానికిఁదగిన లక్ష్యములను గూడ రచించి 'సంకీర్తనా పరిశుద్ధి' కెంతయో పాటుపడిరని నిస్సందేహముగా చెప్పవచ్చును.

---



# తిక్కన అనువాదసరణి - అంబోపాఖ్యానము

శ్రీ కాళూరి హనుమంతరావు

మహాభారతంలో మన మనస్సు చూరగొనే ఎన్నో ఉపాఖ్యానాలలో అంబోపాఖ్యానం ఒకటి. రస వంతమైన ఈ కథను వ్యాసుడెట్లా రచించాడు, దానిని తిక్కన ఎట్లా అనువదించాడు అని తుల నాత్మక పరిశీలనం చేస్తే దానినిబట్టి మొత్తం మహా భారతానువాదం ప్రాయికంగా ఏ తీరున జరిగిందో ఊహించగలం.

ఈ ఉపాఖ్యానం ఉద్యోగపర్వం చివర్లో ఉంది. 'నేను శిఖండిని ప్రహరించను' అని భీష్ము డనగా 'ఎందుకు ప్రహరించవు?' అని దుర్యోధను డతణ్ణి ప్రశ్నిస్తాడు. దానికి జవాబుగా భీష్ముడు అంబ వృత్తాంతం చెప్తాడు.

ఈ కథను వ్యాసుడు (అంబ చితారోహణ పర్యంతం) పదిహేను సర్గలలో ఐదువందల ముప్పై ఆరు శ్లోకాలలో రచించాడు. దీనిని తిక్కన తొంభై ఏడు పద్యగద్యాలలో అనువదించాడు. వీటిలో భీష్మ పరశురాముల యుద్ధవర్ణన మూలంలో రెండువందల రెండు శ్లోకాలు, తెలుగులో నలభై అయిదు గద్య పద్యాలు. పోతే కథారచన మూలంలో మూడువందల ముప్పై నాలుగు శ్లోకాలు, తిక్కనవి ఏభై రెండు పద్యగద్యాలు.

ఈ లెఖ్ఖంతా ఎందుకంటే సాధారణంగా ఆంధ్రమహాభారతవిమర్శకులు వ్యాసుని రచనలోని ఆధ్యాత్మిక నీతిబోధలు, క్షేత్రమాహాత్మ్య యుద్ధాది గతానుగతిక వర్ణనలు మొదలైన రసహీన భాగాలను అపనయించో సంక్షేపించో గ్రంథ బాహుళ్యాన్ని తగ్గించి ఎక్కువగా కథానిర్వహణం, పాత్ర చిత్రణం చేసి మూల రచనకన్నా తన అనువాదంలో తిక్కన సాహిత్య గౌరవాన్ని చాలా ఎక్కువ చేశాడని అంటూ ఉంటారు. ఈ అభిప్రాయం సత్యదూరమైనదని పై గణనవలన స్పష్టమవుతుంది. అంబోపాఖ్యానంలో యుద్ధవర్ణనకన్నా కథా భాగాన్నే తిక్కన అధికంగా సంక్షేపించాడు. కథయినా, ఆధ్యాత్మిక చర్చ అయినా ఏదైనా మూలంలో ఉన్నది సంగ్రహంగా చెప్పడమే చాలావరకూ తిక్కన అనువాదసరణి అని ఆయన రచించిన మహాభారతానువాద మంతటా మనం గమనించ వచ్చును.

కథానిర్వహణలో వ్యాస తిక్కనల తారతమ్యాన్ని పరిశీలించుదాం.

'కి మర్థం భరతశ్రేష్ఠ
నైవ హన్యాః శిఖండినమ్
ఉద్యతేషు మథో దృష్ట్వా
సమరే ష్వాతతాయినమ్,
పూర్వముక్త్వా మహాబాహో
పంచాలాన్ సహసోమకైః
హనిష్యామీతి గాంగేయ
తన్మే బ్రూహి పితామహ.'

(ఉద్యో. 173. 1—2)

(పూర్వం సోమకులతోసహా పాంచాలురను వధిస్తానని చెప్పావు. యుద్ధాలలో ఆతతాయి అయిన శిఖండిని, నీమీదకు ఉద్యతాయుధుడై వస్తూ ఉండడం చూస్తూ కూడా నువ్వెందుకు ప్రహరించవు?)

దీనికి తిక్కన అనువాదం :

''అనవుడు దుర్యోధను 'డా
తని మీరు వధింపమికి గతం బేమియొకో
వినదగు నేనిం జెపుడా'
యనుటయు నిట్లనియె భీష్ము డతనికి నెమ్మిన్.''

(ఉద్యో. 4. 271)

'మునుపు అందరినీ చంపుతానన్నావు, మరి ఇప్పుడు శిఖండిని ఎందుకు చంపవు?' అని మూలంలో భీష్మణ్ణి దుర్యోధనుడు ప్రశ్నించడంలో అతని మనస్సులోని ఆరాటం తెలుస్తోంది. తిక్కన రచనలో అదిలేదు.

అప్పుడు భీష్ముడు దుర్యోధనునికి అంబకథ చెప్తాడు. తాను ఏకరథుడై కాశీరాజు సభకు వెళ్లి రాజుల నందరినీ అధఃకరించి కన్యలను హరించడం, తర్వాత యుద్ధంలో అందర్నీ ఓడించడం చెప్తాడు. సేనానాయకుడుగా అభిషిక్తుడైన భీష్ముడు పరమోత్సాహంతో ఉన్నాడు. ఆ సన్నివేశంలో అతడు తన పరాక్రమాన్ని చెప్పుకొనడం చాలా యుక్తం. వ్యాసుడు పది శ్లోకాలలో ఇదంతా వర్ణించాడు. తిక్కన టూకీగా 'యమ్మహోత్సవంబున నలంకృతలై యున్న యంబయు నంబికయు నంబాలికయునను ముువ్వురంబట్టి రథంబుపయి బెట్టుకొనిరా, నచ్చటిరాజులెల్లను జతురంగ బలంబులతో వచ్చి నన్నుం బొదివిన, బటువిశిఖానలశిఖాకలాపంబున వేడిమిసూపి వారిని నిలువరించి యరుగుదెంచి...' (4.274) అని మాత్రం నిరుద్వేగంగా వ్రాశాడు.

మూలంలో అంబాసాళ్వుల సంవాదం, సాళ్వుడు అంబను నిరాకరించడం వివరంగా హృదయావర్జకంగా కథితమైంది.

> 'త్వంహి భీష్మేణ నిర్జిత్య
> నీతా ప్రీతిమతీ తదా
> పరామృశ్య మహాయుద్ధే
> నిర్జిత్య పృథివీపతీన్. (175, 7)

(యుద్ధంలో భీష్ముడు రాజుల నందరినీ ఓడించి నిన్ను ఎత్తి తీసుకువెళిపోతున్నప్పుడు అతని ఎడ నువ్వు చాలా ప్రసన్నంగా ఉన్నావు.) అంటాడు సాళ్వుడు. భీష్ముడి చేతిలో ఓడిన అవమానం సాళ్వుడి మనస్సును దహిస్తోంది. ఆ భావం అక్కడ సాళ్వుడి మాటలలో స్ఫురిస్తోంది. తర్వాత అంబ అతనికి నచ్చచెబుతుంది, వేడుకొంటుంది. కాని అతడు వినడు.

> 'తా మేవం భాషమాణాంతు
> శాల్వః కాశిపతేః సుతామ్
> అత్యజద్ భరతశ్రేష్ఠ
> జీర్ణాం త్వచ మివోరగః.' (175. 19)

(ఈ విధంగా అనునయ వినయములు చేస్తున్న ఆమెను పాము పనికిరాని కుబుసాన్ని త్యజించినట్లు త్యజించాడు.)

అప్పుడు అంబ అతనితో—

> 'త్వయా త్యక్తా గమిష్యామి
> యత్ర తత్ర విశాంపతే
> తత్ర మే గతయః సంతు
> సంతః సత్యం యథా ధ్రువమ్.' (175. 22)

(నేను చెప్పినది సత్యమైతే, నీచేత పరిత్యక్తనైనా నేను వెళ్లిన చోటల్లా నాకు సజ్జన సాహాయ్యం లభించునుగాక !)

ఈ శ్లోకం అంబ వ్యక్తిత్వాన్ని ప్రదర్శిస్తోంది. ఆమెలో పట్టుదల ఉంది, ఆత్మవిశ్వాసం ఉంది. ఇంతవరకు మనకు కనిపించిన అంబవేరు, ఇకముందు కనిపించబోయే అంబ వేరు. భీష్మునితో సిగ్గుపడుతూ తాను సాళ్వరాజును ప్రేమించానని చెప్పి తనను అతని వద్దకు పంపమని సవినయంగా అర్థించిన అంబనూ, సాళ్వరాజును కాళ్లావేళ్లాపడి వేడుకొన్న అంబనూ ఇంతవరకూ కావ్యంలో చూశాం. ఇకముందు భీష్మణ్ణి చంపడమే తన కర్తవ్యంగా నిశ్చయించిన అంబను, స్త్రీత్వాన్ని గర్హించి పౌరుషాన్ని భజించిన అంబను చూస్తాం. ఈ శ్లోకం ఆమె హృదయపరివర్తనాన్నీ ఆమె జీవితంలో మలుపునీ సూచిస్తుంది.

ఈ సన్నివేశంలో తిక్కన రచన—

> 'అంబయు నట సాళ్వునికడ
> కుం బోయిన, నతడు భీష్ము కొనిపోయిన దా
> నిం బరచుం గైకొన ధ
> ర్మంబే? కన్యాత్వమెడలె మగువా నీకున్.
> (4.278)

.............................

కరుణంబుగ నేడ్చు తలో
దరి 'బో పొమ్మిచట నింక దడయకు' మని మం
దిరము వెడలంగ నడిచిన
నరిగె నదియు నార్తచిత్తయై వికలగతిన్.'

(4. 282)

ఈ పద్యాలు పొడిపొడిగా ఉన్నాయి. తిక్కన రచనలో కథ చెప్పుకు పోవడం తప్ప పాత్ర చిత్రణం మృగ్యం.

సాళ్వునిచేత తిరస్కృతయై వెళిపోతున్న అంబహృదయంలో దుఃఖం, కోపం ఉప్పొంగాయి. కాని తన దుఃఖానికీ కోపానికీ కారణమెవరో నిశ్చయించజాలని అయోమయస్థితిలో ఉందామె. ఆమె మనస్సులో రేగిన ఉద్విగ్నభావపరంపరను వ్యాసుడు చక్కగా అభివర్ణించాడు.

నిష్క్రామంతీతు నగరా
చ్చింతయామాస దుఃఖితా
పృథివ్యాం నాస్తి యువతి
ర్విషమస్థతరా మయా

బంధుభి ర్విప్రహీణాస్మి
శాల్వేనచ నిరాకృతా
నచ శక్యం పునర్గంతుం
మయా వారణ సాహ్వయమ్.

అనుజ్ఞాతాతు భీష్మేణ
శాల్వముద్దిశ్య కారణమ్
కింను గర్హా మ్యథాత్మాన
మథ భీష్మం దురాసదమ్.

అథవా పితరం మూఢం
యోమేఽకార్షీత్ స్వయంవరమ్
మయా యం స్వకృతో దోషో
యాహం భీష్మరథాత్తదా

ప్రవృత్తే దారుణే యుద్ధే
శాల్వార్థే నా పతం పురా.
తస్యేయం ఫల నిర్వృత్తి
ర్య దాపన్నాస్మి మూఢవత్.

ధిగ్ భీష్మం ధిక్ చ మే మందం
పితరం మూఢచేతసమ్
యేనాహం వీర్యశుల్కేన
పణ్యస్త్రీవ ప్రచోదితా.

ధిఙ్మాం ధిక్ శాల్వరాజానం
ధిక్ ధాతార మథాపివా
యేషాం దుర్నీత భావేన
ప్రాప్తాస్మ్య పద ముత్తమామ్.

సర్వథా భాగధేయాని
స్వాని ప్రాప్నోతి మానవః
అనయస్యాస్యతు ముఖం
భీష్మః శాంతనవో మమ.

సా భీష్మే ప్రతి కర్తవ్య
మహం పశ్యామి సాంప్రతమ్
తపసావా యుధా వాపి
దుఃఖహేతుః సమే మతః.'

(175. 26—34)

(నగరం నుంచి దుఃఖంతో నిష్క్రమిస్తూ అంబ ఇలా చింతించింది—నాకన్నా ఎక్కువ విషమావస్థలో పడిన యువతి పృథివిలో ఇంకెవర్తే ఉండదు. బంధువులకు దూరమయాను. సాళ్వుడూ నన్ను నిరాకరించాడు. ఇప్పుడింక హస్తినాపురానికి కూడా తిరిగి వెళ్లలేను. సాళ్వునియందు నా అనురాగం కారణంగా భీష్ముని అనుజ్ఞపొంది ఇక్కడకు వచ్చాను. ఇప్పుడు నన్ను నేను నిందించుకోనా ? లేక భీష్ముణ్ణి నిందించనా ? లేక నాకు స్వయరవరం చేసిన మూఢుడైన నా తండ్రిని నిందించనా? దారుణమైన యుద్ధం ప్రవర్తిస్తున్నప్పుడు భీష్ముని రథంనుంచి దూకి సాళ్వుని దగ్గరకు వెళ్లిపోవక పోవడం నా స్వకృత దోషం. దాని ఫలితంగా మూఢురాలివలె ఇలా ఆపద పాలయాను. ఛీ! ఛీ! ఛీ! భీష్ముణ్ణి, వీర్యశుల్క అని నన్ను పణ్యస్త్రీవలె అందరి మధ్యకూ త్రోసిన మూఢుడైన నా తండ్రినీ తలచుకొంటే అసహ్యం కలుగుతోంది. నామీదా సాళ్వరాజుమీదా విధాతమీదా అసహ్యం కలుగుతోంది. వీళ్లందరి దుర్నీతిచేతా

ఇంతటి ఆపద నాకు కలిగింది. మనుష్యుడు తనకు బ్రహ్మ నిశ్చయించిన దానిని అనుభవిస్తాడు. నాయీ అన్యాయాని కంతటికీ మూలం ఆ భీష్ముడే. అతడే నా దుఃఖకారణం. నేనిప్పుడు తపస్సుచేతకాని యుద్ధంలో కాని భీష్ముడి మీదే పగతీర్చుకుంటాను.)

దీన్నంతా తిక్కన ఒక చిన్న వచనంలోనూ పద్యంలోనూ వ్రాశాడు.

'చని చని యవ్వెలంది యిట్లని వితర్కించు
సాళ్వునకుగాని యపుడ సంసారమునకు
బాసితిన, యింక భీష్ముని పాలికేల
యరుగ, నాతండు మూల మీ హానికెల్ల
గాన యాతని సాధింతుగాక యేను.'
(4. 283—284)

తిక్కన సంక్షిప్త రచనలో కథ స్థూలంగా ఏం జరిగిందో చెప్పడం తప్ప పాత్రల మనో విశ్లేషణం లేదు.

తర్వాత అంబ తపస్సు చెయ్యబూని మునుల చేత నివారింపబడడం, హోత్రవాహనుడూ అకృత వ్రణుడూ రావడం, అందరూ కర్తవ్య సమాలోచన చెయ్యడం, అనంతరం పరశురాముడు రావడం, అతడు తిరిగి అంబను తనఅభీష్టం ఏదో చెప్పమనడం—ఇదంతా వ్యాసుడు వివరించాడు. ఈ వివరణ అంతా అంబ జీవిత సమస్య ఎంత జటిలమైందో పఠిత గుర్తించే టట్లు చేస్తుంది. వాస్తవానికి వాళ్లెవరూ తప్పు ఫలానివారిది, వారిని దండించాలి అని నిశ్చయించ లేదు. అంబకూడా భీష్ముడిదే తప్పు, అతడు వధ్యుడు అని మొదట్లో అనలేదు. అంబ విషమ పరిస్థితికి ఏ ఒక్కరూ పరిపూర్ణంగా బాధ్యులుకారు, అందరూ కొంత కొంతగా బాధ్యులు. తాను సాళ్వుణ్ణి ప్రేమించి నట్లూ, కనుక తనకు స్వయంవరం అనవసరమనీ అంబ ముందుగా తన తండ్రితో చెప్పి ఉండవల సింది; లేదా యుద్ధసమయంలో సాళ్వుని రథంమీదకి వెళిపోయి ఉండవలసింది. ఈ రెండుపనులూ చెయ్యక పోవడం అంబది తప్పు. బహుశః మహాపరాక్రమశాలి అయిన సాళ్వుడు నిర్జింపబడతాడని ఆమె తలంచి ఉండదేమో! స్వయంవరంలో సాళ్వుడే అందరినీ జయించి తనను తీసుకువెళ్తాడనుకొని ఉండవచ్చును. యుద్ధంలో ఆమె విభ్రాంతురాలై ఏమీ చెయ్యలేక పోయి ఉండవచ్చును. ఏమైనా మొట్టమొదటి తప్పు ఆమెదే! తర్వాతితప్పు భీష్ముడిదని తోస్తుంది. తన కొరకు కాక తన తమ్మునికిచ్చి పెళ్లిచెయ్యడానికి స్వపరా క్రమంతో కన్యలను హరించడం యుక్తం కాదుకదా! తర్వాతి తప్పు సాళ్వుడిది. భీష్మునిచేత ఓడిన అవ మానాన్నీ రోషాన్నీ అంబమీద తీర్చుకొనడం అతనికి యుక్తం కాదు. అతడు అంబను ఏలుకొని ఉండవల సింది. ప్రయత్నించి భీష్ముణ్ణి జయించి తన అవమా నాన్ని తొలగించుకొని ఉండవలసింది. కాని అతడా పనులు చెయ్యలేదు.

గచ్ఛ గచ్ఛేతి తాం శాల్వః
పునః పున రభాషత
బిభేమి భీష్మాత్ సుశ్రోణి
త్వంచ భీష్మ పరిగ్రహః' (175. 24)

(నువ్వు భీష్ముని భార్యవు. నేను భీష్ముడికి భయపడుతున్నాను. అని మళ్లీ మళ్లీ అన్నాడు.)

అంటూ అంబని తిరస్కరించడంలో మాత్రమే సాళ్వుడు తన మానం ప్రదర్శించుకొన్నాడు. మొత్తం మీద అంబ విషమపరిస్థితికి మూలకారణం ఆమే! కాని ఆమె మాత్రం భీష్ముడే మూలకారణమని ఎంచి అతనిపై పగబట్టింది. అందుకే పరశురామునితో ఆమె—

'జహి భీష్మం రణే రామ
గర్జంత మసురం యథా
సమాహూతో రణే రామ
మమచే దిచ్ఛసి ప్రియమ్' (178. 7)

(నాకు ప్రియం చెయ్యదలచినట్లైతే యుద్ధా నికి సన్నద్ధుడవై అసురునివలె గర్జిస్తున్న భీష్ముణ్ణి చంపు.)

అంటుంది. తప్పు ముగ్గురిలోనూ ఉన్నా అంబ భీష్ముణ్ణే తన కోపానికంతటికీ గురిచేసింది. ఇప్పు డామెకు ధర్మాధర్మవిచక్షణ లేదు. ఈ అంబని ఇలా చిత్రించడంలో పగబట్టిన స్త్రీ హృదయాన్ని వ్యాసుడు చక్కగా విశ్లేషించాడు. మునులూ ఇతరులూ అంబా—ఈ నిశ్చయానికి హఠాత్తుగా రాలేదు. వ్యాసుని రచనలో ఇది కనిపిస్తుంది.

తిక్కన ఈ భాగాన్నంతా సంక్షేపించి కథ మాత్రం చెప్పుకుపోయాడు. తిక్కన రచనలో ఆ పరిస్థితిలోని వైషమ్యచిత్రణం, పాత్రల మనోవిశ్లేషణా జరగలేదు. అంబ పరశురామునితో—

'అనవుడు నింతి యిట్లను,
మహాపురుషా! నను సాళ్వుడింక గై
కొన డదిసాలు, భీష్మదెస గోపము
నా మది గల్గియుండు, నా
తని వధియింప బూని యిట
తాపసవృత్తికివచ్చి యిచ్చటన్
నినుగని యీ పరాభవము సీగగ
నీ శరణంబు జొచ్చితిన్.' (4.298)

అంటుంది. 'జహి భీష్మం రణేరామ గర్జంత మసురం యథా' అనడంలో అంబకోపం ప్రదర్శితమవుతోంది. 'భీష్మదెసగోపము నా మది గల్గియుండు' అనడం పేలవంగా ఉంది.

భీష్మ పరశురాముల సంభాషణలో మూలంలోని కొన్ని మనస్సుని పట్టివేసే వాక్యాలని తిక్కన అనువదించలేదు.

'నభయా న్నాప్యనుక్రోశా
న్నార్థలోభా న్న కామ్యయా
క్షాత్రం ధర్మమహం జహ్యా
మితి మే వ్రత మాహితమ్.' (178.34)

(భయంచేతకాని, దయచేతకాని ధనలోభంచేత కాని, కామనచేతకాని క్షత్రియధర్మాన్ని నేను వదలను. ఇది నేను స్వీకరించిన వ్రతం.)

'కో జాతు పరభావాం హి
నారీం వ్యాళీ మివ స్థితామ్
వాసయేత గృహే జానన్
స్త్రీణాం దోషో మహాత్యయః' (178. 45)

(ఇతరునిపై అనురాగం కలిగి, ఆడపామువలె ఉన్నస్త్రీని ఎరుకగలవా డెవడు తన ఇంటిలో ఉంచుకొంటాడు? స్త్రీకి పరపురుషానురాగం ఉండడం చాలా అనర్థకరం).

ఇటువంటి శ్లోకాలు కొన్ని తిక్కన తెనిగించలేదు.

'యద్యాపి కత్థసే రామ
బహుశః పరిషత్సు వై
నిర్జితాః క్షత్రియా లోకే
మయై కే నేతి తచ్ఛృణు
న తదా జాతవాన్ భీష్మః
క్షత్రియో వాపి మద్విధః
పశ్చా జ్జాతాని తేజాంసి
తృణేషు జ్వలితం త్వయా.' (178. 62—63)

(నే నొక్కణ్ణే లోకంలో క్షత్రియుల నందరినీ నిర్జించానని సభలలో మాటిమాటికి ప్రగల్భాలు పలుకుతూ ఉంటావు. కాని ఇది విను— అప్పుడు భీష్ముడుగాని, నావంటి క్షత్రియుడుగాని పుట్టలేదు. తేజస్వంతులైన క్షత్రియులు తర్వాత పుట్టారు. నువ్వు గడ్డిపరకలమీద ప్రతాపం చూపించావు.)

ఈ శ్లోకాలలో స్ఫురిస్తున్న గాంభీర్యం తిక్కన అనువాదంలో చాలా క్షీణించింది.

'క్షత్రియుల దొల్లి యలుకకు
బాత్రము సేసితట? నాడు బలియుడు గంగా
పుత్రుడు పుట్టమి గాకిది
యీ ప్రతయి నింకేల చెల్లు నెరుగవె నన్నున్.'
(4. 313)

పరశురాముడు ఓడి వెళిపోయిన తర్వాత అంబ తపస్సు ప్రారంభిస్తుంది. ఈ వార్త భీష్ముడికి తెలుస్తుంది.

'యద్దైవ హి వనం ప్రాయాత్
సా కన్యా తపసే ధృతా
తద్దైవ వ్యథితో దీనో
గతచేతా ఇవా భవమ్,' (186.15)

(ఏ రోజున ఆ కన్య తపస్సు చెయ్యడానికి నిశ్చయించి అరణ్యానికి వెళిపోయిందో అప్పుడే నేను వ్యథితు

డినీ దీనుడినీ నష్టచేతుడినీ అయిపోయాను) అంటాడు భీష్ముడు.

తర్వాత అంబ తపస్సునీ, ఆమె వివిధాశ్రమాలలో సంచరించిన వృత్తాంతాన్నీ వ్యాసుడు ఇరవై అయిదు శ్లోకాలలో వివరించుతాడు.

'నిరాహారా కృశా రూక్షా
జటిలా మలపంకినీ
షణ్మాసాన్ వాయుభక్షా చ
స్థాణుభూతా తపోధనా.' (186.20)

'శీర్ణపర్ణేన చైకేన
పారయామాస సా పరమ్
సంవత్సరం తీవ్రకోపా
పాదాంగుష్ఠాగ్రధిష్ఠితా.' (186.22)

'తతోఽగమద్ వత్సభూమిం
సిద్ధచారణ సేవితామ్
ఆశ్రమం పుణ్యశీలానాం
తాపసానాం మహాత్మనామ్

తత్ర పుణ్యేషు తీర్థేషు
సాఽఽప్లుతాంగీ దివానిశమ్
వ్యచరత్ కాశికన్యా సా
యథా కామ విచారిణీ

నందాశ్రమే మహారాజ
తథోలూకాశ్రమే శుభే
చ్యవన స్యాశ్రమే చైవ
బ్రహ్మణః స్థానఏవచ

ప్రయాగే దేవయజనే
దేవారణ్యేషు చైవహ
భోగవత్యాం మహారాజ
కౌశిక స్యాశ్రమే తథా.' (186.24—27)

(ఆమె నిరాహారయై కృశించింది. జడలుకట్టి మొద్దుబారింది. ఆమె శరీరం మలపంకిలమయింది. ఆరునెలలు వాయుభక్షయై కాష్ఠంవలె నిశ్చలంగా తపస్సుచేసింది.........తనంతట తాను రాలిపడిన ఒక్క ఆకు తిని ఏడాది గడపింది. మహాకోపంతో పాదాంగుష్ఠాగ్ర స్థితయై తపస్సు చేసింది......... అక్కడనుంచి సిద్ధచారణ సేవితమైన వత్సభూమికి వెళ్లి అక్కడ మహాత్ములు పుణ్యశీలురు అయిన తాపసుల ఆశ్రమంలో సంచరించింది. అక్కడ పుణ్యతీర్థాలలో రాత్రింబవళ్లూ స్నానాలుచేస్తూ యథేచ్ఛగా సర్వత్ర సంచరించింది. నందాశ్రమంలోనూ ఉలూకాశ్రమంలోనూ చ్యవనాశ్రమంలోనూ బ్రహ్మస్థానంలోనూ దేవతలయజ్ఞస్థానమైన ప్రయాగలోనూ దేవారణ్యంలోనూ భోగవతిలోనూ కౌశికాశ్రమంలోనూ ఆమె స్నానాలూ దుష్కరవ్రతాలూ చేసింది.)

ఈ శ్లోకాలలో అంబ ఎంత కష్టపడిందో వర్ణించి ఆమె నిశ్చయం ఎంత గట్టిదో కవి స్ఫురింపజేస్తున్నాడు. ఇక్కడ తిక్కన రచన చూద్దాం.

'అంబ వృత్తాంత మరయంగ ననుదినంబు
దగిన వారల బుచ్చుచు దలకుచుందు
నేను నది యాదిగా జింత నేపుదక్కి
స్రుక్కి యుండియు రాజుల నుక్కుమడతు.'
(4. 361)

'రాజుల నుక్కుమడతు' అనడం ఇక్కడ అనవసరం.

'ఆ తన్వి యమునానదీతీరమున కేగి
యత్యుగ్రమగు తప మాదరించి
యాదుండి కౌశికు నావాస మాదిగా
గలుగు సిద్ధాశ్రమంబులకు నెల్ల
జని చని నిష్ఠురవ్రతములు సలుపంగ...'
(4. 363)

అని అంబ తపస్సు, తీర్థయాత్రలు మొదలైన వృత్తాంతమంతా తిక్కన అరపద్యంలో చెప్పేశాడు. ఈ అరపద్యంలో కథ తెలుస్తున్నదితప్ప అంబపడ్డ కష్టాలు మన కళ్లకు కట్టడంలేదు; అంబ దృఢ నిశ్చయం మనను ఆశ్చర్యభరితులను చెయ్యడంలేదు. ఘోరతపస్సు చేసెను, అనేకతీర్థములలో స్నానము చేసెను అని వ్రాయడం కవితారచనకాదు.

శివుడు వరమిచ్చి అంతర్హితుడయాక అంబ చితిలో ప్రవేశిస్తుంది. ఆ సన్నివేశాన్ని వ్యాసుడిలా వర్ణించాడు :

తిక్కన ఈ భాగాన్నంతా సంక్షేపించి కథ మాత్రం చెప్పుకుపోయాడు. తిక్కన రచనలో ఆ పరి స్థితిలోని వైషమ్యచిత్రణం, పాత్రల మనోవిశ్లేషణా జరగలేదు. అంబ పరశురామునితో—

'అనవుడు నింతి యిట్లను,
మహాపురుషా! నను సాళ్వుడింక గై
కొన డదిసాలు, భీష్ముదెస గోపము
నా మది గల్గియుండు, నా
తని వధియింప బూని యిట
తాపసవృత్తికివచ్చి యిచ్చటన్
నినుగని యీ పరాభవము నీగగ
నీ శరణంబు జొచ్చితిన్.' (4.298)

అంటుంది. 'జహి భీష్మం రణేరామ గర్జంత మసురం యథా' అనడంలో అంబకోపం ప్రదర్శితమవుతోంది. 'భీష్ముదెసగోపము నా మది గల్గియుండు' అనడం పేలవంగా ఉంది.

భీష్మ పరశురాముల సంభాషణలో మూలం లోని కొన్ని మనస్సుని పట్టివేసే వాక్యాలని తిక్కన అనువదించలేదు.

'నభయా న్నాప్యనుక్రోశా
న్నార్థలోభా న్న కామ్యయా
క్షాత్రం ధర్మమహం జహ్యా
మితి మే వ్రత మాహితమ్.' (178.34)

(భయంచేతకాని, దయచేతకాని ధనలోభంచేత కాని, కామనచేతకాని క్షత్రియధర్మాన్ని నేను వదలను. ఇది నేను స్వీకరించిన వ్రతం.)

'కో జాతు పరభావాం హి
నారీం వ్యాళీ మివ స్థితామ్
వాసయేత గృహే జానన్
స్త్రీణాం దోషా మహాత్యయః' (178. 45)

(ఇతరునిపై అనురాగం కలిగి, ఆడపామువలె ఉన్నస్త్రీని ఎరుకగలవా డెవడు తన ఇంటిలో ఉంచు కొంటాడు? స్త్రీకి పరపురుషానురాగం ఉండడం చాలా అనర్థకరం).

ఇటువంటి శ్లోకాలు కొన్ని తిక్కన తెని గించలేదు.

'యచ్చాపి కత్థసే రామ
బహుశః పరిషత్సు వై
నిర్జితాః క్షత్రియా లోకే
మయైకే నేతి తచ్ఛృణు
న తదా జాతవాన్ భీష్మః
క్షత్రియో వాపి మద్విధః
పశ్చా జ్జాతాని తేజాంసి
తృణేషు జ్వలితం త్వయా.' (178. 62—63)

(నే నొక్కణ్ణే లోకంలో క్షత్రియుల నంద రినీ నిర్జించానని సభలలో మాటిమాటికీ ప్రగ ల్భాలు పలుకుతూ ఉంటావు. కాని ఇది విను— అప్పుడు భీష్ముడుగాని, నావంటి క్షత్రియుడుగాని పుట్టలేదు. తేజస్వంతులైన క్షత్రియులు తర్వాత పుట్టారు. నువ్వు గడ్డిపరకలమీద ప్రతాపం చూపించావు.)

ఈ శ్లోకాలలో స్ఫురిస్తున్న గాంభీర్యం తిక్కన అనువాదంలో చాలా క్షీణించింది.

'క్షత్రియుల దొల్లి యలుకకు
బాత్రము సేసితటె? నాడు బలియుడు గంగా
పుత్రుడు పుట్టమి గాకిది
యీ త్రయి నింకేల చెల్లు నెరుగవె నన్నున్.' (4. 313)

పరశురాముడు ఓడి వెళిపోయిన తర్వాత అంబ తపస్సు ప్రారంభిస్తుంది. ఈ వార్త భీష్ముడికి తెలుస్తుంది.

'యద్దైవ హి వనం ప్రాయాత్
సా కన్యా తపసే ధృతా
తద్దైవ వ్యథితో దీనో
గతచేతా ఇవా భవమ్,' (186.15)

(ఏ రోజున ఆ కన్య తపస్సు చెయ్యడానికి నిశ్చ యించి అరణ్యానికి వెళిపోయిందో అప్పుడే నేను వ్యథితు

డినీ దీనుడినీ నష్టచేతుడినీ అయిపోయాను) అంటాడు భీష్ముడు.

తర్వాత అంబ తపస్సునీ, ఆమె వివిధాశ్రమాలలో సంచరించిన వృత్తాంతాన్నీ వ్యాసుడు ఇరవై అయిదు శ్లోకాలలో వివరించుతాడు.

'నిరాహారా కృశా రూక్షా
జటిలా మలపంకినీ
షణ్మాసాన్ వాయుభక్షా చ
స్థాణుభూతా తపోధనా.' (186.20)

'శీర్ణపర్ణేన చైకేన
పారయామాస సా పరమ్
సంవత్సరం తీవ్రకోపా
పాదాంగుష్ఠాగ్రధిష్ఠితా.' (186.22)

'తతోఽగమద్ వత్సభూమిం
సిద్ధచారణ సేవితామ్
ఆశ్రమం పుణ్యశీలానాం
తాపసానాం మహాత్మనామ్

తత్ర పుణ్యేషు తీర్థేషు
సాఽఽప్లుతాంగీ దివానిశమ్
వ్యచరత్ కాశికన్యా సా
యథా కామ విచారిణీ

నందాశ్రమే మహారాజ
తథోలూకాశ్రమే శుభే
చ్యవన స్యాశ్రమే చైవ
బ్రహ్మణః స్థానఏవచ

ప్రయాగే దేవయజనే
దేవారణ్యేషు చైవహ
భోగవత్యాం మహారాజ
కౌశిక స్యాశ్రమే తథా.' (186.24—27)

(ఆమె నిరాహారయై కృశించింది. జడలుకట్టి మొద్దుబారింది. ఆమె శరీరం మలపంకిలమయింది. ఆరునెలలు వాయుభక్షఐ కాష్ఠంవలె నిశ్చలంగా తపస్సుచేసింది.........తనంతట తాను రాలిపడిన ఒక్కఆకు తిని ఏడాది గడపింది. మహాకోపంతో పాదాంగుష్ఠాగ స్థితయై తపస్సు చేసింది......... అక్కడనుంచి సిద్ధచారణ సేవితమైన వత్సభూమికి వెళ్లి అక్కడ మహాత్ములు పుణ్యశీలురు అయిన తాపసుల ఆశ్రమంలో సంచరించింది. అక్కడ పుణ్యతీర్థాలలో రాత్రింబవళ్లూ స్నానాలుచేస్తూ యథేచ్ఛగా సర్వత్ర సంచరించింది. నందాశ్రమంలోనూ ఉలూకాశ్రమంలోనూ చ్యవనాశ్రమంలోనూ బ్రహ్మస్థానంలోనూ దేవతల్లయజ్ఞస్థానమైన ప్రయాగలోనూ దేవారణ్యంలోనూ భోగవతిలోనూ కౌశికాశ్రమంలోనూ ఆమె స్నానాలూ దుష్కరవ్రతాలూ చేసింది.)

ఈ శ్లోకాలలో అంబ ఎంత కష్టపడిందో వర్ణించి ఆమె నిశ్చయం ఎంత గట్టిదో కవి స్ఫురింపజేస్తున్నాడు. ఇక్కడ తిక్కన రచన చూద్దాం.

'అంబ వృత్తాంత మరయంగ ననుదినంబు
దగిన వారల బుచ్చుచు దలకుచుందు
నేను నది యాదిగా జింత నేపుదక్కి
సుక్కి యుండియు రాజుల నుక్కుమడతు.'
(4. 361)

'రాజుల నుక్కుమడతు' అనడం ఇక్కడ అనవసరం.

'ఆ తన్వి యమునానదీతీరమున కేగి
యత్యుగ్రముగు తప మాచరించి
యాదుండి కౌశికు నావాస మాదిగా
గలుగు సిద్ధాశ్రమంబులకు నెల్ల
జని చని నిష్ఠురవ్రతములు సలుపంగ...'
(4. 363)

అని అంబ తపస్సు, తీర్థయాత్రలు మొదలైన వృత్తాంతమంతా తిక్కన అరపద్యంలో చెప్పేశాడు. ఈ అరపద్యంలో కథ తెలుస్తున్నదితప్ప అంబపడ్డ కష్టాలు మన కళ్లకు కట్టడంలేదు; అంబ దృఢనిశ్చయం మనను ఆశ్చర్యభరితులను చెయ్యడంలేదు. ఘోరతపస్సు చేసెను, అనేకతీర్థములలో స్నానము చేసెను అని వ్రాయడం కవితారచనకాదు.

శివుడు వరమిచ్చి అంతర్హితుడయాక అంబ చితిలో ప్రవేశిస్తుంది. ఆ సన్నివేశాన్ని వ్యాసుడిలా వర్ణించాడు :

'తతః సా పశ్యతాం తేషాం
మహర్షీణా మనిందితా
సమాహృత్య వనాత్ తస్మాత్
కాష్ఠాని వరవర్ణినీ
చితాం కృత్వా సుమహతీం
ప్రదాయ చ హుతాశనమ్
ప్రదీప్తేఽగ్నౌ మహారాజ
రోషదీప్తేన చేతసా
ఉక్త్వాభీష్మ వధాయేతి
ప్రవివేశ హుతాశనమ్
జ్యేష్ఠాకాశిసుతా రాజన్
యమునా మభితో నదీమ్.'

(187.17—19)

(ఆ తర్వాత ఆమె ఆ మహర్షులందరూ చూస్తూఉండగా అడవిలో కట్టెలు ప్రోగుచేసి పెద్ద చితివేసి అగ్ని కూర్చింది. రోషదీప్తహృదయయై 'భీష్మవధకోసం'అంటూ కాశిరాజు కూతుర్లలో పెద్దదైన అంబ యమునానదీతీరంలో ప్రదీప్తమైన అగ్నిలో ప్రవేశించింది)

దీనికి తిక్కన **అనువాదం :**

'......ఆ ప్రొద్దు సమిధలు సాల గూడ
పైచి యనలంబుగూర్చి యవ్వనిత క్రోధ
దీప్తమూర్తియై 'భీష్ము వధించువాఁడ'
ననుచు సొద జొచ్చె మునులకు నద్భుతముగ.'

(4. 368)

అర్థం ఒకటే అయినా వ్యాసుని రచన కలిగిస్తున్న విషాదానుభూతిని తిక్కన రచన కలిగించడం లేదు. వ్యాసుని కథనం 'జ్యేష్ఠా కాశిసుతా రాజన్ యమునా మభితోనదీమ్' అన్న పంక్తితో ముగుస్తూ, అంబ బాధామయజీవితం యమునాతీరంలో అలా అవసితమైంది' అన్న విషాదానుభూతిని మనలో కలిగిస్తోంది. యమున ఒడ్డున చితిలో అంబ మండిపోతున్న విషాద దృశ్యాన్ని మన కళ్లముందు వ్యాసుడు ఈ పంక్తివలన చిత్రించగలిగాడు. తిక్కన మాటలలో ఈ భావ చిత్రణం కొరవడింది.

**మొత్తంమీద** అంబోపాఖ్యానంలో వ్యాసుని రచన సర్వాంగ పుష్టి, బలమూ, తేజస్సూ కల శరీరం వలె ఉండగా, తిక్కన రచన అస్థిపంజరం వలె ఉంది. వ్యాసుని రచన చదువుతూఉంటే కరుణ, ప్రేమ, ఔదార్యం, రోషం, అసూయ, పగ మొదలైన అనేక గుణములుకల పూర్ణమానవులు మన కళ్లముందు సహజంగా నడయాడుతారు. తిక్కన పాత్రలు తోలుబొమ్మలాటలో బొమ్మలవలె ఎవరో కదిలించి మాటాడించుతున్నట్లుగా కొంచంకొంచంగా గబుక్కున కదులుతూ మాటాడుతారు.

నిర్వచనోత్తర రామాయణంలో మూలాన్ని పెంచి వర్ణనలు చేర్చి రచించిన తిక్కన, భారతాన్ని ఇలా ఎందుకు కృశింపజేశాడని మనకి ప్రశ్న కలుగుతుంది. దీనికి జబాబు సంస్కృతంరాని వారికొరకు మహాభారతంలోని విషయాలు సూక్ష్మంగా చెప్పడం కొరకే తిక్కన మహాభారతానువాదం చేశాడని చెప్ప వలసివస్తుంది. 'మహాకవిత్వదీక్షావిధి నొంది' అని కావ్యాదిని ప్రతిజ్ఞచేసి తిక్కన అనువాదానికి ఉపక్రమించాడు. కాని అక్కడక్కడ కొద్దిసన్నివేశాలుతప్ప అతని అనువాదంలో చాలావరకూ కావ్యపుష్టి కొరవడిందని చెప్పక తప్పదు. సముద్రగంభీరమైన వ్యాస భారతంముందు కవిత్రయభారతం పిల్లకాలువవలె కనిపించక తప్పదు.

———

# ఛందోవాణి

శ్రీ శనగన నరసింహస్వామి

వాసర వాసర ప్రచురవైఖరి నిప్పులు క్రుమ్మరించి బల్
వేసగి నిష్క్రమించు పదవింబడి వచ్చెడి శీతలానిలా
గ్రేసరముల్ ధరాస్థలికి కేవల భోగ్యములయ్యె నాడు సం
ధ్యాసమ యారుణాభ్ర జలదభ్రమణంబులు దర్శనీయముల్.

అస్తధరావతంససుమమై చెలువొందు గభస్తి జూచి ద
ర్భాస్తర భాసమాను ద్రుహిణాభుని వాల్మికుగాంచి విస్మయ
గ్రస్తమతుల్ సమాత్తపులకప్రకటాంగులు మౌళిమండల
న్యస్తకరుల్ ముదశ్రుభరితాక్షులునైరి వటుల్ నదీతటిన్.

బిలబిలమని నలుదిక్కుల
నలముకొనిన గాఢతమము నలనల్లన వె
న్నెలలు కబళించె విపిన
స్థలి క్రమముగ నిద్రజెందె; తటుకున నంతన్

చిటపొటగా మొదలై ను
త్కటమై జడికురిసి వనము కలవర పడియెన్
కుటజాంగణ మృగశాబము
పటుగతిఁ నరమోడ్పు గనుల వణకగ సాగెన్

తరువు లౌదల వంచెను తడియెరకల
మేనులందూర్చె పులుగులు మేదినీధ్ర
కందరాసుప్తకేసరి కనులతెఱచి
ఘనజటాభార మొకఠీవిగా విదిర్చె

తమసా తీరంబున సం
యమి చంద్రుడు చనదొడంగె మాధ్యాహ్నిక కృ

త్యము దీర్ప భరద్వాజుడు
ప్రముఖాంతేవాసి వెంటరా వినయమతిన్

కలశమొకచేత వల్కలకొండ మొక్క
చేత గ్రహియించి వెన్నాడు శిష్యవరుడు
గురువునకు ముందరెవ్వరో కోరి కోరి
పోవుచున్నట్టు లెడద నపోహ పడెను

వనమహోర్వీరుహ వలమాన పవమాన
సంతాన నిర్నిద్ర చంక్రమములు
పద్మాకరోర్మికా ప్లవమాన మాంసల
విహగదంపతికుల విహరణములు
ప్రావృడభ్రధ్వాన రమమాణ మదకేకి
నాయక శృంగార నర్తనములు
గిరిశృంగ పతమాన వరనిర్ఝరీ భంగ
ఘుమ ఘుమ గంభీర ఘోషణములు

నయన పేయంబులున్ శ్రవణ ప్రియములు
కాగ నూతన ఘనకాల కల్పిత వన
సీమ శోభను గాంచుచు చిత్రభావ
మత్తుడై పోవసాగెను మౌనిమౌళి

అమల జలపూర్ణ కూలంకషావతార
సవిధ సుందర సైకత స్థలము నందు
పంచశరభోగ పరవశ క్రౌంచమిథున
మక్షి గోచరమయ్యె మహర్షి కపుడు

కామ సుమబాణవిద్ధుడు క్రౌంచవిభుడు
భావి కనలేడు యమరాజపాశమనగ
రివ్వు రివ్వున చనుదెంచి మవ్వపు నెఱ
గుండెలో శాతశర మొందు గ్రుచ్చుకొనియె.

కుత్తుకయెండి క్రుంగె నెలుగుల్ పువురెక్కల జంట తోగె క్ర
న్నెత్తుట చీకటుల్ కనులనిండెను చోటిడె ఛిన్నభిన్నమై

మిత్తికి వెన్నముద్ద పసమించినగుండె క్షణక్షణంబుగా
మత్తిరిపోయె దేహము క్రమమ్ముగ తూలెను ఫేనిలాస్యమై

మెడ వ్రేలవైచి నెత్తుటి
మడువున దోగాడుచున్న మగనింగని పే
రడవియు ప్రతిరవ నెపమున
నడలగ నెలుగెత్తి ఖగకులాంగన యేడ్చెన్

మనసున దోచిన చీకటి
కనులం గనిపింప విభుని కాయంబును ము
క్కున గీఱుచు విహగాంగన
గొనగొన శోకించె మౌని గుండెలు కరగన్

శరవేదనాభరమ్మున
గిరగిర కన్నుగుడ్లు తిరిగి క్రిందై మీదై
ధరణిం బొరలుచు త్రెళ్లిన
పురుషఖగముఁ గాంచి కరుణ పొంగులు వారన్.

చిరసహచరు దుస్సహతర
విరహంబున గుండె వ్రీలి విలపించు వయ
స్తరుణిం గనుగొని సంయమి
కరుణామయుఁడగుచు రక్తకంజాక్షుండై

ఆగెను తత్పదాత్తనయనాబ్జుడు శిష్యుడు కొంతవెన్కగా
నాగెను నాఁగుదాటి విహగార్థము వేచను బోయ భీతుడై
యాగెను విస్మయోరుచకితాంచలమై తమస్ప్రవాహమే
యాగెను గంధవాహదరహాసములాగె నదేమి చిత్రమో.

స్మర వశ మిధునము నిమిషాం
తరమున విరహార్తిముంచి దర్పించు దయా
విరహితు నిషాదుఁగని ముని
నిరసించుచు బలికె కనుల నిప్పులురాలన్.

'మానిషాద ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతీః సమాః
యత్ క్రౌంచ మిథునా దేక మవధీః కామమోహితమ్.'

పాదబద్ధము నక్షర పాళి సమము
విమల తంత్రికాలయ సమన్వితము నౌచు
వెడలి శోకార్తమౌని ప్రవృత్తవాణి
అన్యథాకాక శ్లోకమై మాన్యమయ్యె.

ఛందస్సుందరనిస్సృత
నిందా వాక్కులు దలంచి నివ్వెఱపడి మౌ
నీందుం డపూర్వమోదము
నందుచు నదిగ్రుంకి చనె తదర్థైకమతిన్.

గురుదేవ వదన గిరికం
దర నిర్గత వాక్ఝురీ కృతస్నాన విధి
స్ఫురితాఖిలాంగు డగుచున్
తరలె భరద్వాజు డడుగు తడబడు చుండన్.

గురుదేవ వదన కమలో
దర నిస్సృత వాక్య మధు నితాంత నిపాన
స్ఫురితాఖిలాంగుడగుచున్
తరలె భరద్వాజు డడుగు తడబడుచుండన్.

వాగ్విధేయమ్మైన పావనశ్లోకము
మఱల మఱల శిష్యమౌళి చదువ
ముదిత హృదయు డగుచు మధుమయ ఫణితుల
మార్గదర్శియైన మౌని నడచె.

---

# భాసో హాసః కాళిదాసో విలాసః

శ్రీ ఉపాధ్యాయుల అప్పలనరసింహమూర్తి

సంస్కృత నాటక కర్తలలో భాసకాళిదాసులు జగత్ప్రసిద్ధులు. ఇరువురును మహాకవులు. బహుగ్రంథ నిర్మాతలు. వీరిలో భాసుడు ప్రథముడు. కాళిదాసు అనంతరకాలికుడు. భాస కాళిదాస మహాకవులనుగూర్చి అనేకులు వివిధకోణములలో పరిశోధనలు జరిపిరి.

"Kalidasa is not the earliest dramatist of Sanskrit; he mentions three dramatists famous in his time, and they are Bhasa, Saumilla and Kaviputra. Of them we know only the names of the last two. Of the first, namely Bhasa, we know that he had written a drama called the Svapna Vasavadatta, in which the herione Vasavadatta was seen by the hero in the sleep. Recently, a few dramas, thirteen in number, were published as the works of Bhasa, about fifty years ago, and about twenty years ago a forteenth was also added to this number. There must have been many dramas even prior to Bhasa, as is found in the work on dramaturgy of Bharata. But in a history of Sanskrit Literature, we have to start with Bhasa in dealing with drama, since his dramas are the earliest available now."

—Survey of Sanskrit Literature.
By C. Kunhan Raja.

పై వాక్యములు భాసుని రచనలయొక్క ప్రాచీనతను తెలుపుచున్నవి. ఇవి యెన్నడో వ్రాసిన వాక్యములు. అటుపిమ్మట అనేకులు జరిపిన పరిశోధనలవలన భాసనాటకము లేకకర్తృకములని ధ్రువపడినది. భాసుని ప్రాశస్త్యము బహుముఖముల వెల్లడియైనది. భాసుని రామాయణ నాటకముల మూలములనుగూర్చి వ్రాసిన గ్రంథమున శ్రీ జీరెడ్డి చెన్నారెడ్డిగారు ఇట్లు వ్రాయుచున్నారు.

"Bhasa is held in high esteem by the eminent scholars all over the world for the unique position he has occupied among the Sanskrit writers as the poineer in the art of writting a drama. No play complete in form and universally accepted as one written earlier than those of Bhasa is discovered as yet"

—Sources of the Bhasa's Ramayana plays.
—Sri. G. Chenna Reddy.

పై మాటలు ప్రత్యక్షరసత్యములు. భాసుని రచనలు ప్రాథమికములైనను అనంతరకాలికులైన నాటకకర్తల కందఱకు మార్గదర్శకములైనవి. భాసుని ప్రాచీన సంస్కృత ప్రాకృత కవులు కొందఱు స్తుతించిరి. వారిలో కాళిదాసు ఒకడు. అతడు తన మాళవికాగ్నిమిత్ర నాటకమున—

'ప్రథిత యశసాం భాస సౌమిల్ల కవిపుత్రాదీనాం ప్రబంధా నతిక్రమ్య కథం వర్తమానస్య కవేః కాళిదాసస్య కృతౌ బహుమానః'

ఇందు 'ప్రథిత యశసాం' అను విశేషణమును ముందుగ భాసుని పేర్కొనియుండుటయు కాళిదాసునకు భాసునిపైగల ప్రీత్యభిమానములను వెల్లడి చేయుచున్నది. దాని నాధారముగ గైకొని కాళిదాసు నిపై భాసుని ప్రభావ మెంతవఱకు కలదో పరిశీలింపవలయు ననెడి యూహపొడమినది. ఆ యూహకు జయదేవుని 'భాసో హాసః కవికులగురుః కాళిదాసో విలాసః' అనెడి స్తుతి మరికొంత ప్రోత్సాహము నిచ్చినది. హాసమునందు భావము నిగూఢముగ, గంభీరముగ నుండును. విలాసమునందు భావము వివరణప్రాయముగ, చిత్తవశీకరణధోరణిలో ఆహ్లాదకరముగ నుండును. భాసునియందు గంభీరముగ సూచితములైన భావములు కాళిదాసుచే గ్రహింపబడి విలాసముగ, రసవత్తరముగ పెంపొందింపఁబడినవని జయ

దేవుని ఊహయేమో! ఇరువురను ఒకే పాదమున స్తుతించుట మాత్రమే ఈనా ఊహ. కాధారము.

శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు శ్రీ జీరెడ్డిచెన్నారెడ్డిగారి గ్రంథమునకు ప్రస్తావన వ్రాయుచు—

'కాళిదాసునివంటి విశ్వకవికి అసూయను, స్పర్ధను కలిగించిన ప్రతిభామహితుడు భాసుడు. రంగస్థలమున రక్తి కలిగించు శిల్పములో సంస్కృత సారస్వతమున అతనిదే పైచేయి. అతని రచనలోని కొన్ని కొదవలను సవరించి కాళిదాసు రూపక శిల్పమును సంస్కరించి ముందుకు నడపినాడనుట సత్యమే, కాని భాసుని అసాధారణ ప్రతిభాగుణములు అందే నిలిచినవి—అనుకరింపరానివిగా'—అని పేర్కొని యున్నారు. ఇందు శ్రీ శర్మగారు పేర్కొనిన స్పర్ధ విద్యావిషయికము మాత్రమే. కాళిదాసునకు భాసునిపై గల పూజ్యభావము అతని ననుకరించుటయందే గోచరించు చున్నది.

'ఉపమా కాళిదాసస్య'—అని ప్రసిద్ధికదా!

'అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా
హిమాలయో నామ నగాధిరాజః
పూర్వాపరౌ వారినిధీన్ విగాహ్య
స్థితః పృథివ్యా ఇవ మానదండః'—

ఇది కుమారసంభవము నందలి ప్రారంభ శ్లోకము. పూర్వాపర సముద్రములలోనికి వ్యాప్తి చెందిన హిమవత్పర్వతపంక్తి భూమికి మానదండము వలె నున్నది అనునది ఇందలి ఉపమ. ఇది కాళిదాసుని ప్రసిద్ధ ఉపమాలంకారములలో నొకటి. ఈ రచనకు ప్రేరణ భాసుని స్వప్నవాసవదత్త నాటకమున నున్నదని యూహింపవచ్చును. అందలి చతుర్థాంకమున ఆకాశమునందు బారులుతీర్చి పయనించుచున్న సారస పంక్తిని చూచి ఉదయనుడు వసంతకునితో నిట్లనును.

'ఋజ్వాయతాంచ విరళాంచ నతోన్నతాంచ
సప్తర్షివంశ కుటిలాంచ నివర్తనేషు
నిర్ముచ్యమాన భుజగోదర నిర్మలస్య
సీమా మివాంబరతలస్య విభజ్యమానామ్'—

సారసపంక్తి అంబరతలమును విభజించు సీమారేఖవలె నున్నదని భాసుని కల్పన. భాసుడు అంబర తలమును విభజించిన కాళిదాసు భూమిని కొలిచెను. ఈ విధముగ భాసుని రచనలతో కాళిదాసుని రచన లన్నింటికి గల సంబంధమును పరిశీలింపవలయునన్న మిక్కిలి కష్టము. అందుచే నీ వ్యాసమున అభిజ్ఞాన శాకుంతల రచనపై భాసుని ప్రభావమును పరిశీలించుటకు సాహసించితిని. ఇది యొక సూచన మాత్రమే. పండితులు ఇందలి ఒప్పుతప్పులను పరిశీలింప వలయును.

కాళిదాసు భారతము నందలి శకుంతలోపాఖ్యానమును గ్రహించి స్వకపోలకల్పనలతో రసవత్తరము, లోకోత్తరమునైన అభిజ్ఞానశాకుంతలమును రచించి ప్రపంచఖ్యాతి నందినాడు. భారత రామాయణాది గ్రంథములనుండి మూలవస్తువును గ్రహించి స్వకపోల కల్పనలతో నాటక నిర్మాణము చేయుటకు భాసుడే మార్గదర్శి. శాకుంతలమునందు (1) వసంతకుడు. (2) అనసూయాప్రియంవదలు. (3) శార్ఙ్గరవ శారద్వతులు (4) గౌతమి (5) ఉపాధ్యాయ సోమరాతుడు మొదలగు నూతనపాత్రలు కల్పింపబడినవి. భాసుని నాటకములలో విదూషకపాత్ర సముచిత స్థానమును పొందినది. వాసవదత్త నాటకమున విదూషకునిపేరు వసంతుకుడే. శాకుంతలమునందలి విదూషకుని స్వరూప, స్వభావములు, సంభాషణలు, చేష్టలు భాసుని విదూషకపాత్రను పోలియున్నవి. అవిమారక నాటకము నందలి నలినిక—ధాత్రి, అనసూయా—ప్రియంవదల పాత్రసృష్టికి తగిన ప్రేరణ నీయుగలరు. ఇట్లే అమూలకములైన పాత్రల సృష్టియందు భాసుడు మార్గదర్శకుడైనాడు. శాకుంతలమున (1) భ్రమరవృత్తాంతము (2) వనగజవృత్తాంతము (3) కరభకవృత్తాంతము (4) దుర్వాస శాప వృత్తాంతము—అంగుళీయక వృత్తాంతము (5) సోమమతీ వృత్తాంతము - మొదలగు నూతన సన్నివేశ కల్పనలు గలవు. శాకుంతలమున భ్రమర వృత్తాంతము శకుంతలా దుష్యంతుల ప్రథమ సమావేశమునకై కల్పింపబడినది. ఈ కల్పన అవిమారక నాటకమున కురంగీ—అవిమారకుల ప్రథమసమావేశమునకై కల్పింపబడిన గజవృత్తాంతముతో సంవదించుచున్నది. దుర్వాస శాప వృత్తాంతము అవిమారకము నందలి చండభార్గవుడు

సౌవీరభూపతిని శపించిన వృత్తాంతమునకు దగ్గరగ నున్నది. అభిజ్ఞానశాకుంతలమున కీలకపాత్ర నిర్వహించిన అంగుళీయకము భాసుని అవిమారక నాటకమున గూడ నట్టి విశిష్టప్రాధాన్యమునే పొందినది. అందు అవిమారకుడు విద్యాధరుని వలన నొక యంగుళీయకమును పొందును. అది ధరించినవారు అదృశ్యులగుదురు. ఆ అంగుళీయక సహాయమున అదృశ్యరూపమును పొంది అవిమారకుడు తన ప్రియురాలైన కురంగిని కలుసుకొనును. శాకుంతలమున షష్ఠాంకమున శకుంతల స్నేహితురాలైన సానుమతి అదృశ్యరూపమును ధరించి దుష్యంతుని విరహబాధను కనుగొనును. స్వప్నవాసవదత్త నాటకమునందు చతుర్థాంకమున వాసవదత్త పొదరింటి మాటున నిలిచి ఉదయనుని విరహావస్థను తిలకించుట, ఆ సమయమునందలి వాసవదత్త సంభాషణ—సానుమతీ వృత్తాంత కల్పనకు ప్రోత్సహించినవి. శాకుంతలమున విప్రలంభశృంగారరసము లోకోత్తరముగ పోషింపబడినది. అట్టి సన్నివేశములు భాసుని అవిమారక — వాసవదత్త నాటకములందు గూడ పరాకాష్ఠ నందినవి. ఈ విధముగ పరిశీలించుచు పోయిన యెడల కాళిదాసుని స్వతంత్ర కల్పనలపై భాసుని ప్రభావము గలదను యూహ బలపడును. సన్నివేశకల్పనమునందేగాక వర్ణనలు, సంభాషణలు మొదలగు వానియందు కూడ కాళిదాసు భాసునిచే ప్రభావితుడైనట్లు గ్రహింపవచ్చును.

1. నాటక ప్రారంభమున సూత్రధారుడు చేటిని గానము చేయుమని కోరుట, ఆ గీతము నాలంబనముగ గైకొని పాత్రను ప్రవేశపెట్టుట నాటక సమయము. భాసుని ప్రతిజ్ఞా యౌగంధరాయణ నాటకమున నిట్లు గలదు.

సూత్రధారః— ఆర్యే! గీయతాం, తావత్ కించి ద్వస్తు. తత స్తత్ర గీత ప్రసాదితే రంగే వయమపి ప్రకరణ మారభామహే.

> పురుషం ప్రేషయిష్యామి
> వ్యక్త మాత్మహితే క్షమమ్।
> పురుషం ప్రేషయత్యేష
> యథా యౌగంధరాయణః॥—

అను సూత్రధారుని సంభాషణతో యౌగంధరాయణపాత్ర ప్రవేశపెట్టబడినది. శాకుంతల నాటకమున సూత్రధారుడు—

'నను ఇమమేవ తావ దచిర ప్రవృత్త ముపభోగ క్షమం గ్రీష్మ సమయ మధికృత్య గీయతామ్—' అని నటికిచెప్పి ఆమె గానమును విని—

'ఆర్యే! సమ్యగనుబోధితోఽస్మి. అస్మిన్ క్షణే విస్మృతం ఖలు మయా. కుతః

> తవాస్మి గీతరాగేణ
> హారిణా ప్రసభం హృతః
> ఏష రాజేవ దుష్యంతః
> సారంగే ణాతి రంహసా'

అని పలుకుచు దుష్యంతుని ప్రవేశపెట్టును.

2. ప్రతిమా నాటకము నందలి ఈ క్రింది సన్నివేశమును పరికింపుడు. రాముడు వనవాసమునకేగెను. దశరథుఁడు మరణించెను. ఆ విషయములు తెలియని భరతుడు రథముపై అయోధ్యకు వచ్చుచున్నాడు.ఆ సన్నివేశమునందలి సంభాషణ ఇట్లున్నది.

భరతః— స్ఫురతి హృదయమ్. వాహయ రథమ్.

సూతః— యదాజ్ఞాప యత్యాయుష్మాన్.

(రథం వాహయతి).

భరతః—(సవేగం నిరూప్య) నఖలు రథవేగః. ఏతే తే

శ్లో॥ ద్రుమాధావన్తీవ
> ద్రుత రథగతి క్షీణ విషయా
> నదీ వోద్వృత్తాంబు ర్నిపతతి
> మహీ నేమి వివరే
> అరవ్యక్తి ర్నష్టా
> స్థితమివ జవాచ్చక్ర వలయం
> రజశ్చాశ్వోద్ధూతం
> పతతి పురతో నానుపతతి॥

ఈ వర్ణనను గ్రహించి కాళిదాసు దీనికి ప్రతిద్వంద్విగ మఱియొక రమణీయ వర్ణన మొనరించినాడు.దుష్యంతుడు రథికుడై హరిణమును వెంబడించుచున్నాడు. హరిణము మిక్కిలి వేగముగ పరుగెత్తుచున్నది. అది చూచి దుష్యంతు డిట్లనును.

రాజా :— కథ మనుపతత ఏవ మే ప్రయత్న ప్రేక్షణీయ సంవృత్తోఽయం మృగః. తేన సా విముచ్యంతా మభిషవః.

సూతః :—యదాజ్ఞాప యత్యాయుష్మాన్.

రాజా:—(స హర్షం) సత్య మతీత్య హరితో హరీంశ్చ వర్తంతే తే వాజినః. తథా హి.

శ్లో. యదాలోకే సూక్ష్మం
వ్రజతి సహసా తద్విపులతాం
యదర్ధే విచ్ఛిన్నం భవతి
కృత సంధాన మివ తత్ ।
ప్రకృత్యా యద్వక్రం
తదపి సమరేఖం నయనయో
ర్నమే దూరే కించిత్
క్షణమపి న పార్శ్వే రథజవాత్॥

ఇదియే శ్రీ శర్మగారు పేర్కొనిన స్పర్ధ.

ప్రతిమా నాటకమున భరతు డిట్లనును—

భరతః :—అథవ ఉపోపవిశ్య ప్రవేష్టవ్యాని నగరాణీతి సత్సముదాచారః. తస్మాత్ స్థాప్యతాం రథః. (రథాదవతీర్య) సూత! ఏకాంతే విశ్రామ యాశ్వాన్.

శాకుంతలమున భరతునితండ్రి కణ్వాశ్రమమున ప్రవేశింపఁబోవుచు—

రాజా :—(అవతీర్య) సూత! వినీతవేషేణ ప్రవేష్టవ్యాని తపోవనాని నామ. ఇదం తావత్ గృహ్యతామ్. (ఇతి సూతస్య ఆభరణాని ధనుశ్చ ఉపనీయ) సూత! యావ దహం ఆశ్రమవాసినః ప్రత్యవేక్ష్యోపావర్తే తావ దార్ద్రపృష్ఠాం క్రియంతాం వాజినః' అనును.

3. భాసుని వాసవదత్త నాటకమున ప్రథమాంకమున బ్రహ్మచారి తపోవనము నిట్లు వర్ణించును.

శ్లో॥ విస్రబ్ధం హరిణాశ్చర
న్త్యచకితా దేశాగతప్రత్యయా
వృక్షాః పుష్పఫలైః సమృద్ధవిటపాః
సర్వేదయా రక్షితాః
భూయిష్ఠం కపిలాని గోకుల ధనా
న్యక్షేత్రవత్యో దిశో
నిః సందిగ్ధ మిదం తపోవన మయం
ధూమోహి బహ్వాశ్రయః'

ఈ తపోవన వర్ణనను కాళిదాసు మిక్కిలి అభిమానించినాడు. శాకుంతలమున దుష్యంతుడు కణ్వాశ్రమమును వర్ణించుచు నిట్లనును.

'కుల్యాంభోభిః పవనచపలైః
శ్శాఖినో ధౌతమూలాః
భిన్నోరాగః కిసలయ రుచా
మాజ్య ధూమోద్గమేన
ఏతే చార్వా గుపవన భువి
చ్ఛిన్న దర్భాంకురాయాం
నష్టా శంకా హరిణ శిశవో
మందమందం చరంతి.'

భాసుని రచనయందు హాసప్రాయముగనున్న ప్రకృతి కాళిదాసుని రచనయందు తన విలాసము నెట్లు ప్రదర్శించినదో తెలుపుట కీ యుదాహరణ మొక్కటి చాలును. 'విస్రబ్ధం హరిణాశ్చరంతి' అని భాసుడు ప్రారంభింపగా 'హరిణ శిశవో మందమందం చరంతి' అని కాళిదాసు ముగించెను. వృక్షముల ప్రస్తావన, ధూమోద్గమము రెండు శ్లోకము లందును గలదు. భాసుని గోకులమునకు కాళిదాసుని శ్లోకమున చోటు చాలకపోయినది. ఈ సందర్భమున కాళిదాసు 'కుల్యాంభోభిః పవనచపలైః' అను శ్లోకమునకు ముందుగ 'నీవారాః శుకగర్భకోటరముఖభ్రష్టాస్తరూణా మధః' అను మఱియొక శ్లోకమును రచించిన విషయము గుర్తుంచుకొనవలెను. అట్టి స్వతంత్రమైన పెంపకమే కాళిదాసుని విలాసము.

4. యజ్ఞఫల నాటకమున శ్రీరాముడు పక్షి సంకులమైన వృక్షముపై అస్త్రప్రయోగమును చేయుచుండగా భరతుడు వారించిన విధమును పరికింపుడు.

శ్లో. 'నఖలు నఖలు వధ్యాః
పక్షిణోఽనాగసస్తే
సహ పృథుక కళత్రైః
తత్రవాసః కృతస్తైః

క్వబత విహగదేహః
చంచలా లాఘవేన
క్వ పున రశిని కల్పా
మృత్యుదూతాః శరాస్తే (3—38)

ఈ శ్లోకము శాకుంతలము నందలి వైఖానస వృత్తాంతమునకు మిక్కిలి సన్నిహితముగ నున్నది. దుష్యంతుడు హరిణమును సంహరించుటకై అస్త్ర సంధాన మొనరించును. ఆ సమయమున వైఖానసు డతనిని వారించిన విధమును చూడుడు.

శ్లో॥ 'నఖలు నఖలు బాణః
సన్నిపాతోఽయ మస్మిన్
మృదుని మృగశరీరే
పుష్పరాశా వివాగ్నిః
క్వబత హరిణకానాం
జీవితం చాతి లోలం
క్వచ నిశిత పాతాః
వజ్రసారాః శరాస్తే'—

ఈ శ్లోకములందలి సమాన భాగములను వేరుగ చూపవలసిన పనిలేదు. గమనింపవలసినది మాత్రము కలదు. 'మృదుని మృగశరీరే పుష్పరాశా వివాగ్నిః' అనెడి ఉపమలో కాళిదాసుని విలాసము వింతసోయగముల నీనినది. అందులకే జయదేవుడు కాళిదాసుని కవికులగురువని కొనియాడినాడు.

5. యజ్ఞఫల నాటకము నందలిదే మరి యొకటి. ఈ క్రింది రాముని ఆలోచనను పరికింపుడు.

శ్లో॥ నైవాగమ్యా నదుర్స్పాపా
యన్మనోమేఽత్ర ధావతి
కృత్యాకృత్య వివేకేతు
ప్రమాణం హి సతాం మనః

ఈ శ్లోకమునకు మిక్కిలి దగ్గరగ నున్న దుష్యంతుని మానసికావస్థను కనుగొనుడు. శకుంతల క్షత్రపరిగ్రహక్షమ యగునా ? కాదా ? అని సంశయించిన దుష్యంతుడు తనకు తానే ఇట్లు తీర్పు చెప్పకొనినాడు.

శ్లో॥ అసంశయం క్షత్రపరిగ్రహక్షమా
యదార్య మస్యా మభిలాషి మే మనః।
సతాం హి సందేహపదేషు వస్తుషు
ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః

పై శ్లోకములలో అక్షరములు మాత్రమే మారినవి. భావము రెండింట నొక్కటేగదా ! దీనిని అనుకరణ మనుటకన్న 'సంవాదిన్యో మేధావినాం బుద్ధయః' అని తలంచిన బాగుండునేమో !

6. బాలచరిత నాటకమున దేవకి పురిటి కందైన కృష్ణుని వసుదేవుని కప్పగించి చెరసాలలోనికి మరలినది. ఆ సమయమున భాసుని భావనాబలము దేవకి మానసికస్థితిని మన కన్నులయెదుట నిలువ బెట్టినది.

శ్లో॥ 'హృదయేనేహ తత్రాంగై
ర్ద్విధాభూతేవ గచ్ఛతి
యథా నభసి తోయేచ
చంద్రలేఖా ద్విధాకృతా'

ఆకాశమునందు, నీటియందును సంచరించు చంద్రలేఖవలె దేవకి హృదయము కృష్ణునియందును, అంగములు చెరసాల యందును గలదై నడచినదట. ఎంతటి మనోజ్ఞమైన పోలిక ! ఇట్టి ద్వైధీ భావము దుష్యంతునకు గూడ కలిగినది. శకుంతల దుష్యంతు నాకర్షించినది. ఆమె సాన్నిహిత్యమును కోరి ఎట్లైన కొన్నిదినములు కణ్వాశ్రమమున గడుపవలెనని దుష్యంతుడు తలచెను. ఆ సమయమున దుష్యంతుని తల్లి తానుచేయు వ్రతమునకు రావలసినదిగ అతనికి వార్త పంపినది. అంతకుముందే తాపసులు ఆశ్రమరక్ష చేయవలసినదిగ దుష్యంతుని కోరిరి. అతడేమి చేయవలెను? తపస్వికార్యమును కాదనునా? గురుజనాజ్ఞను ధిక్కరించునా ? ఆ సమయమున కాళిదాసు ఏమనెనో చూడుడు.

శ్లో॥ కృత్యయోర్భిన్నదేశత్వాత్
ద్వైధీభవతి మే మనః
పురః ప్రతిహతం శైలైః
స్రోత స్స్రోతోవహాయథా॥—

శిలా ప్రతిహతమైన స్రోతోవహమువలె దుష్యంతుని మనసు ద్విధావిభక్తమై పరుగులెత్తినది. భాసునికల్పనలో విభక్తమైనది చంద్రలేఖ యొక్క ప్రతికృతి మాత్రమే. కాళిదాసు కల్పనలో స్రోతోవహము నిజముగనే విభక్తమైనది. ఈ రెండు కల్పనలలో నేది యధికమైనదో రసజ్ఞులు నిర్ణయింప

గలరు. దేవకి, దుష్యంతుల మానసిక వ్యాపారమే ద్విధావిభక్తమైనది గదా! మనసు అమూర్తమైనది. ప్రతిబింబము మూర్తిమంతమైనను పట్టునకు దొరుకనిది. అందుచే నిట భాసునిదే పైచేయిగ భావించుట కాళిదాసుని కల్పనను తేలిక చేయుట మాత్రము కాదు.

7. యజ్ఞఫల నాటకమున దశరథుడు విదూషకునితో రామున కభిషేకము చేయవలయునా? భరతున కభిషేకము చేయవలయునా? అను విషయమును ప్రాసంగికముగ ముచ్చటించును. అనంతరము చపలుడైన విదూషకుడు తన ప్రసంగమును అంతఃపుర జనమునకు తెలుపునేమో యని భయపడి ఇట్లు పలుకుచున్నాడు.

శ్లో॥ క్వ నృపత్వ మనల్ప విప్లవం
క్వ కుమారాః సుకుమార చేతసాః
పరిహాస విజల్పితం త్విదం
పరమార్థం నహి మన్యతాం వచః

ఇట్టి స్థితియే దుష్యంతునకుకూడ కలిగినది. దుష్యంతుడు విదూషకునకు శకుంతలా వృత్తాంతము నెరింగించినాడు. అటుపిమ్మట తనకంటె ముందుగ నగరి కేగుచున్న విదూషకుడు అంతఃపురజనముతో శకుంతల సంగతి తెలుపునేమోయని భయపడి ఏమనుచున్నాడో చూడుడు.

శ్లో॥ క్వ వయం క్వ పరోక్ష మన్మథః
మృగశాబైః స్సమ మేధితో జనః
పరిహాస విజల్పితం సఖే
పరమార్థేన న గృహ్యతాం వచః

ఈ శ్లోకములు బింబప్రతిబింబములవలెనున్నవి కదా!

8. స్వప్నవాసవదత్త నాటకమున ఉదయనుడు వాసవదత్త లావాణకాగ్నియందు మరణించినదని విని విలపించిన తీరును బ్రహ్మవారి గుండెలు కరుగునట్లు వర్ణించెను. అందు—

'ఇహ తయా హసితమ్, ఇహ తయా సహ కథితమ్, ఇహ తయా సహ పర్యుషితమ్, ఇహ తయా సహ కుపితమ్, ఇహ తయా సహ హసితమ్'—అను మాటలు గమనింపదగినవి.

శాకుంతల తృతీయాంకమున శకుంతలా దుష్యంతులకు సమాగమమేర్పడినది. కాని గౌతమి రాక వారి కలయికకు భంగము కలిగించినది. శకుంతల వెడలిపోయినది. అపుడు దుష్యంతుడెట్లు చింతించినాడో పరికింపుడు.

'ఇహైవ ప్రియా పరిభుక్త ముక్తేషు లతా వలయేషు ముహూర్తం స్థాస్యామి. సర్వతోఽవలోక్య,

శ్లో॥ తస్యాః పుష్పమయీ శరీరలులితా
శయ్యా శిలాయామియం
క్లాంతే మన్మథలేఖ ఏష
నలినీపత్రే నఖైరర్పితః
హస్తాద్ భ్రష్ట మిదం బిసాభరణ
మిత్యాసజ్యమానేక్షణో
నిర్గంతుం సహసా
నవేత స గృహా చ్ఛక్నోస్మి శూన్యాదపి.'

శయ్యాశిలాయామియం, ఏషనలినీపత్రే, ఇదం బిసాభరణమ్—అనుచు వానిని చూచి తన విరహార్తినుపశమింపుకొన జూచుటయందు దుష్యంతుడు కొంతవరకు ఉదయనుని పోలినాడని భావింపవచ్చును.

9. ప్రతిమా నాటకమున పంచమాంకమున జలసేచన మొనరించుచున్న సీతను జూచి శ్రీరాముడు ఇట్లనును.

అయే! ఇయం వైదేహీ! భోః! కష్టమ్!

శ్లో॥ యా ఽస్యాః కరః శ్రామ్యతి దర్పణేఽపి
స నైతి ఖేదః కలశం వహన్త్యాః
కష్టం వనం స్త్రీజన సౌకుమార్యం
సమం లతాభిః కఠినీకరోతి॥

పూర్వము దర్పణమునైన మోయలేని సీత కరములు జలఘటమును ధరించుటయనెడి కష్టమును సహింపగల్గుట వనవాసమునకు ఫలితముగ రాము డూహించినాడు. శాకుంతల నాటకమున ప్రథమాంకమున వృక్షములకు జలసేచన మొనరించుచున్న శకుంతలను చూచి దుష్యంతు డిట్లు పలికెను.

శ్లో॥ 'ఇదం కిలావ్యాజ మనోహరం వపు
స్తపః క్షమం సాధయితుం య ఇచ్ఛతి

ధ్రువం స నీలోత్పల పత్రధారయా
శమీలతాం ఛేత్తు మృషి ర్వ్యవస్యతి॥'

ఇటు దుష్యంతుడు అవ్యాజమనోహరమైన శకుంతలా సౌందర్యమును తాపసనియమములతో క్లేశ పెట్టుచున్న ఋషిపై కోపించెను.

10. 'తత్ర శ్లోక చతుష్టయమ్' — అని శాకుంతలమునందలి చతుర్థాంకమునందలి నాలుగు శ్లోకములు ప్రసిద్ధిచెందినవిగదా! ఆ శ్లోకములపై భాసుని ప్రభావ మేమైనగలదేమో చూతము.

అవిమారక నాటకమున షష్ఠాంకమున మిత్రుని కలసిన హర్షకాలమున కుంతిభోజునకు కలిగిన మానసిక వికారమును గమనింపుడు.

శ్లో॥ 'చింతాకులత్వం వ్రజతీవ బుద్ధి
ర్వాక్యంచ బాష్పాహత గద్గదంచ
నేత్రే స బాష్పే ముఖ మప్రసన్నం
కిం హర్షకాలే క్రియతే వికారః—

బుద్ధి చింతాకులత్వమును పొందినదట. వాక్యము బాష్పాహత గద్గదమైనదట. నేత్రములు సబాష్పము లైనవట. ముఖ మప్రసన్న మైనదట.

శకుంతల నత్తవారింటికి పంపుచున్న కణ్వు డెట్లు చింతించినాడో జగమెరిగినదే కదా!

శ్లో॥ యాస్య త్యద్య శకుంతలేతి
హృదయం సంస్పృష్ట ముత్కంఠయా
కంఠస్తంభిత బాష్పవృత్తి
కలుష శ్చింతాజడం దర్శనమ్
వైక్లబ్యమ్ మమ తావ దీదృశ
మహో స్నేహా దరణ్యౌకసః
పీడ్యంతే గృహిణః కథంను
తనయా విశ్లేష దుఃఖైర్నవైః

ఈ శ్లోకమున పూర్వార్థము భాసుని పోసఘు కాగా మిగిలినది కాళిదాసుని విలాస మగుచున్నది.

11. అభిషేకనాటకమున హనుమంతుడు అశోకవనమును ధ్వంసమొనర్చుట వర్ణింపబడినది. అశోకవనము మండోదరికి ప్రియతమమైనదట. అందుచే అది భగ్నమైనట్లు ఆమెకు విజ్ఞప్తి చేయుట యెట్లున్నదో గమనింపుడు.

శ్లో॥ 'యస్యాం న ప్రియమండనాపి
మహిషీ దేవస్య మందోదరీ
స్నేహాల్లుంపతి పల్లవా న్నచ
పునర్వీజంతి యస్యాం భయాత్
వీజంతో మలయానిలో అపి
కరై రస్పృష్ట బాలద్రుమాః
సేయం శక్రరిపో రశోకవనికా
భగ్నేతి విజ్ఞాప్యతామ్॥

శకుంతల అత్తవారింటికి పోవునపుడు సన్నిహితములైన తపోవన తరువుల నుద్దేశించి కణ్వు డెట్లు వలికెను.

శ్లో॥ 'పాతుం న ప్రథమం వ్యవస్యతి
జలం యుష్మాస్వపీతేషు యా
నాదత్తే ప్రియమండనాపి
భవతాం స్నేహేన యా పల్లవమ్
ఆద్యే వః కుసుమప్రసూతి సమయే
యస్యా భవత్యుత్సవ
స్సేయం యాతి శకుంతలా—
పతిగృహం సర్వై రనుజ్ఞాయతామ్॥

ఈ శ్లోకమునందలి 'నాదత్తే ప్రియమండనాపి భవతాం స్నేహేన . యా పల్లవమ్' అను పాదము భాసుని శ్లోకము నందున్నదేకదా! రెండు శ్లోకము లందును ఒకేస్థలమున 'సేయం' అను మాట వాడబడినది. మొదటి శ్లోకము 'విజ్ఞాప్యతామ్' అని ముగియగా రెండవది 'అనుజ్ఞాయతామ్' అని ముగిసినది. భాసునిచే ప్రభావితుడై కాళిదాసు చేసినపెంపు మనోహరముగ, సహృదయ హృదయాకర్షకముగ నున్నది.

12. ప్రతిమానాటకమున ద్వితీయాంకమున రాముడు సీతాలక్ష్మణసమేతుడై అయోధ్యను విడచి వనవాసమున కేగునప్పటి పరిస్థితిని భాసుడు అనితర సాధారణముగా వర్ణించియున్నాడు.

శ్లో॥ 'నాగేంద్రా యవసాభిలాష విముఖాః
సాస్రేక్షణా వాజినో

హేషాశూన్యముఖాః
సువృద్ధవనితా బాలాశ్చ పౌరాజనాః
త్యక్తాహారకథాః సుదీనవదనా
క్రందంత ఉచ్చైర్దిశా
రామోయాతి యయా సదారః
సహజస్తామేవ పశ్యంత్యమీ॥

ఈ సంఘటనను వర్ణించునపుడు భాసుని భావనాబలము పరిధులను దాటినది. ఇంతటి పూర్వ రంగముండుటచేతనే భవభూతి మహాకవి 'అపిగ్రావా రోదంతి అపిదళతి వజ్రస్య హృదయం'అని వ్రాయ గలిగినాడా అనిపించును. భాసుని కల్పనకు ప్రతి ద్వంద్వియైన కాళిదాసు కల్పనను కూడ మనము చూచి తీరవలయును. శకుంతల అత్తవారింటికి కేగునపుడు ఉపస్థితవియోగమైన తపోవనముయొక్క అవస్థను కాళిదాసు ఇట్లు చిత్రించెను.

శ్లో॥ ఉద్గళిత దర్భకబళా మృగాః
పరిత్యక్తనర్తనా మయూరాః
అపసృత పాండుపత్రా
ముంచం త్యశ్రూణీవ లతాః

మృగములు దర్భకబళములను విడచినవట. మయూరములు నాట్యముచేయుట మానినవట. పండు టాకులను రాల్చుటచే లతలు కన్నీటిని విడచు చున్నట్లున్నవట! ఎంతటి మనోహరమైన కల్పన. ఒకరు ఆకులపై నడువగా వేరొకరు చిగుళ్లపై నడచిరి.

13. విప్రలంభ శృంగారవర్ణనయందుకూడ భాసుడు మార్గదర్శకుడైనాడు. అవిమారక నాటక మున కురంగి విరహావస్థను భాసు డిట్లు వర్ణించి నాడు.

శ్లో॥ సవ్యే కరే సముపవేశ్యముఖం సుదీనం
కాలం మనోభవ సహాయ మమృష్యమాణా
వ్యగ్రా విచింతయతి కించి దలోల దృష్టి
ర్బాష్పం నివారయితు మూర్ధ్వ మవేక్షమాణా'

ఇట్టి యవస్థనే కాళిదాసుకూడ కల్పించినాడు. చతుర్థాంకమున శకుంతల దుష్యంతునిగూర్చి యాలో చించుచు కూర్చున్నది. 'దుర్వాసమహర్షివచ్చి భిక్ష నడిగెను. ఆమెకు వినబడలేదు. అతడు క్రుద్ధుడై శకుంతలను శపించెను. అదియును ఆమె వినలేదు. దుర్వాసుని శాపవచనములను అనసూయాప్రియంవదలు వినిరి. ప్రియంవద దుర్వాసుని శాంతపఱచి శాప విమోచనమార్గమును కనుగొనినది. అప్పటికి కూడ శకుంతల చలనములేక కూర్చున్నది. ఆ సమయమున ప్రియంవద యిట్లు పలికినది.

'అనసూయే ! ప్రేక్షస్వ తావత్. వామహస్తోప హిత వదనా ఆలిఖితేవ ప్రియసఖీ భర్తృగతయా చింతయా ఆత్మానమపి నైషా విభావయతి. కిం పునరా గంతుకం.'

భాసుడు 'సవ్యేకరే సముపవేశ్య ముఖం సుదీనం' అనగా కాళిదాసు 'వామహస్తోపహిత వదనా' అనెను. భాసుడు 'అలోలదృష్టిః' అనగా కాళిదాసు 'ఆలిఖితేవ' అనెను. భాసుని కల్పన కాళిదాసుని కెంత ప్రీతికరమో ఈ సన్నివేశములు తెలుపుచున్నవి.

14. స్వప్నవాసవదత్త నాటకమున నాయికా నాయకుల కలయికకు కారణమైన 'ఘోషవతి' ప్రస్తావన గలదు. వాసవదత్తతోపాటు ఘోషవతి కూడ పోయినది. తిరిగి ఘోషవతి లభించినపుడు ఉదయను డేమనుచున్నాడో కనుడు.

శ్లో॥ 'శ్రుతిసుఖనినదే ! కథంను దేవ్యాః
స్తన యుగళే జఘనస్థలేచ సుప్తా
విహగ గణ రజో వికీర్ణ దండా
ప్రతిభయ మధ్యుషితా 'స్యరణ్యవాసమ్'

అభిజ్ఞానాభరణమైన అంగుళీయకము తిరిగి లభించిన పిమ్మట దుష్యంతుడు దానిని చూచి ఏమను చున్నాడో చూడుడు.

'(అంగుళీం విలోక్య) అయే ! ఇదం తావ దసులభస్థాన భ్రంశి శోచనీయమ్—

శ్లో॥ తవ సుచరిత మంగుళీయ నూనం
ప్రతను మమేవ విభావ్యతే ఫలేన
అరుణనఖ మనోహర మాసు
తస్యాశ్చ్యుతమసి లబ్ధపదం యదంగుళీషు ॥

అచేతనములైన వస్తువులను పట్టుకొని ప్రశ్నించిన ఇరువురు నాయకుల విరహావస్థలు మిక్కిలి దయనీయముగ నున్నవి.

15. స్వప్నవాసవదత్త నాటకమున ఉదయన వసంతకులు వాసవదత్త—పద్మావతులను గూర్చి ముచ్చటించుకొందురు. వసంతకుడు తనకు వాసవదత్తపై గల అభిమానమును వ్యక్తము చేయును. అంతకు ముందుగల అలవాటు చొప్పున ఉదయను డిట్లనును.

'రాజా : భవతు. భవతు. వసంతక! సర్వమేతత్ కథ
యిష్యే దేవ్యై వాసవదత్తాయై.

విదూ : అవిహో, వాసవదత్తా? క్వత్ర వాసవదత్తా?
చిరాత్ ఖలు ఉపరతా వాసవదత్తా.

రాజా : (సవిషాదమ్) ఏవమ్ ఉపరతా.

అనేన పరిహాసేన
వ్యాక్షిప్తం మే మనస్త్వయా
తతో వాణే తథ్యైవేయం
పూర్వాభ్యాసేన నిఃసృతా.

అనును. ఈ సంఘటన ఉదయనుని ఉన్మాదావస్థను సూచించుచున్నది.

శాకుంతల షష్ఠాంకమున దుష్యంతుడు శకుంతల బొమ్మను వ్రాయును. అందు ప్రథమ సమాగమ సమయమునందలి భ్రమరముకూడ చిత్రింపబడినది. చిత్రరచన ముగిసినపిమ్మట దుష్యంతుడు దానిని యథార్థముగా భ్రమించెను. ఈ క్రింది సంభాషణ పరికింపుడు.

రాజా : శ్లో॥ బింబాధరం స్పృశసి
చేద్భ్రమర ప్రియాయా
స్త్వాం కారయామి
కమలోదర బంధనస్థమ్.

విదూ : భోః చిత్రం ఖ ల్వేతత్.

రాజా : కథం చిత్రం. వయస్య కిమిద మనుష్ఠితం
పౌరోభాగ్యమ్. దర్శనసుఖ మనుభవత' స్సాక్షా
దివ తన్మయేన హృదయేన స్మృతికారయా
త్వయా మే పునరపి చిత్రీకృతాకాంతాః (ఇతి
బాష్పం వికిరతి.)

ఉదయనుడు చనిపోయిన ప్రియురాలితో సంభాషించుటకు పూనుకొనెను. దుష్యంతుడు చిత్రగతయైన శకుంతలను రక్షింపబూని చిత్రగతమైన భ్రమరమును బెదరించెను. ఇందు ఎవరి ప్రేమ బలవత్తరమైనది? ఎవరు ప్రియురాలికొఱకు అధికముగా దుఃఖించువారు?

16. భాసుడు మరియొక అసాధారణమైన వర్ణన చేసియున్నాడు. మహోన్నతమైన పర్వత శిఖరమునుండి భూమిపైనున్న వస్తువులను చూచిన యెట్లుండునో వర్ణింపదలచినాడు. అవిమారక నాటకమున చతుర్థాంకమున కురంగీవిరహమును భరింపజాలక ఆత్మహత్య చేసుకొనదలచి అవిమారకు డొక ఉన్నత పర్వతశృంగము నధిరోహించును. ఆ సమయమున కచటి కొక విద్యాధరుడు ప్రియురాలితో కలిసి వచ్చును. అతడు ఆకాశయానము చేయుచు తన ప్రియురాలికి భూమిపైగల వస్తువులను చూపుచున్నాడు.

'విద్యాధరః : (ఆకాశయానం నిరూప్య) సౌదామని!
పశ్యపశ్య వసుంధరాయాః దూరస్థాం దర్శనీయాకృతిమ్. ఇహహి—

శ్లో॥ శైలేంద్రాః కలభోపమా జలధయః
క్రీడా తటాకోపమా
వృక్షాః శైవల సన్నిభాః
క్షితితలం ప్రచ్ఛన్న నిమ్నస్థలమ్
సీమంతా ఇవ నిమ్నగాః
సువిపులా సౌధాశ్చ బిందూపమా
దృష్టం వక్రమివా భిభాతి సకలం
సంక్షిప్తరూపం జగత్.

భాసుడు ఎన్నడైన ఆకాశయానము చేసెనా! ఉన్నతపర్వత శిఖరాధిరోహణ మొనర్చి అటనుండి తాను కనుగొనిన ప్రకృతిని యథాతథముగ వర్ణించెనా! కాళిదాసు నీ వర్ణన మిక్కిలి యాకర్షించినది. అతడు ఇంకను మీదకు పోయెను. అతనికి తగిన అవకాశము లభించినది. దుష్యంతుడు దుర్జయాది దానవ గణమును సంహరించుటలో ఇంద్రునకు సహాయ మొనరించి స్వర్గమునుండి తిరిగి వచ్చుచుండెను. ఆకాశయానము చేయుచున్న దుష్యంతుడు అటనుండి భూమిని చూచి మాతలికి ఆ సుందరదృశ్యమునుగూర్చి యిట్లు చెప్పుచున్నాడు.

'రాజా : (అధోఽవలోక్య) వేగావతరణాదాశ్చర్య
దర్శన స్సంలక్ష్యతే మనుష్యలోకః. తథాహి—

శ్లో॥ శైలానా మవరోహతీవ శిఖరా
దున్మజ్జతాం మేదినీ
పర్ణాభ్యంతర లీనతాం విజహతి
స్కంధోదయాత్పాదపాః
సంతానా స్తనుభావనష్ట
సలిలా వ్యక్తిం భజంత్యాపగాః
కేనాప్యుత్ క్షిపతేవ మర్త్యభువనం
మత్పార్శ్వ మానీయతే॥'

ఆకాశమునుండి అధికవేగమున భూమికి దిగుచున్నప్పటి దుష్యంతుని అనుభవమును కాళిదాసు అనన్యసామాన్యముగ నూహించినాడు. ఇట్టి వర్ణనలే కాళిదాసునకు అజరామరమైన ఖ్యాతి నార్జించినవి.

ఈ విధముగ భాసుని నాటకములతో కాళిదాసు కృతులను పరిశీలించిన 'భాసోహాసః—కాళిదాసో విలాసః' అను జయదేవుని స్తుతి ప్రత్యక్షర సత్యమని తెలియగలదు. ఈ వ్యాసమున అభిజ్ఞానశాకుంతలము మాత్రమే పరిశీలనకు గ్రహింపబడినది. ఈ పరిశీలన సరియైనమార్గమున నున్నదని తోచిన ఉత్సాహవంతులు కాళిదాసు మిగిలిన రచనలకు—భాసుని కృతులతోగల సంబంధమును పరిశీలింపగలరని ఆశించుచున్నాను.

ఇట మఱియొక విషయము ప్రస్తావింప వలయును. శ్రీ జీరెడ్డి చెన్నారెడ్డిగారు యజ్ఞఫల నాటకము భాసకర్తృకము కాదని సోపపత్తికముగ తమ యభిప్రాయమును వెల్లడించిరి. శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు ఆ యభిప్రాయమును బలపరచిరి. ఈ వ్యాసమున యజ్ఞఫల నాటకమునగల మూడు శ్లోకములకు కాళిదాసు శాకుంతల నాటకమునందు గల మూడు శ్లోకములతో దగ్గర సంబంధమున్నట్లు చూపబడినది. ఆ మూడును కాళిదాసు శ్లోకములకు నీరసానుకరణములుగ శ్రీ చెన్నారెడ్డిగారు భావించిరి. వారి యభిప్రాయమును ఖండించుట నా యుద్దేశముకాదు. కాని యితర విషయములనేకములలోగల సన్నిహిత సామ్యములను పరికించిన ఆ మూడు శ్లోకములను భాసుని రచన కనుకరణములనుట అవకాశమున్నదేమో ! ఈ విషయమును విమర్శకులు పరిశీలింతురు గాక !

---



# ది రోడ్

శ్రీ పి. కేశవరెడ్డి

1

'మహాలపల్లిని అగ్రహారాన్నీ కలుపుతూ ఒక రోడ్డు వేస్తే ఎంత బావుండును' అన్నాడు సుబ్బారాయుడు. అతడలా అనగానే పొగడచెట్టుమీదనున్న కాకి ఎర్రనినోరు తెరచి కాకాఅని అరిచింది.

*   *   *

'అదుగో పోస్టుమాస్టరుగారు వస్తున్నారు' అన్నాడు, తపాలాఫీసుముందు పొగడచెట్టు నీడన కూర్చునిఉన్న కరణం. వీధి చివరన పోస్టుమాస్టరుగారు గొడుగువేసుకుని వస్తూఉండడం కనిపించగానే అతనికి సంతోష మయింది. పొగడచెట్టు నీడనఉన్న అరుగుమీద కూర్చుని అతడు పోస్టుమాస్టరుగారికోసం అరగంటనుండి ఎదురుచూస్తున్నాడు. పట్నంలో కాలేజి చదువు వెలిగిస్తున్న కుమారునినుండి ఈ రోజు ఉత్తరం వస్తుందని అతడు ఆశలు పెట్టుకుని ఉన్నాడు.

పోస్టుమాస్టరుగారు పరుగే నడకగావచ్చి తపాలాఫీసు ముందాగాడు. గుమ్మంవద్ద చెప్పులు విడిచి గొడుగును ముడిచాడు.

'ఈ రోజు ఇంత ఆలస్యముయిందేం మాస్టారూ! స్కూలులో ఏదైనా విశేషమా?' అనడిగాడు పొగడచెట్టుబోదె నానుకుని, దాని వేళ్లపైన కూర్చునిఉన్న సుబ్బారాయుడు. అతడుగూడ కరణంతోబాటు అరగంటనుండి పోస్టాఫీసుముందు పడిగాపులు పడిఉన్నాడు. కాని అతడు ఉత్తరాలను అందుకోడానికి పుచ్చుకోడానికీ రాలేదు. పోస్టులో పంచాయితీబోర్డు ప్రెసిడెంటుగారిపేర వచ్చే వార్తాపత్రికకోసం వచ్చాడు. పేపరు చదవనిదే అతనికి దిక్కు తోచదు. పంచాయితీ బోర్డు ఏర్పడిననాటినుండి ఆ ఊరికి వార్తా పత్రిక క్రమందప్పక వస్తూంది. గ్రామస్థుల ఉపయోగార్థం ప్రభుత్వం కల్పిస్తున్న ఈ సౌకర్యాన్ని సద్వినియోగపరచుకోవాలన్న స్పృహ ప్రెసిడెంటుగారి భార్యకున్నంతగా మరెవ్వరికీ లేదు. వార్తాపత్రిక ఇంటికి రాగానే దాని మడతలైనా విప్పకుండా నీటిలో నానవేసి గుజ్జుగాచేసి దానితో రకరకాలైన బుట్టలు తయారు చేస్తుందామె.

మాస్టరు ఆఫీసు తలుపుతీస్తూ, 'స్కూలులో ఈ రోజు పెద్దవిశేషమే జరిగింది రాయుడూ. స్కూలును తనిఖీ చేయడానికి ఇన్‌స్పెక్టరుగారు చెప్పకుండా పెట్టకుండా వచ్చారు. ఒక ప్రశ్నలేనా ఒక అనుమానాలేనా. ఊపిరి తీసుకోనీకుండా ఊదరగొట్టేశాడనుకో. తీరా అతడిని సాగనంపి వచ్చే సరికి ఇంత ఆలస్యమయింది' అన్నాడు.

అతడు పోస్టుమాస్టరేగాదు, స్కూలుమాస్టరు గూడాను. అతడు సవ్యసాచికంటే ఘనుడు. సవ్యసాచి రెండు చేతులతో రెండు పనులు చేయగా ఇతడు ఒక చేతితోనే రెండుపనులు చేయగల సమర్థుడు. ఎనభైమంది బాలబాలికలుగల ఎలిమెంటరీ స్కూలులో అతడు హెడ్‌మాస్టరు. ఆ ఊళ్లో బ్రాంచి పోస్టాఫీసు ఏర్పడింది మొదలు దానికి అతడే పోస్టుమాస్టరు. నెలపెట్టగనే రెండు జీతాలు అతని చేతిలో పడతాయి. రెండు చేతులా ఆర్జించడమంటే ఇదే కాబోలు.

సుబ్బారాయుడు ఏదో స్ఫురణకు వచ్చినట్లు తలవెనక భాగాన గోక్కుని, 'అదా సంగతి. దిగవ వీధిలో పుల్లదుమ్ముపైన కారుచక్రాలు దొర్లిన గుర్తులు చూశాను. అప్పుడే అనుకున్నాను—ఊళ్లో కెవరో పెద్దవారు దిగారని. ఐతే ఆ వచ్చింది ఇన్‌స్పెక్టరుగారన్న మాట' అన్నాడు.

ఆ ఊరి వీధులలో కార్లు, జీపులులాంటి వాహనాలుతిరిగే అవకాశాలు చాల అరుదు. ఎన్నికల రోజులలో మాత్రం అభ్యర్థుల కార్లు పోటీపడుతూ ఆ ఊరి

వీధులలో తిరుగుతుంటాయి. అభ్యర్థులు తమ కార్లను నాలుగువీధులు కలిసే కూడలివద్ద ఆపి, గ్రామఫోను రికార్డులు వినిపిస్తారు. వారు తరచుగా వినిపించే పాటలలో 'ఏరువాకా సాగారో రన్నా—' అన్న పాట ఒకటి. పాటలను విని పిల్లలంతా బిలబిల మంటూ వచ్చి కారుచుట్టూ మూగుతారు. వార్లు కడు చోద్యంగా కారుచక్రాలను, హెడ్‌లైట్లను పరకాయించి చూస్తుంటారు. అంతచేరువగా నిలుచుని కారుని పరిశీలించే అవకాశం వాళ్ళకు అరుదుగా లభిస్తుంది. కొందరు కుర్రాళ్ళు లోపలికి పెడదూర్చి స్టీరింగుచక్రాన్ని తాకడానికి ప్రయత్నిస్తారు. స్టీరింగు ముందు కూర్చునిఉన్న డ్రైవరు పిల్లలను కసురుకుంటాడు. దాంతో పిల్లలు కారులో ఉన్నవారికి జెల్లాయిలు పెడుతూ పారిపోతారు. రికార్డుల అనంతరం అభ్యర్థి మైకను చేతిలోనికి తీసుకుని, 'సోదర సోదరీమణులారా—' అని ప్రారంభించి తన విన్నపాలను వాగ్దానాలను ఏకరపు పెడతాడు. అప్పుడే భోజనం ముగించిన రైతులు పంచెచెంగులకు చేతులు తుడుచుకుంటూ గడపముందు నిలబడి ఉపన్యాసాన్ని ఆలకిస్తారు. అరుగుమీద కూర్చునిఉన్న నిరుద్యోగియైన పట్టభద్రుడొకడు మైకులో వినిపిస్తున్న వాగ్దానాలను విని పళ్ళు కొరుకుకుంటాడు. ప్రచారం ముగిశాక వచ్చినదారినే వెనక్కు మళ్ళుతుంది కారు. పిల్లలు దాని ననుసరించి డొంకురోడ్డుదాక పరుగిడుతారు. కారు కనుమరుగయేంతవరకు చూస్తూ నిలబడతారు. తరువాత వెనుదిరిగి పుల్లగుమ్ముమీద కారుచక్రాలు వదిలిన జాడలమీదుగా నడుస్తూ ఊరు చేరుతారు.

ఇలా ఓట్లకోసం ముష్టి ఎత్తుతూ వచ్చే వారుపోగా, ఆ ఊరికి కారులో వచ్చేవాడు—మునసబుగారి అల్లుడు. మునసబుగారి అల్లుడు ఈ ఊరికి ఇరవైమైళ్లదూరాన ఉన్న పట్నంలో ఏదో పెద్ద ఉద్యోగం వెలగబెడుతున్నాడు. అతడు పెళ్ళాన్ని పుట్టింట వదిలిపెట్టడానికి గాని, పుట్టింటినుండి తీసుకువెళ్ళడానికిగాని వచ్చినప్పుడల్లా కారులోనేవస్తాడు. అతని కారు చాల పెద్దది. ఎంతపెద్దదీఅంటే— అది వీధినపోతూ ఉంటే చూసిన రైతు ఒకడు 'దీని టాపుమీద వరికళ్లాలు నాలుగు పెట్టుకోవచ్చునే' అన్నాడు. కాని మునసబుగారిఅల్లుడు తన కారును నాలుగువీధుల కూడలిలో నిలబెట్టడు. మామగారి భవంతిని ఆనుకునిఉన్న ప్రత్యేకమైన షెడ్డులో ఆపుతాడు. మునసబుగారి భవంతి రాజప్రాసాదంలాగ ఉంటుంది. అది ఊరి వైశాల్యంలో దాదాపు సగానికి ఆక్రమించుకునిఉంది.

మాష్టరు తాళం తీశాడు. కిరకిరమంటూ తలుపు తెరుచుకుంది. లోపలి అరలోని కొయ్యపెట్టెలోఉన్న పెద్దఫైలునుతీసి కిటికీప్రక్కనఉన్న టేబిలుమీద వేశాడు. జేబులోఉన్న తాళంచెవిలాగి సుబ్బారాయునిమీదికి విసిరాడు. సుబ్బారాయుడు తాళం చెవిని గాలిలోనే అందుకుని అల్లంతదూరాన కనిపిస్తున్న తపాలపెట్టెవైపు బయలుదేరాడు. ప్రతిదినం తపాలపెట్టెలో పోగయిన ఉత్తరాలను సేకరించి తీసుకెళ్లి మాష్టరుగారికి అందించడం సుబ్బారాయుడు నిర్వర్తించే జీతంలేని కొలువులలో ఒకటి. పోస్టాఫీసుకు ఎదురుగ వీధికవతలివైపునఉన్న బందెలదొడ్డి కిటికీ చువ్వలకు వ్రేలాడుతూఉంది ఎర్రటి తపాలపెట్టె. అది పోస్టాఫీసుముందు పరమశివునిముందు నందిలాగ భాసిస్తూ ఉంటుంది.

ఈ ఊరిలో బ్రాంచి పోస్టాఫీసు ఏర్పడడం ఈ ఊరి చరిత్రలో ఒక మైలురాయి అని చెప్పకోవచ్చు. రెండేండ్ల క్రితం ఈ ఊళ్లో పోస్టాఫీసు ఉండేదికాదు. ఐదుమైళ్ల దూరానఉన్న సబ్ ఆఫీసు నుండి ముసలి రన్నరొకడు ఉత్తరాలను తెచ్చేవాడు. ఒక్కొక్కసారి అతడా ఉత్తరాలను కార్యార్థమై ఈ ఊరికి వచ్చేవారిద్వారా పంపేవాడు. ఇక ఆ ఉత్తరాలు తోకలేని పిట్ట తొంభై ఆమడ తిరుగగనే పొడుపుకథను సార్థకం చేసేవి. మొదటి సారిగ పై అధికారులెవరోవచ్చి ఈ ఊర్లో బ్రాంచి ఆఫీసు తెరవనున్నామని చెప్పినప్పుడు ఎంత హంగామా జరిగిందని! తపాలాఫీసుకు కావలసిన స్థలాన్ని మేమిస్తామంటే మేమిస్తామని అంతహా ముందుకొచ్చారు. తద్వారా వచ్చే అద్దెడబ్బులకై అందరూ కక్కుర్తి పడ్డారు. చివరకా అవకాశాన్ని మునసబుగారే చేజిక్కించుకున్నారు. ప్రభుత్వంసొమ్ము తినడానికి మునసబుగారికి అచ్చివచ్చినట్లు ఇంకెవ్వరికీ రాలేదు.

ఇప్పుడు పోస్టాఫీసుగా ఉన్న స్థలం మునసబుగారి ట్రాక్టరు షెడ్డుగా ఉండేది. కిరోసిన్ పీపాలు

నాలుగైదు నేలమీద దొర్లుతూ ఉండేవి. కిరోసిన్ మరకలతో గోడలు అసహ్యంగా ఉండేవి. ఆరోజులలో ట్రాక్టరు డ్రైవరుగా పనిచేస్తుండిన కుర్రాడు ఆ షెడ్డులో చాలా గ్రంథం నడిపాడని ప్రతీతి.

సుబ్బారాయుడు తపాలపెట్టెను తెరిచాడు. అందులోని ఉత్తరాలను తీసుకుని వెనుదిరిగాడు. ఉత్తరాలను లెక్కపెడుతూ తీసుకువెళ్ళి కిటికీగుండా మాస్టరుగారి టేబిలుమీద ఉంచాడు. కరణంగారు ఆ ఉత్తరాలకేసి కళ్ళు చిట్లించిచూసి, 'ఒక డొక్కు కార్డు, రెండు పుచ్చిపోయిన కవర్లు—ఈ భాగ్యానికే ఈ ఊరికి పోస్టాఫీసు కావలసి వచ్చింది.' అన్నాడు.

మాస్టరుగారు ఫైలులోనుండి తలెత్తి కరణంగారివైపు తీక్షణంగాచూసి అంతలో చిరునవ్వు నవ్వి, 'ఏమండోయ్ కరణంగారూ, మా ఆఫీసుకొచ్చే ఉత్తరాల సంఖ్యను కించపరుస్తున్నారు. ఏమనుకున్నారో గాని—వసంతమ్మగారి ఉత్తరాల పరంపరకే ఒక బ్రాంచి ఆఫీసు తెరవాల్సి వచ్చేట్టుగా ఉంది' అన్నాడు. అది విని కరణంగారు, 'ఏమిటీ!' అంటూ జిరాఫీలాగ మెడచాచాడు.

వసంతమ్మ మునసబుగారి మొదటి కూతురు. ఆమె మొగుడు కాలంచేసి ఇప్పటికి మూడేళ్లయింది.

కరణంగారు తన మెడను యథాస్థానంలోకి తెచ్చుకుని, 'ఎవరికి రాస్తుందయ్యా ఉత్తరాలు. స్వర్గంలో ఉన్న మొగుడికిగాని రాస్తుందా ఏమిటి?' అనడిగాడు.

మాస్టరు కలాన్ని సిరాలో ముంచుతూ, 'అలా అన్నా నమ్మే వారున్నారులే. ఐనా పెద్దవాళ్ల ఇంటి గుట్లు మనకెందుకు. వాళ్లు ఏం చేసినా చెల్లుతుంది—లావుమీద వాంపు తెలియనట్లు' అన్నాడు.

కరణంగారు గొంతు సవరించుకున్నాడు. భావి కాలంలో మానవులు శీలాన్ని, నీతిని విడనాడి బ్రతకబోయే వైనంగురించి వీరబ్రహ్మంగారు విరచించిన తత్వాన్ని గళమెత్తిపాడడం ప్రారంభించాడు. అతడు బ్రహ్మంగారి భక్తుడు. కాలజ్ఞానతత్వాలన్నీ అతనికి కంఠతావచ్చును. అతడు పాడుతూవుంటే పొగడచెట్టు మీదనున్న పిచ్చుకలు కిచకిచమంటూ వంతపాడసాగాయి. కరణం పాడడం ముగించి సుబ్బారాయుడివైపుతిరిగి—'ఆ విధంగా — ఈ వక్కభూప్రపంచ మీమీద ఉండుకున్నటువంటి అరవైనాలుగుకోట్ల జీవరాసులు—'అంటూ ప్రారంభించి ఏదో చెప్పబోయాడు.

సుబ్బారాయుడు గబుక్కున తన చూపుడు వేళ్లను కర్ణరంధ్రాలలో జొనిపాడు. కారణమేమిటో గాని అతనికీ బ్రహ్మంగారితత్వాలకు ఉప్పుకు నిప్పుకు లాగ పడదు.

కరణంగారు సుబ్బారాయునివైపు గుర్రుగా చూసి, 'రాయుడూ, నేను వర్ణించే కాలజ్ఞానతత్వాలు మరీ అంత కర్ణకఠోరంగా ఉన్నాయటయ్యా నీకు. పోయిన జన్మలో ఎన్నిపాపాలు చేసుకున్నావో—ఇలా హరిజనుడవై పుట్టావు; ఇప్పుడైన గురుని వాగమృతం సేవించు. వచ్చే జన్మలోనైనా సద్గతి లభిస్తుంది' అన్నాడు.

తనను కరణంగారు 'మాలోడ'ని పేర్కొనందుకు సుబ్బారాయుడు ఇంచుక సంతోషించాడు. సాధారణంగా అగ్రహారీకులు అతనిని, 'మాలోడ'ని పిలుస్తుంటారు. కొందరు, 'కులం తక్కువకొడకా' అనికూడ పిలుస్తుంటారు.

రాయుడు రెండుచేతులు జోడించి, 'మహాప్రభూ. ఆ తత్వాలు నాకు వినిపించకండి. అదిగో మీ శిష్య పరమాణువు రానేవస్తున్నాడు. గురుని వాగమృతాన్ని అతనిపై కురిపించండి' అన్నాడు.

కరణంగారు తలతిప్పిచూశాడు. సైకిలొకటి గరుత్మంతుడులాగ రివ్వున దూసుకువస్తూంది. దాని మీదున్న గెడ్డంసాయిబు అవిరామంగా బెల్లు మ్రోగిస్తున్నాడు. అతడు రన్నరు. ప్రతిరోజు సబ్ ఆఫీసు నుండి తపాలసంచిని తీసుకొస్తుంటాడు.

రన్నరు సైకిలుదిగి స్టాండువేస్తూ— 'నమస్కారం గురూ. మళం వెళ్ళొచ్చారటగా. ఏమిటి విశేషాలు' అన్నాడు.

'రారా నవాబూ. ఇలావచ్చి కూర్చో. అంతా సవిస్తరంగా చెబుతా. నీకు గాకపోతే మరెవ్వరికి చెబుతాను' అన్నాడు కరణం అరుగుమీద చోటు చూపిస్తూ. రన్నరు తపాలసంచిని పోస్టుమాస్టరుగారి కందించి, కరణంగారి ప్రక్కన కూర్చుని భక్తిపూరితమైన కళ్లతో చూశాడు.

మాస్టరుగారు ఫైలునుమూసి తపాలసంచిని

చేతిలోకి తీసుకున్నాడు. సంచిని పగలగొట్టి అందులోని ఉత్తరాలను టేబిలుమీద గుమ్మరించాడు. పేరంటానికి వచ్చిన వారిపై పన్నీరు చిలకరించినట్లు, వచ్చిన ఉత్తరాలమీద గుండ్రని ముద్రలు ముద్రించ సాగాడు మాస్టరు. ఉత్తరాలమీద సుబ్బారాయుని చూపులు పూలమీద తుమ్మెదల్లాగ సారాడసాగాయి. అతనికి కావలసింది వార్తా పత్రిక. దాని నతనికి అందించాడు మాస్టరు.

మాస్టరు ముద్రలు దంచుతున్న చప్పుడు విని మునసబు కూతురు వసంత వరండాలో కొచ్చింది. వీధిలో గోలీ లాడుతున్న కుర్రాడిని పిలిచి వాడి చెవిలో ఏదో చెప్పింది. వాడు మాస్టరు దగ్గరకొచ్చి, 'జాబు లేవన్నా ఉంటే వసంతమ్మగారు పట్టుకమ్మన్నారు' అన్నాడు. మాస్టరు ఒక లావాటి కవరునుతీసి వాడి చేతిలో పెట్టాడు. కుర్రాడు తిరిగొచ్చేంతవరకు వసంత జడగంటలను చేతిలో తిప్పుతూ వరండాలో పచార్లు చేసింది. కుర్రాడు అందించిన లావాటి ఉత్తరాన్ని చూడగనే ఆమె ముఖం చాటంతయింది. పైట తనంతటదే జారిపోయింది.

పొగడ చెట్టు వేళ్లమీద కూర్చుని సుబ్బారాయుడు వార్తాపత్రికను విప్పాడు. పత్రిక పేజీలో గాంధీజీవితానికి సంబంధించిన ఒక చిత్రం ఉంది. ఆ బొమ్మలో—హరిజనుల బావిచెంత ఒక స్త్రీ బొక్కెన చేతబట్టుకుని నిలుచుని ఉంది. ఆమె ముందు మహాత్ముడు దోసిలి వొగ్గి యాచిస్తున్నాడు. ఆమె, 'నేను మాలదాన్ని, బాపూ' అంటూంది. దానికి మహాత్ముడు, 'నేనడిగింది కులంకాదు. నీళ్లు మాత్రమే' అంటున్నాడు.

అది గాంధీ శతజయంతి సంవత్సరం. పత్రిక పేజీలలో అక్కడక్కడ గాంధీఫోటోలు, గాంధీ జీవితానికి సంబంధించిన కార్టూనులు, గాంధీసూక్తులు కనిపిస్తున్నాయి. ఈ శతజయంతి సంవత్సరాన్ని చిరస్మరణీయం చేయాలన్న కృషి దేశవ్యాప్తంగా కనిపిస్తూంది. జాతిపితవాణి దేశం నలుమూలలా మారుమ్రోగుతూంది. అతని దివ్యాత్మ ప్రతిభారతీయుని గుండెలోనూ నినదిస్తూంది.

సుబ్బారాయుడు పేజీలు తిప్పుతున్నాడు.

గాంధీపేరు వినగానే అతనికి స్ఫురించే ఆదర్శాలు మూడు—ఆత్మ పారిశుధ్యము, ఖద్దరు వస్త్రధారణ, హరిజనోద్ధరణ. అందులో మూడవ ఆదర్శం సుబ్బారాయుని జీవితానికి అత్యంతసన్నిహితమైనది. అతడు స్వయంగా హరిజనుడు. మహాత్ముని పట్ల భక్తిభావం అతని నరనరాలకూ పట్టిపోయింది. పతితులని, నికృష్టులని నలుగురిచే ఛీకొట్టబడిన తన జాతివారికి చేయూతనిచ్చి 'హరిజనుల'న్న ఉత్కృష్ట నామాన్నిచ్చినవాడు మహాత్ముడు. అస్పృశ్యతఅనే ఘోరశాపంతో అలమటిస్తున్న తన కులాన్ని అమృతహస్తమిచ్చి ఆదుకున్న యుగపురుషు డతడు. ఆ మహాత్మునికన్న తనకు నిత్యపూజితు డెవరు?

సుబ్బారాయుడి చేతులు పత్రిక పేజీలను తిప్పుతున్నాయి. అతని కళ్లు అక్షరాల పంక్తులమీద పరుగిడుతున్నాయి.

'—గ్రామంలో హరిజన యువకుడిని స్తంభానికి విరచికట్టి కిరోసిన్‌పోసి సజీవదహనం చేసిన దారుణ సంఘటన—'

'—గ్రామంలో హరిజన వనితలను పట్టపగలు నగ్నంగా వీధులవెంబడి నడిపించిన అమానుషకృత్యం—'

సుబ్బారాయుని కళ్లు చెమ్మగిల్లాయి. పత్రికలోని వాక్యాలు అతనికి మసకమసకగా కనిపిస్తున్నాయి.

దేశంలో గాంధీ సూక్తులను వల్లించనివారు లేరు. గాంధీ విగ్రహాలులేనిఊరు అరుదు. కాని ఆ మహాత్ముడు ఆశించిన హరిజనాభ్యుదయమే కానరావడం లేదు. అతడు తన అనుంగుబిడ్డలుగా పేర్కొన్న హరిజనులు ఇంకా చీకటిలోనే కుంగి కువారిల్లిపోతున్నారు.

నాగరికత శరవేగంతో మారుతూంది. మనుషుల వేషభాషలు మారుతున్నాయి. కట్టుబాట్లు మారుతున్నాయి. ఆచార సంప్రదాయాలు మారుతున్నాయి. కాని హరిజనుల వ్యవస్థకు సంబంధించినంతవరకు కాలచక్రం ఆగిపోయినట్లు సుబ్బారాయునికి అనిపించింది.

బాల్యంలో జరిగిన సంఘటన ఒకటి సుబ్బారాయుని మానసంలో చెరగనిముద్ర వేసుకుంది. ఆ సంఘటన అతని జీవిత గమనాన్నే మార్చివేసింది. ఆరోజులలో సుబ్బారాయుని ముసలితండ్రి మునసబుగారింటపాలేరుగా ఉండేవాడు. ఒకనాడు అత్యవసరమైన పనిమీద తండ్రిని

చూడడానికి మునసబుగారి భవంతికి వెళ్ళాడు సుబ్బారాయుడు. మునసబుగారు వీధి అరుగుమీద ఆసీనుడై ఉన్నాడు. పాలేర్లు అతనిముందు చేతులు కట్టుకుని నిల్చుని ఉన్నారు. అది దీపావళి ముందురోజు గనుక వారంతా పండుగ మామూళ్ళను పుచ్చుకునేందుకై వచ్చారు. ఎవరెవరికి ఎంతివ్వాలో తెలుసుకోడానికి మునసబు చిట్టాను పరిశీలిస్తున్నాడు. ఉన్నట్టుండి పటుక్కుమని ఏదో శబ్దం వినిపించింది. అతడు తల ఎత్తి చూశాడు. అతనిముందు మూడుబారాల దూరాన నిలుచునిఉన్న సుబ్బారాయునితండ్రి తమలపాకుకు సున్నంరాసి నోటిలో పెట్టుకుంటూ ఉండడం కనిపించింది. ఇందాకటిశబ్దం వాడు వక్కకొరకడం వల్ల పుట్టిందని గ్రహించడానికి మునసబుగారికి ఎంతో సేపు పట్టలేదు. తన సమక్షంలో కేవలం ఒక మాలవాడు జంకుగొంకు లేకుండా వక్కను పటుక్కున కొరకటంతో అతనికి తలకొట్టేసినంత పనయింది. చూస్తుండగానే అతనికళ్ళు ఎర్రనయ్యాయి. అతడు చినపాలేరు చేతిలోని ముల్లుగర్రను తీసుకుని, 'మాల కొడకా. కొవ్వు కళ్లకడ్డమొచ్చిందిరా నీకు.' అంటూ పులిలాగ ముందుకు దూకాడు. ఒక్కదెబ్బకే ముల్లుగర్ర రెండు తునక లయింది. ఆ దెబ్బలోని తీవ్రత అంతటిది. సుబ్బారాయుని తండ్రికి ప్రాణం విలవిలలాడింది. శరీరం వశంతప్పి ఆ వృద్ధుడు గబాల్న కిందపడ్డాడు. అతనిని మునసబు అందిన చోట్లల్లా తన్నసాగాడు. ఆ దృశ్యాన్ని చూస్తున్న సుబ్బారాయునికి—హరిజనులు తూకాలబండమీద చచ్చిన ఆవును కండలు కండలుగ చీలుస్తున్న దృశ్యం జ్ఞప్తికొచ్చింది. మునసబుగారి పిల్లలు వరండాలోనికొచ్చి టపాకాయలు కాల్చడం ప్రారంభించారు. సుబ్బారాయుని చేతిలోని టపాకాయలు వాటంతటవే జారిపోయాయి. అవి ఏటవాలుగఉన్న నేలమీద దొర్లుతూవెళ్ళి మునసబుగారి పిల్లల కాళ్ళ కిందపడి నలిగిపోయాయి. మునసబుగారి చేతులు నొప్పులుపుట్టాయి. అతని కణతల నెంబడి చెమటలు కారసాగాయి. అతనికి అలసట ముంచుకొచ్చింది. చేతిలోఉన్న విరిగిన ముల్లుగర్రను వృద్ధుని మీదకు విసిరికొట్టి అతడు లోపలికి వెళ్ళిపోయాడు.

మునసబుగారు వెళ్లిపోయాక కూడ సుబ్బారాయుని తండ్రి బాధతో మూలుగుతూ నేలమీద దొర్లుతూనే ఉన్నాడు. అతని నోటిలోనుండి చొంగ కారుతూ ఉంది. చొంగతోబాటు అతడు కొరికిన వక్కగూడ నేలమీదపడింది. ఇద్దరు పాలేర్లు చేయూతనిచ్చి అతనిని మాలపల్లికి నడిపించుకొచ్చారు. అతని వొళ్లు పచ్చిపుండులాగ తయారయింది. గుడ్డపీలిక మీదపడినా అతడు కెవ్వుమని కేకవేసేవాడు. ఆ రాత్రి అతని గుడిసెలో జాగరణ జరిగింది.

మరుసటి దినం దీపావళి. ఆ యింట పండుగ ఛాయలుగూడ కనిపించలేదు. మూడు రోజులక్రితం తండ్రి తనకోసం సంతలో కొనితెచ్చిన టపాకాయలను సుబ్బారాయుడు తాకనైనా లేదు. పండుగ కానుకగా కుట్టించిన కొత్తబట్టలు వాడిని ఆకర్షించలేదు. వాడు పెరట్లో ఒంటరిగా కూర్చుని ఆలోచించసాగాడు. మునసబుగారి తన్నులకు తాళలేక తనతండ్రి నేలమీద దొర్లుతూ మూలుగుతున్న దృశ్యం అతని కళ్లకు కట్టింది. తూకాలబండమీద తనకులంవారు చచ్చిన ఆవును కండలు కండలుగ చీలుస్తున్న దృశ్యం అతని కళ్లముందు కదలాడింది.

వార్తాపత్రికతో ముఖంమీద విసురుకోసాగాడు సుబ్బారాయుడు. పొగడ చెట్టునీడన కూర్చునిఉన్నాగాని అతనికి చెమట పడుతూంది.

కరణంగారు గూడ తుండుగుడ్డతో ముఖంమీద విసురుకుంటూ, 'నాడే చెప్పాడు గురుడు—భూమ్మీద ధూమకేతువులు పుడతాయని—చంద్రుడు సైతం చంద్రనిప్పులు కురిపిస్తాడని. ఆ కాలం అప్పుడే ఆసన్నమైనట్టుంది'అని ఆ తరవాత తత్సంబంధమైన తత్వాన్ని అందుకున్నాడు.

రన్నరు కరణంగారువిసురుతున్నగాలి బాగా తగిలేట్టుగా చేరువగా జరిగి, 'ఈ తత్వాలు నాకూ కంఠతా వచ్చునుగాని, మఠంలో విశేషాలు చెప్ప గురూ' అన్నాడు.

'ఎన్నని చెప్పనురా నవాబూ. ఏడు తరాలక్రితం ఒకనాడు బ్రంహంగారు వేపపుల్లతో దంతధావనం చేసుకుని ఆ పుల్లను పెరట్లో గుచ్చాడట. అది పెరిగి పెద్దదై మహావృక్షమయింది. ఆ చెట్టులోని పుల్లలతో రోజూ దంతధావనం చేసుకున్నవాడిని ఏరోగమూ సమీపించదు' అన్నాడు కరణం.

తపాలసంచికి ముద్రవేస్తున్న మాస్టరు తల యెత్తి, 'ఒక్కబ్రంహంగారి చెట్టే ఏమిటి. వేప

పుల్ల—అది ఏచెట్టులోనిదైనా ఆరోగ్యదాయకమే. వేపపుల్లలో అమృతం ఉందని వేదాలలో రాసిఉంది' అన్నాడు.

కరణంగారు మాస్టారువైపు కొరకొరచూస్తూ, 'మహానుభావుల లీలలను అనుమానించడమేగాని, నమ్మడంచేత రాదుగదా మీ కుర్రకారుకు.' అన్నాడు.

రన్నరు అతన్ని సముదాయిస్తూ, 'పోనీలెండి గురూ. ఆ కుర్రాయనకేం తెలుస్తుంది మన గురుని మహిమ' అన్నాడు.

తండ్రి పోయేనాటికి సుబ్బారాయునికి పద్నె నిమిదేండ్లు. తండ్రికి పెద్దకర్మ తీర్చిన నాటి సాయంత్రం అతడు చెరువుగట్టుమీద నడిచి వస్తుండగా, మునసబుగారి పాలేరువచ్చి, 'నిన్ను అయ్యగారు రమ్మంటున్నారు' అని చెప్పాడు. సుబ్బారాయునికి చాలా భయమయింది. బితుకు బితుకు మంటున్న గుండెలతో అతడు మునసబుగారి భవంతి చేరాడు. మునసబుగారు పడకకుర్చీలో పడుకుని ఠీవిగ చుట్ట కాలుస్తున్నాడు. అతనిముందు సుబ్బారాయుడు చేతులు కట్టుకుని నిల్చున్నాడు.

మునసబుగారు అతనివైపు ఎగాదిగా చూసి, 'చంద్రిగాని కొడుకువు నువ్వేనా?' అనడిగాడు.

సుబ్బారాయుడు, 'నేనే స్వామీ' అన్నాడు వినయంగా;

'నీ అయ్య నాదగ్గర రెండొందలు తీసుకున్నాడు. అది చెల్లుకాకమునుపే చచ్చాడు.' అంటూ మునసబు తన పక్కనఉన్న స్టూలుమీదున్న పెద్ద పుస్తకంలోనుండి ఒక పత్రాన్నితీసి సుబ్బారాయునికి అందించాడు. సుబ్బారాయుడు ఆ పత్రాన్ని ఒకసారి చదివి తిరిగి ఇచ్చివేశాడు. 'మీ కిచ్చిన పైకంలో నూటయాభై పెట్టి మా అక్కకు పెళ్ళిచేశాం. మిగిలింది మా అయ్యకర్మకు అయిపోయింది. ఇప్పుడు నా దగ్గర చిల్లిగవ్వలేదు. వీలయినంత త్వరలో మీబాకీ తీర్చివేస్తాను' అన్నాడు సుబ్బారాయుడు.

అతడన్న మాటతో మునసబుగారిఅహం దెబ్బ తిన్నది. 'మీ బాకీ తీరుస్తాను' అన్న వాక్యం తన అహాన్ని కించపరుస్తున్న ట్లనిపించింది.

'నువ్వు బాకీలు తీర్చేటంత ప్రయోజకుడవై పోయావని నా కిదివరకు తెలియదోయ్' అన్నాడు మునసబు. అతని కంఠంలోని హేళనను సుబ్బారాయుడు గుర్తించలేదు.

'పోయినవారం మా మామ జాబురాశాడు సామీ. ఎవరితోనో సిఫార్సుచేసి నాకు రోడ్డుగాంగ్‌మాన్ పని తీసిస్తానని రాశాడు. నాకా ఉద్యోగం రాగానే మీ బాకీ తీర్చుకుంటాను.'

'నోర్ముయ్ మాలకొడకా. మాలబుద్ధులు పోనిచ్చావుకావు. అప్పుఇచ్చి పుచ్చుకోవడానికి నేనేం వడ్డీవ్యాపారి ననుకున్నావా ? మా ఇంట్లో పాలేరుగా ఉండే ఒప్పందంపైనే మీ అయ్యకు డబ్బిచ్చాను, వాడు చచ్చాడు. ఆ బాకీ తీరేంతవరకు నివ్విక్కడే పాలేరుగా పడుండు' అన్నాడు మునసబు.

సుబ్బారాయుని నెత్తిన పిడుగుపడి నట్లయింది. తూకాల బండమీద తన కులంవారు చచ్చిన ఆవును కండలు కండలుగ చీలుస్తున్నదృశ్యం కళ్లకు కట్టింది. 'ఆ చిత్రహింస నేనుపడలేను. ఆ బానిసత్వం నా కొద్దు.' అని అరవాలనిపించింది.

'అట్లాగే సామీ' అన్నా డతడు తలవంచుకుని.

'సరె. ఇకవెళ్ళు. రేప్పొద్దున వచ్చి పెద్దపాలేరుకు కనబడు' అన్నాడు మునసబు.

అతనివద్ద సెలవు పుచ్చుకుని సుబ్బారాయుడు కాళ్ళీడ్చుకుంటూ మాలపల్లి చేరాడు. అతడా రాత్రి కంటిమీద రెప్పవేయలేక పోయాడు. మునసబుగారి వద్ద పాలేరుగా పనిచేయడమంటే ఆత్మను తనువును అమ్ముకుని జీవించడమే. ఆత్మహత్యాసదృశమైన ఆ పాలేరువృత్తిని తలచుకున్న కొలది అతని శరీరం కంపించసాగింది. అతని ఆత్మ స్వచ్ఛందజీవితం గడపడానికై ఆరాటపడుతూంది.

ఈతచాప మీద పడుకుని అటూ, ఇటూ పొర్లుతూ రాత్రిని గడపసాగాడు సుబ్బారాయుడు. చాప పక్కన కుక్కితట్ట క్రిందఉన్న కోడిపుంజు అసహనంగా రెక్కలు టపటప లాడిస్తూంది.

తెల్లవారింది. సుబ్బారాయుడు కళ్ళు నులుము కుంటూ గుడిసెబయటి కొచ్చాడు. ఆ మసక చీకటిలో బొంతజెముడు పొదలవెనక సీతారాముడు తడు

గులో అడుగు వేసుకుంటూ నడుస్తుండడం అతనికి కనిపించింది. సీతారాముడు అతని స్నేహితుడు. వాళ్లిద్దరూ కలిసి తొమ్మిదో తరగతివరకు కలిసి చదువుకున్నారు.

'ఎక్కడికిరా సీతా, ఇంత పొద్దున బయలుదేరావు?' అనడిగాడు సుబ్బారాయుడు.

సీతారాముడు ఉలిక్కిపడి వెనుదిరిగి, 'ష్ గట్టిగా అరవకు. నేను సైన్యంలో చేరిపోదలచుకున్నాను. ఇవ్వాళే రిక్రూట్‌మెంటు. ఇంట్లోవాళ్లకు తెలియకుండా వెళ్లిపోతున్నాను. ఇంకో నెలరోజులదాక నా ఆచూకీ ఎవరికీ చెప్పకు' అన్నాడు. బ్రతిమాలుతున్నట్లు.

తూర్పున పట మెగిరింది. సుబ్బారాయునికి కర్తవ్యం బోధపడింది. అతడు కుక్కిమంచను పైకెత్తాడు. కోడిపుంజు పిట్టగోడమీదకు గెంతి తూర్పుదిక్కుకు తిరిగి తీవిగా కూతవేసింది.

సుబ్బారాయుడు మిత్రునితో కలిసి సైన్యంలో చేరిపోయాడు.

విషయం తెలిసి మునసబు కుతకుత ఉడికిపోయాడు. నరబలి తప్పిపోయిన క్షుద్రదేవతలాగ విజృంభించాడు. ఆహారం లభించని సింహంలాగ పంజా విసిరాడు. కాని అతని పంజాకు అందని శిఖరాన్నే చేరుకున్నాడు సుబ్బారాయుడు.

ఐదేండ్ల అనంతరం సెలవులలో స్వగ్రామం వచ్చాడు సుబ్బారాయుడు. వచ్చిన మరునాడే మునసబుగారి భవంతికి వెళ్లి తాను చెల్లించవలసిన అప్పు వడ్డీతోసహ ఎంతయిందో చెప్పమన్నాడు. బాకీని చెల్లించి మునసబుగారి కళ్లముందే అప్పు పత్రాన్ని చించివేశాడు. మునసబుగారి హృదయం భగభగమండింది. ఒక మాలవాడు తనవద్ద పైకం తీసుకుని తిరిగి చెల్లించడం ఇదే మొదటిసారి. పైకం తీసుకున్న ప్రతిహరిజనుడు దాన్ని తీర్చే నిమిత్తం తనవద్ద పాలేరుగాచేరి వెట్టిచాకిరి చేసేవాడు. వాడు కండలు కరగించి కరగించి వడ్డీమాత్రం తీర్చగలిగేవాడు. వాడు చచ్చేనాటికి అసలు అలాగే మిగిలిపోయేది. తరవాత ఆ బానిసత్వము వాని సంతానానికి సంక్రమించేది. ఆ అనవాయితీని సుబ్బారాయుడు తలక్రిందులు చేశాడు.

ఐదేండ్ల అనంతరం స్వగ్రామానికి తిరిగివచ్చిన సుబ్బారాయుడు అగ్రహారంలో చాల మార్పులను చూడగలిగాడు. ఒకప్పుడు తాను చదువుకుంటూ ఉండిన బడిలో ఇప్పుడు ఇద్దరు టీచర్లున్నారు. అక్కడ చదివిన పిల్లలు కొందరు సైకిళ్లమీద హైస్కూలుకు వెళ్లి చదువుకుంటున్నారు. ఊరికి పోస్టాఫీసు వచ్చింది. దానిద్వారా అగ్రహారపు ప్రజలు బయటి ప్రపంచాన్ని తెలుసుకొన గలుగుతున్నారు. ఊరిమధ్య భజన మందిరంకోసం కట్టిన భవనాన్ని పంచాయితీ ఆఫీసుగా మార్చారు. పంచాయితీబోర్డు గ్రామాభివృద్ధికి సాయశక్తుల ప్రయత్నిస్తూంది. రాత్రిళ్ళు అగ్రహారపు వీధులు విద్యుద్దీపకాంతిలో పట్టపగలుగా ఉంటుంది. ఊరికి రెండు ఫర్లాంగులదూరాన ప్రశాంతమైన వాతావరణంలో ఆసుపత్రి భవననిర్మాణం శరవేగంలో పూర్తవుతూఉంది.

ఇలా అభివృద్ధిపథంలో పయనిస్తున్న అగ్రహారాన్నిచూసి సుబ్బారాయుడు చాలా సంతోషించాడు. కాని మాలపల్లి పరిస్థితిమాత్రం ఎక్కడవేసిన గొంగిళి అక్కడే ఉన్నట్లుండడంచూసి ఖిన్నుడయ్యాడు. ఈ దురవస్థ తన పల్లె కొక్కదానికి మాత్రమే పరిమితమై ఉన్నదనుకోడానికి వీలులేదు. ఇది దేశవ్యాప్తంగా ఉన్నదని పత్రిక చదువుతున్న సుబ్బారాయునికి బోధపడసాగింది.

సుబ్బారాయునికి వార్తాపత్రిక చదవాలనిపించలేదు. అతడు పత్రికను మడిచి కవరులో పెట్టాడు.

మాస్టరుగారు పోస్టాఫీసుకు తాళంవేసి, 'కరణంగారూ, మీ అబ్బాయి ఉత్తరం రాసినట్టు లేదండి' అన్నాడు.

కరణంగారు వైరాగ్యభావాన్ని సూచించే ముఖం పెట్టి, 'హుం. వాడెందుకు రాస్తాడు. అడ్డాలనాడు కావలిసివచ్చాను గాని గడ్డాలనాడు వాడికి నా అవసరం ఏముంది?' అన్నాడు.

సీలువేసిన తపాలసంచిని మాస్టరు రన్నరుకు అందించాడు. రన్నరు దానిని సైకిలు వెనకసీటుమీద బిగించికట్టి, 'ఇక నే వస్తాను గురూ. మిగిలిన విశే

షాలు వేసు మాట్లాడుకుందాం' అని సైకిలెక్కి వెళ్ళిపోయాడు.

మాస్టరు అరుగుమీద కూర్చున్నాడు. సుబ్బారాయుడు పత్రికను అతనికి అందించాడు. దానిని పుచ్చుకుని, 'పత్రికలో ఏమిటి విశేషాలు రాయుడూ?' అనడిగాడు మాస్టరు.

'బోలెడున్నయి మాస్టారూ. ఇది గాంధీ శత జయంతి సంవత్సరంగదా. దేశం నలుమూలలా గాంధీ పేరు వినబడుతూంది' అన్నాడు సుబ్బారాయుడు.

కరణంగారు కలగజేసుకుని, 'ఔనౌను. మన ఇరుగుపొరుగు గ్రామాలలోకూడ గాంధీ కార్యక్రమాలు జోరుగా సాగుతున్నాయి. మొన్న నేను కిస్తీరూకలు వసూలుచేసేందుకు కాశిమిట్ట వెళ్ళినప్పుడు తెలిసింది. ఆ వూళ్ళోని యువజనులంతా కలిసి చందాలు వేసుకుని ఆ ఊరి మాలపల్లిలో మంచినీటి బావిని త్రవ్వించ నున్నారట' అన్నాడు.

'వాళ్ల ప్రయత్నం చాల మెచ్చుకో దగినది. హరిజనోద్ధరణ గాంధీగారు ప్రాణమిచ్చే ఆశయం. మనంకూడ మనఊళ్లో మహాత్ముని ఆశయాలు ప్రతిబింబించే ఒక మంచిపనిచేస్తే ఎంత బాగుండును?' అన్నాడు మాస్టరు.

ఆ మాటలు సుబ్బారాయునికి తల్లినోటినుంచి వచ్చిన జోలపాటలాగ వినిపించాయి. అతడు తలెత్తి చూశాడు. గొప్పకార్యదీక్ష మాస్టరుగారి ముఖంలో కనిపించింది. మహాత్మునినీడ తనమీద ప్రాకుతున్నట్లు భావించాడతడు.

'మాలపల్లినీ అగ్రహారాన్నీ కలుపుతూ ఒక రోడ్డువేస్తే ఎంతబాగుండును' అన్నాడు సుబ్బారాయుడు. అతడలా అనగానే పొగడచెట్టుమీదనున్న కాకి ఎర్రనినోరుతెరచి 'కాకా'అని అరచింది.

ఆ ఊరిపేరు ఒంటిల్లు అగ్రహారం. పేరుకు అగ్రహారమేగాని అందులో ఒక్క బ్రాహ్మణ కుటుంబం కూడా కాపుర ముండటంలేదు. ఉన్నవాళ్లలో అధిక సంఖ్యాకులు రెడ్లు, నాయుళ్లు. వారికి వ్యవసాయ సామగ్రిని తయారుచేసే కంసాలి, వడ్రంగి, పడమటి

వీధిలో కాపుర ముంటున్నారు. చాకలి, మంగలికూడ అదే వీధిలో ఉంటున్నారు.

అగ్రహారానికి అనుబంధంగా ఫర్లాంగుదూరాన మాలపల్లి ఉంది. మాలపల్లినుండి అగ్రహారాన్ని చేర డానికి ఒక సన్నటి కాలిబాటే శరణ్యం. ఆ దారి ఎప్పుడూ ముళ్లతిప్పలతోనూ, రాళ్లకుప్పలతోనూ నిండిఉంటుంది.

సుబ్బారాయుని ప్రతిపాదన విన్న మాస్టరు—'చాలమంచి ఐడియా చెప్పావు రాయుడూ. అగ్రహారానికీ హరిజనవాడకూ మధ్యనున్న మార్గం సుగమం కావడం చాల అవసరం. అగ్రహారీకులూ హరిజనులు అన్యో న్యులు కావాలన్నది మహాత్మునికి ప్రాణప్రదమైన ఆశయం. ఆ ఆదర్శాన్ని కార్యరూపంలో పెట్టవలసిన బాధ్యత మనందరిమీద ఉంది' అన్నాడు.

కరణంగారు అరుగుమీదనుండి లేచి కండువా భుజాన వేసుకుని, 'అవునుట మాస్టారు. ఈ మాలా మాదిగ అనేవన్నీ వేదాలలో లేవట. ఈ మధ్యకాలంలో ఎవరో స్వార్థపరులు కల్పించినవేనట. అసలు వీర బ్రంహంగారు కూడా ఈ కులాలు మతాలు అన్నీ హుష్‌కాకిలాగ ఎగిరిపోయేరోజు వస్తుందని కాలజ్ఞానం రాశారు' అన్నాడు.

'మంచిమాట సెలవిచ్చారు కరణంగారూ. ఆ సుదినంకోసమే అందరమూ ఎదురుచూస్తున్నాం. సరె. నాకు బడికి వేళయిపోయింది. ఆలోచన ఎలాగూ వచ్చింది. దానిని కార్యరూపంలోకి తెచ్చితీరాలి. ఆ విషయాన్ని గురించి ఇరకోసారి మాట్లాడుకుందాం. నేను వెళ్లొస్తా'అంటూ లేచాడు మాస్టరు.

## 2

మాలపల్లినీ అగ్రహారాన్నీ కలుపుతూ రోడ్డువేయ నున్నారన్న వార్త క్రమంగా గ్రామమంతా వ్యాపించింది. సుబ్బారాయుడు ప్రతిపాదించగా మాస్టరు బలపరచిన ఆ సదాశయం అందరికీ నచ్చింది. రచ్చ బండవద్ద, ఆంజనేయస్వామి గుడివద్ద, కళ్ళాలవద్ద— నాలుగు తలలుచేరిన చోటల్లా ఆ విషయాన్నిగురించే మాట్లాడుకుంటున్నారు.

కంసాలి ఎర్రగకాలిన ఇనుపముక్కను పట్టు కారుతోతీసి ఇనుపదిమ్మపై ఉంచి, 'మనమంతా మిర్త్రీవాడు మిర్త్రీవాడు అంటూ తీసిపారేస్తుంటాం గాని, ఆ సుబ్బారాయుని తలలోనుండి ఎంత చక్కని ఆలోచనవచ్చిందో చూశావా' అన్నాడు.

కొలిమిపక్కన ఉన్న చింతదుంగమీద ఆశీనుడై ఉన్న రైతు పొగాకుకాడను తుంచుతూ, 'పటాలం లోని క్రమశిక్షణ అలాంటిది. ఉప్పుకూ ఊరగా యకూ కొరగాని ఆలోచనలు వారి తలలోనుండి ఎప్పుడూరావు' అన్నాడు.

వాళ్లిద్దరూ తనను అలా పొగుడుతూఉంటే ఇంచుక సిగ్గుజెందుతూ సుబ్బారాయుడు సమ్మెట వెయ్యసాగాడు. దెబ్బపడినప్పుడు నిప్పురవ్వలు ఇనుప ముక్కనుండి మిణుగురు పురుగులవలె దూసుకుపో తున్నాయి. అరుగుమీద కూర్చుని గోళ్లుగిల్లుకుంటూ సెలవురోజులను గడపటం సుబ్బారాయునికి ఇష్టం లేదు. అతడు మధ్యాహ్నంవరకు కొలిమివద్ద సమ్మెట వేస్తాడు. అందుకు ప్రతిఫలంగా కంసాలి అర్ధ రూపాయ ముట్టజెప్పుతాడు. మధ్యాహ్నం భోజనా నంతరం పోస్టాఫీసువద్ద ఇంచుకసేపు విశ్రాంతి తీసు కుంటాడు సుబ్బారాయుడు. తరవాత సాయంత్రం వరకు అగ్రహారపు రైతుల పొలాలలో పనిచేస్తాడు. ఆ విధంగా మరో రూపాయ సంపాదిస్తాడు.

కొలిమి ట్రంకురోడ్డు నానుకునిఉంది. రోడ్డు కవతల టీకొట్టుఉంది. కొట్టును నడిపే చిన్నది టీ బాయిలర్‌కింద అగ్గివేసి ఊదుతూఉంది. చిన్నదాని తండ్రి అప్పుడే నిద్రలేచాడు. అతడు పళ్లపొడితో చిగుళ్లను తోముకుంటున్నాడు.

కరణంగారు వేపపుల్లతో పండ్లు తోము కుంటూవచ్చి కొలిమి మంటలముందు కూర్చున్నాడు. ప్రతిరోజూ కరణం సూర్యుడు పుట్టకమునుపే ఏటికి వెళ్లుతాడు. కాలకృత్యాలు తీర్చుకుని వేప పుల్లతో పండ్లుతోముకుంటూ ఇంటికి తిరుగుముఖం పడతాడు. దారిలో కొలిమివద్దకూర్చుని కాసేపు చలి కాచుకుంటాడు.

కరణంగారు కొలిమిముందు కూర్చుని, 'ఆచారీ, నాలాంటి ముసలాళ్ళకోసం రోజూ ఇలా చలిమంటలు వేస్తున్న నీకు వేసవిలో చలివేంద్రాలు పెట్టినంత పుణ్యం దక్కుతుంది.' అన్నాడు.

'ఓహో, అలాగని ఏ ఉపనిషత్తులలో రాసి ఉంది' అనడిగాడు కంసాలి.

కరణంగారు వెనక్కుతిరిగి ఉమ్మి, 'ప్రతిదీ ఉపనిషత్తులలో రాసిఉంటేగాని నమ్మవటయ్యా. నేను వయోవృద్ధుడిని. పైగా అపారమైన అనుభవశాలిని. నేనుచెప్పింది వేదంకాదా' అన్నాడు.

సమ్మెట వేస్తున్న సుబ్బారాయుని శరీరం చెమటతో తడిసిపోతూంది. కండలు తిరిగిన అతని దేహం చెమటతో తడిసి నిగనిగ లాడుతూంది. సమ్మెటను అవలీలగా ఎత్తివేస్తున్న అతని దండలను చూస్తూ కరణం, 'మొన్నటిదాక ఈ సుబ్బారాయుడు ఎండిపోయిన బోరతో, పుడకల్లాంటికాళ్ళతో పొలం గట్ల వెంబడి తిరుగుతుండేవాడు. ఈ ఐదేండ్లలో గుర్తుపట్టలేనంతగా కండపెట్టేశాడు' అన్నాడు.

చింతమొద్దుమీదఉన్న రైతు పొగాకు కాడను నములుతూ, 'మరి పటాలంలో వాళ్లు తినేతిండి సామాన్యమైన దనుకున్నావా? రోజుకు మూడుసార్లు ఎద్దుమాంసం తింటారట' అన్నాడు.

కరణంగారు నోట్లోంచి వేపపుల్లను తీసివేసి, 'అదేమిటి' నువ్వు గొడ్డుమాంసం తింటావుట్రా. సుబ్బారాయుడూ?' అనడిగాడు.

రైతు పొగాకుకాడను నములుతూ, 'కరణంగారు ఒంటెల్లునీళ్లుతాగి ఎరగనట్లు మాట్లాడుతున్నారు. లేకపోతే గొడ్డుమాంసాన్ని మాలోడు కాకపోతే ఇంకెవడు తింటాడు?' అన్నాడు.

కొలిమిలో మంట భగ్గునలేచింది. ఇనుపముక్కలు కణకణ లాడుతున్నాయి. వాటి ఎర్రదనం సమ్మెటవేస్తున్న సుబ్బారాయుని కన్నులలో ప్రతిఫలించింది. కంసాలి రెండు పిడికిళ్ల వరిపొట్టునుతీసి మంటమీద వేశాడు. దట్టమైన తెల్లటిపొగలేచి నలువైపుల వ్యాపించింది.

సమ్మెటదెబ్బలు మహాఉధృతంగా పడుతున్నాయి. ఆ దెబ్బల తాకిడికి తను పట్టుకొనిఉన్న ఇనుపముక్క చెదిరిపోతుందేమోననిపించింది కంసాలికి. ఇనుపముక్క నుంచి దూసుకుపోయిన నిప్పురవ్వ ఒకటి రైతు పాదంమీద పడింది. పాదం చుర్రుమనగా, 'అబ్బా' అంటూ మూలిగాడు రైతు.

'నలుసంత నిప్పుకే అలా అరుస్తావేమిటి నరసయ్యా. ఆ పేడవేసి రుద్దు. మంట చల్లారుతుంది' అన్నాడు కంసాలి. అతడు ఇనుపముక్కను తీసివేశాడు. సుబ్బారాయుడు సమ్మెట క్రిందపెట్టి నుదుటిమీద చెమట తుడుచుకున్నాడు.

రోడ్డు కవతలవైపున టీకొట్టు నడిపే చిన్నది పెంకుతీసుకుని అగ్గికోసం వచ్చింది. కొలిమిలోనుండి తెల్లనిపొగలు నలుదిక్కులకు వ్యాపిస్తున్నాయి. టీకొట్టుపిల్ల అల్లంతదూరాన నిలబడి, 'ఆచారీ. ఆ పొగలోకి నేను దూరలేను. ఈ పెంకులోకి కాస్త అగ్గి తీసివ్వు' అంది.

కంసాలి ఆమెవైపు తలెత్తిగూడ చూడకుండా, 'గంటక్రితమే మొకసారివచ్చి తీసికువెళ్లితివే. మళ్లీ ఏమయింది?' అన్నాడు.

టీకొట్టు చిన్నది కాలిబొటనవ్రేలితో నేలమీద వ్రాస్తూ, 'లోపల కూర్చుని విస్తర్లు కుడుతూ ఉంటే పొయ్యి చప్పగా చల్లారిపోయింది' అంది.

'విస్తర్లు కుడుతూఉన్నావా?? లారీ డ్రైవరుతో సరసాలాడుతూ ఉన్నావా'అంటూ బిగ్గరగా నవ్వసాగాడు కంసాలి.

చిన్నది మూతివిరచి, 'ఈడికి వయసు ఉడిగేకొద్దీ జాణతనం పెరుగుతూఉంది' అంటూ నేరుగావచ్చి పెంకులోకి అగ్గి తీసుకోసాగింది.

కంసాలి ఆమెకు అడ్డురాకుండా పక్కకుజరిగి, 'మరి నేనొకటడుగుతా చెప్పుపిల్లా. నువ్వు రోజూ నా కొలిమిలోని అగ్గితోనే పొయ్యి ముట్టించుకుంటావుగదా. ఏం నీ కొట్టులో అగ్గిపెట్టెల్లేవా?' అనడిగాడు.

'లేకేం. కొల్లలబోయినన్ని ఉన్నాయి. కాని నీ చెయ్యివాసి మంచిది. నీ కొలిమిలోని అగ్గితో పొయ్యి రగిలేస్తే నా టీలు బాగా అమ్ముడుపోతాయి' అంటుమె.

కంసాలికి చాల సంతోషమయింది. ఒక్కసారిగా పదుచుదనం ఆవరించేసిం దతనిని. అతడు ఓరగ చూస్తూ కన్నుగీటి, 'నావల్ల నీ టీలు బాగ అమ్ముడుబోతున్నాయిగదా. మరి నాకు కమిషనుగా ఏమిచ్చుకుంటావు?' అనడిగాడు.

'ఇస్తాను. ఇస్తాను. రేపోమాపో దిగుపొద్దున చీపురు తీసుకుని ఇస్తాను'అంటూ గిరుక్కున వెనుదిరిగి నడవసాగిందామె.

వయ్యారంగా నడిచిపోతున్న ఆమెను వెనక నుండి చూస్తున్న రైతు, 'ఈ పిల్ల మగవాడై పుట్టాలిసింది ఆచారీ.' అన్నాడు.

'అదేం. అలా అంటున్నారు?' అన్నాడు కంసాలి.

'మగదిక్కు లేకపోయినా, ఉన్నజీవనోపాధి ఆ టీకొట్టు ఒక్కటే. ఐనా—ముసలి తండ్రిని, ఇద్దరు పిల్లలను అవలీలగా సాకుతూంది చూశావా?' అన్నాడు రైతు.

'ఔనౌను. అందుకామె అవలంబించిన మార్గం ఏదైతేనేం—ఆమెను అభినందించాలిసిందే.' అన్నాడు కంసాలి. అతడు ఎర్రగకాలిన ఇనుపముక్కనుతీసి ఇనుప దిమ్మపై పెట్టాడు. సుబ్బారాయుడు సమ్మెట వేయడం ప్రారంభించాడు.

కరణంగారు నోట్లోని వేపపుల్లను పారేసివచ్చి చింతమొద్దుమీద కూర్చుని, 'నరసయ్యా. నువ్విందాక అన్నావే—మాలోడూ గీలోడూ అని—అలా అనడం ఈ రోజుల్లో చట్టం ప్రకారం నేరం' అన్నాడు.

రైతు పొగాకుకాడను నమలడం ఆపి,'ఎట్టెట్టా ఇంకేమని పిలవాలి వాళ్లని' అనడిగాడు.

'హరిజనులు అనిపిలవాలి. మహాత్మాగాంధి వాళ్లను అలాగే పిలిచేవాడు. అసలు మనస్కూలు మాస్టరుగారు ఏమన్నారంటే—' అంటూ ఉమ్మి వేయడానికి వెనుదిరిగాడు కరణం. అల్లంతదూరాన మాస్టారు కొలిమివైపే నడచివస్తూండడం కనిపించింది.

'మాస్టారుగారికి నూరేళ్లు ఆయుస్సు. తలచుకుంటూ ఉండగానే వచ్చారు.' అన్నాడు కరణం.

మాస్టారుగారు కొలిమిని సమీపించగానే, చక్రం తిప్పుతుండిన కుర్రవాడులేచి, 'నమస్కారం మాస్టారూ' అన్నాడు. మాస్టారు ప్రతినమస్కారం చేశాడు.

కంసాలి గబగబలేచి తుండుగుడ్డతో చింత దుంగమీదున్న దుమ్ముతుడిచి, 'రండి మాస్టారూ. కూర్చోండి. ఎప్పుడూలేనిది ఇలా దయచేశారు' అన్నాడు.

'ఫరవాలేదులే ఆచారీ. నేనిక్కడ కూర్చోవ డానికి రాలేదు. సుబ్బారాయునితో కొంత మాట్లా డాల్సిఉండి వచ్చాను. ఆ మాటకొస్తే ఒక్క సుబ్బా రాయునితోనేగాదు, మీ అందరితోనూ మాట్లాడాల్సి ఉంది' అన్నాడు మాస్టారు.

'ఏం మాట్లాడతారు. రోడ్డు వెయ్యడం గురించేనా?' అనడిగాడు రైతు.

'అవును.. నిన్న మధ్యాహ్నం సుబ్బారాయుడు సలహా ఇచ్చినప్పటినుండి నామనసు మరొక విషయంపై లగ్నంకాలేదు. నిన్న సాయంత్రమే మన సమితి ఇంజ నీరింగు సూపర్వైజరుగారిని కలుసుకున్నాను. మన ప్రయత్నాన్ని వారు ఎంతో మెచ్చుకున్నారు. రోడ్డు వేయడానికి కావలసిన ఎస్టిమేషను ఆయన తయారు చేసి ఇచ్చారు. ఇంకా చాల ఉపయోగకరమైన సలహాల నిచ్చారు.' అన్నాడు మాస్టరు. అతని ముఖంలో ఉత్సాహం పరవళ్లు తొక్కుతూంది.

'సూపర్వైజరుగారు ఏమని సలహాఇచ్చారు.?' అనడిగాడు సుబ్బారాయుడు.

'అన్నీ చెబుతానురండి. అలా వెళ్లి కాఫీ తాగుతూ మాట్లాడుకుందాం' అన్నాడు మాస్టరు.

అతడలా అనగానే కంసాలి చేతిలోని పట్టు కారును కింద పెట్టాడు. సుబ్బారాయుడు సమ్మె టను కిందికి దించాడు. రైతు, కరణం చింతదుంగ మీదనుండి లేచారు. మాస్టరు దారితీయగా వారం దరూ టీ కొట్టువైపు నడిచారు.

మాస్టరుగారు లోనికొస్తుండడం చూసి టీ కొట్టుపడుచుకు ముఖం చాటం తయింది. 'రండి మాస్టారూ. మా అంగడికి రావడం మీకిదే మొదటి సారనుకుంటాను.' అంటూ అదరాబాదరా మూల నున్న స్టూలును ఇవతలకులాగి పైటకొంగుతో దానిమీదున్న దుమ్ము తుడిచి, 'కూర్చోండి మాస్టారూ' అంది. మాస్టారు స్టూలుమీద కూర్చోగా మిగిలిన వారందరూ బెంచిమీద కూర్చు న్నారు.

సుబ్బారాయుడు మాత్రం బయట నేలమీద

పరచి ఉన్న బండమీద కూర్చున్నాడు. అది చూసి మాస్టరు 'అక్కడ కూర్చున్నావేం రాయుడూ. లోపలకు రా' అన్నాడు. అలా పిలిచిన మాస్టరును అక్కడున్నవారంతా నెత్తిన రెట్టవేసిన కాకిని చూసినట్లు చూశారు.

సుబ్బారాయుడు బలవంతంగా ముఖంమీదకు చిరునవ్వు తెచ్చుకుని, 'ఫరవాలేదు మాస్టారు. నేనిక్కడే కూర్చుంటాను. నాకిక్కడే బాగుంది' అన్నాడు.

గాలివాన వెలిసినట్లయింది. సుబ్బారాయుడు లోనికొచ్చి తమసరసన కూర్చోవడం సంభవించ వందుకు కంసాలి తదితరులు సంతోషించారు.

టీకొట్టుపిల్ల కొంగును నడుముచుట్టూ రానిచ్చి బొడ్లో దోపుకుని, 'ఏం తీసుకుంటారు మాస్టారూ?' అనడిగింది.

'తలా ఒక కప్పుకాఫీ' అన్నాడు మాస్టరు.

'మరి మీరు ?' అనడిగిందామె.

'నాకు కూడాను. నేనుమాత్రం నీ అంగడిలో కాఫీ తాగకూడదా?' అన్నాడతడు.

'అది కాదండి. మీకు కాపీ టీ లాంటివి సయించ వని, రోజూ రాత్రి పడుకోబోయేముందుమాత్రం ఓ కప్పుపాలు పుచ్చుకుంటారనీ విన్నాను. అందుకని అడిగాను.'

'నిజమేననుకో. కాని ఎప్పుడూ ఒకే నిర్ణ యాన్నే అంటిపెట్టుకుని ఉండటానికి వీలుపడదు గదా' అన్నాడు మాస్టరు.

ఆమె కాఫీలు తయారుచేయడంలో మునిగి పోయింది.

'అదిసరే — మాస్టారుగారికున్న అలవాట్లన్నీ ఈవిడకెలా తెలుసు?' అన్నాడు కరణం.

'ఒక్కమాస్టారుగారేం ఏమిటి — ఈ ఊళ్లో పెళ్లికాని ప్రతి మగాడి భోగట్టా దీనికి తెలుసు అన్నాడు' కంసాలి.

టీ ఫిల్టరును కడుగుతున్న చిన్నది కంసాలి వైపు చురచురచూసి, 'ఆచారీ, నువ్విలాగా నామీద అవాకులు చవాకులు పేలుతున్నావంటే నీకు పచ్చినీళ్లు కూడ ఇవ్వను. నేను ఎలాంటిదా ననుకున్నావో ఏమిటో' అంది.

ఆ వాక్యాన్ని ఆమె పూర్తిచేయకముందే రోడ్డుమీద ఒక బస్సు ఆగింది. డ్రైవరు తల బయట పెట్టి హారన్ మ్రోగించాడు. హారన్ మోత వినగానే చిన్నది టీ ఫిల్టరును అలా పడేసి చీర కుచ్చెళ్లను ఎత్తిపట్టుకుని లేడిలాగ ఇంజనువైపు పరుగెత్తింది. ఆ పిల్ల, డ్రైవరూ—మాటలతో, చూపులతో ఒకరి కొకరు చక్కిలిగింతలు పెట్టుకోవడంలో మునిగి పోయారు.

సుబ్బారాయుడు, 'మాస్టారూ. సూపర్వైజరు గారు సెలవిచ్చిందేమిటో చెప్పండి' అన్నాడు.

'విషయం తెలిసి సూపర్వైజరుగారు చాల సంతోషించారు. గాంధీశతజయంతి సంవత్సరాన గ్రామీణులలో ఇలాంటి చైతన్యం కనిపించడం శుభ సూచకమన్నారు. తరవాత ఉజ్జాయింపుగా రోడ్డు పొడవును, వెడల్పును, నేల స్థితిగతులను అడిగారు. నేను ఇచ్చిన వివరాలతో వారు తయారుచేసిన ఎస్టి మేషను ఇది—'అంటూ మాస్టరుగారు జేబులోనుండి ఒక పెద్దకాగితాన్నితీసి మడతలు విప్పాడు. దాన్ని చూస్తూ అతడు చెప్పసాగాడు: 'రోడ్డుపొడవు ఒక ఫర్లాంగు. వెడల్పు పదహారు అడుగులు. రోడ్డుకు కావలసిన మట్టిని రోడ్డు కిరువైపులనుండే త్రవ్వుకో వచ్చు. కనుక పై కొలతలుగల రోడ్డును నిర్మించ డానికి ముప్ఫయిమంది కూలీలు ఇరవైరోజులపాటు పనిచేయాల్సి ఉంటుంది.'

కరణంగారు చూపుడువ్రేలితో గాలిలో కొన్ని గీతలుగీసి, 'ఐతే ఆరువందల రూపాయలు మనవి కావనుకుంటే ఇరవైరోజులలో రోడ్డు సిద్ధమవు తుందన్నమాట.' అన్నాడు.

'కరెక్ట్' అన్నాడు మాస్టరు.

'ఇంత ఖర్చుచేసినా తయారయ్యేది మట్టి రోడ్డేకదా. తొలిముంగార్ల వానలు ఒకింత జోరుగా పడితే ఆ రోడ్డు ఐపూ అజా లేకుండా పోతుంది. అప్పుడేం గతి?' అన్నాడు కంసాలి.

'అలా కొట్టుకుని పోకుండా తగు జాగ్రత్తలు తీసుకుంటే సరి' అన్నాడు మాస్టరు.

'ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలి?' అనడిగాడు కంసాలి.

'ఆ మట్టిరోడ్డుమీద కంకరపరచి రోలర్ చేత తొక్కించితే రోడ్డు చెక్కు చెదరకుండా ఉండి పోతుంది.' అన్నాడు మాస్టరు.

'కంకర వేయడానికి అదనంగా ఎంత ఖర్చవుతుంది?' అనడిగాడు రైతు.

'చెబుతానుండు.' అంటూ కాగితాలలోకి చూస్తూ చెప్పసాగాడు మాస్టరు. 'ఫర్లాంగుదూరం కంకర వేయడానికి పది యూనిట్ల కంకర కావాలి. పది యూనిట్ల కంకర ధర వందరూపాయలు. కంకరను క్వారీనుండి మట్టిరోడ్డువద్దకు తీసుకుని రావడానికి అయ్యేఖర్చు నాలుగువందలు. కంకరను రోడ్డుమీద పరవడానికి యాభైరూపాయలవుతుంది. రోలింగుచేసే యంత్రానికి అయ్యే బాడుగఖర్చు యాభైరూపాయలు. వెరశి మరో ఆరువందలు.'

కరణంగారు మళ్ళీ గాలిలో చూపుడువ్రేలితో కొన్ని అంకెలువేసి, 'మట్టిరోడ్డు వేయడానికి ఆరు వందలూ, దాన్ని కంకరరోడ్డుగా మార్చడానికి ఆరు వందలూ—మొత్తం పన్నెండు వందలన్నమాట. ఇది నిశ్చయంగా అగ్రహారీకులకు తలకుమించిన భారమే.' అన్నాడు.

అతడలా అనగానే అక్కడున్న వారంతా జూదంలో వోడిన పాండవుల్లాగ తలలు వ్రేలవేశారు.

బస్సుడ్రైవరుకు, టీ కొట్టుపిల్లకు మధ్య జరుగుతున్న సరసాలు ఇంకా ఒక కొలిక్కి రాలేదు. విసుగుజెందిన కండక్టరు, 'క్యాభాయ్. బస్సును బయలుదేరదీసే ఉద్దేశ్యమేమైనా ఉందా లేదా?' అని అరిచాడు తురకంలో. అధి విని డ్రైవరు ఇంజన్ స్టార్ట్‌చేస్తూ పిల్లతో, 'సైతాన్ కొడుకు చస్తున్నాడు. నే వెళ్ళొస్తాను. రేపు తిరుపతి రూట్‌లో వెళతాను. పునర్దర్శనం ఎల్లుండే. వెళ్ళిరానా?' అన్నాడు. ఆమె తన పొడవాటి జడను రొమ్ములమధ్య పడేసుకుని దాని చివరనున్న రిబ్బను ముక్కను విప్పుతూ, 'వెళ్ళిరా' అంది. బస్సు కదిలింది.

ఆమె తిరిగివచ్చి, 'మన్నించండి మాస్టరూ. ఆలస్యమైపోయింది. మీరలా మాట్లాడుతూ ఉండండి. నిముషంలో కాఫీ రెడీ అవుతుంది.' అంటూ పని ప్రారంభించింది.

కొద్దినిమిషాలలో అందరికీ కాఫీలు అందాయి. సుబ్బారాయునికి ఒక ప్రత్యేకమైన గ్లాసులో కాఫీ అందించిందామె. ఆ గ్లాసు హరిజనులకని ప్రత్యేకించబడినది. అందులో కాఫీ సేవించిన హరిజనుడే దానిని స్వహస్తాలతో శుభ్రపరచాలి. ఆ గ్లాసు ఎట్టిపరిస్థితిలోనూ లోపలికి గొనిపోబడదు. మైలపడిన ఆ గ్లాసును అంగడి పైకప్పుయొక్క చూరులో చెక్కి ఉంచుతారు.

కాఫీ సేవించిన పిదప సుబ్బారాయునిమేధ చురుగ్గా పనిచేయసాగింది. అతడన్నాడు. 'మాస్టారూ రోడ్డువేయడం మనకు తలకుమించిన పనిగా భావించి ఆశలు వదులుకోవడమెందుకు? ప్రతిదానికీ మార్గాంతరముంటుంది గదా.' అన్నాడు.

మాస్టరు తలఎత్తి, 'ఏమిటో ఆ మార్గాంతరం. నువ్వే చెప్పు' అన్నాడు.

సుబ్బారాయుడు కాఫీ గ్లాసును కిందపెట్టి, 'ఒక్కడికి అసాధ్యమైన పనిని ఇద్దరు కలిసి సునాయాసంగా సాధించవచ్చును. ఏమంటారు?' అన్నాడు.

'రాయుడూ, చెప్పేదేదో సూటిగా చెప్పరాదూ' అన్నాడు రైతు.

సుబ్బారాయుడేదో చెప్పబోయేంతలో కరణంగారు కాఫీ గ్లాసును ముందుకుచాచి, 'పిల్లా. ఇందులో ఇంకాస్త చక్కెర వెయ్యవే' అన్నాడు.

ఆమె తన వైద్యవిజ్ఞానాన్నంతటినీ వొలకబోస్తూ, 'కరణంగారూ. ఈ వయసులో మీరు చెక్కెర ఎక్కువ తినరాదు. తింటే చక్కెర వ్యాధి వస్తుందని డాక్టర్లు చెబుతుంటారు. మీరెప్పుడూ వినలేదా?' అంది.

'వాళ్ళముఖం లెద్దూ. వాళ్ళు ప్రతిదానికీ అలాగే చెబుతారు. చక్కెర తింటే చక్కెర వ్యాధి వస్తుందట. పొగతాగితే టి. బి. వస్తుందట. మరేదో చేస్తే కాన్సరు వస్తుందట. వాళ్ళసలహాలన్నింటినీ పాటించాలంటే మనం తిండి తీర్థాలు మానుకోవలసిందేగాని, నువ్వో చిటికెడు చక్కెర ఇలా రాల్చు.' అన్నాడు కరణం.

ఆమె రెండు చెమ్చాల చెక్కెరను అతని

బయటపెట్టు' అన్నాడు.

సుబ్బారాయుడు బండమీద సర్దికూర్చుని, 'రోడ్డు పూర్తయితే అది ఒక్క అగ్రహారానికేగాక హరిజనవాడకు గూడ ప్రయోజనకారిగా ఉంటుంది. అటువంటప్పుడు రోడ్డునిర్మాణ భారాన్ని హరిజనులు కూడ ఎందుకు పంచుకోగూడదు ?' అన్నాడు.

రైతు తన మీసాలకు అంటుకుని ఉన్న కాఫీచుక్కలను తుడుచుకుని, 'ఆం—హరిజనులేం పాలుపంచుకుంటారు ? రోజంతా వాళ్లు గుల్ల చేసుకుంటే మీకుదక్కేది రూపాయి. అందులో పెళ్లాం బిడ్డలేమి తింటారు—రోడ్డుకేం ఖర్చు పెడతారు.' అంటూ తేల్చిపారేశాడు.

సుబ్బారాయుడు తన పెదవులదాక తీసుకెళ్లిన గ్లాసును చటుక్కున క్రిందపెట్టి, 'అలా అనకండి నరసయ్యగారూ. మేము ఆర్థికంగా సహాయం చేయలేక పోవచ్చును గాని శ్రమదానం విరివిగా చెయ్యగలం. రోడ్డునిర్మాణంలో మొదటి సగం—అంటే మట్టి రోడ్డు పూర్తయేంతవరకు ముఖ్యంగా కావలసింది శారీరకశ్రమ. ఆ పని మేము పూర్తిచేస్తాం. ఇక మట్టిరోడ్డును కంకరరోడ్డుగా మార్చడం ఉంది చూశారూ—అది మీ అగ్రహారీకులు పూర్తిచేయండి' అన్నాడు.

అలా పలుకుతున్న సుబ్బారాయుని కంఠం కురుక్షేత్రంలో పాండవుల శంఖారావంలాగ ధ్వనించింది.

మాస్టరుగారు సుబ్బారాయునివైపు మెచ్చికోలు కాని, నాకో అనుమానం. మీ హరిజనులు ఇలా శ్రమదానం చేయడానికి ముందుకొస్తారాఅని' అన్నారు.

'ఎందుకురారు మాస్టారూ. సుముఖులుకాని వారెవరైనాఉంటే నచ్చజెప్పి కార్యోన్ముఖులుగా చేసే బాధ్యత నాది. అంతెందుకు మొదలుపెట్టిననాటి నుండి ఇరవైరోజులలో మట్టిరోడ్డును పూర్తిచేయ కుంటే నా పేరు సుబ్బారాయుడేగాదు. ఆపైన దానిని కంకరచేసే బాధ్యతను అగ్రహారీకులు ఎంతవరకు నిర్వర్తిస్తారోనని నాకు అనుమానంగాఉంది' అన్నాడు సుబ్బారాయుడు.

అతని నన్నమాట ఒక ఛాలెంజిలాగ ధ్వనించింది. మాస్టరుగారు ఆ చాలెంజిని అందుకుని, 'నీకు మీవాళ్లపైన అంత నమ్మకం ఉంటే ఇక కావల సిందేమిటి ? నాకు అగ్రహారీకుల మనస్తత్వం బాగా తెలుసు. ఆరువందల రూపాయలను చందాల రూపాన నిముషాలలో వసూలు చేస్తాను. నువ్వు మట్టి రోడ్డును పూర్తిచేసిన మరునటిదినమే కంకర వెయ్యడం ప్రారంభిస్తాను.' అన్నాడు.

'ఐతే పని ఎప్పుడు ప్రారంభిద్దామంటారు?' అనడిగాడు సుబ్బారాయుడు.

మాస్టారు తన ముంజేతికున్న గడియారంలో తారీఖు చూసి, 'వచ్చే సోమవారమే గాంధీమహాత్ముని శతజయంతి దినం. ఆ పుణ్యదినాన్నే మన కార్య క్రమాన్ని ప్రారంభిద్దాం.' అన్నాడు.

(సశేషం)



# మం ద లిం పు

## కళాప్రపూర్ణ శ్రీ తుమ్మల సీతారామమూర్తి

కదలఁ దగినబల్మి కఱవాయెఁ గాని నా
రాక వలచు సభ లనేక ముందు
వచ్చె నొక్కనాఁడు వాసికెక్కిన కలా
శాల పాలి మేలిసదసు పిల్పు.

అనిపె విద్యార్థిసంఘ నాయకుఁడు రామ
కోటి యనుకుఱ్ఱఁ డాకమ్మ సాటిలేని
యొద్దికన్ మెఱయించుచు యుష్మదీయ
సాహితీసృష్టి శిష్టప్రశస్త మనుచు.

మీవాణి సదస్సునకున్
జీవమునిడు ననుచు గురులు శిష్యులు పౌరుల్
కోవిదులు కవీంద్రులు మీ
కై వార్త రటంచుఁ గరుణఁగల్గఁ డటంచున్.

అతని లేఖఁ జూచి యారోగ్య లోపమ్ము
దలఁచి వెడలవలయుతావు దూర
మగు టెఱింగి చేవ దిగుట రాఁజాల న
న్నా! యటంచు వ్రాసినాఁడ నపుడ.

అతఁడు మీకుఁ బొసఁగు నన్నిసౌకర్యము
లేర్పరింతు మిచట, నితవుసేయు
కూడు కూర కూర్తు మోడక *మొదటి త
రాన రం డటంచు వ్రాసె మరల.

---

* ఫస్టుక్లాసులో.

## మందలింపు

రామకోటి యీ లేఖలో రామకోటి
చౌదరిగ మాఱె మామకీ నాదరమ్మ
వడయ నిమ్మార్పు తోడ్పడవచ్చు నని తల
చెనాతెన్ను గనని బాలకుఁ డతండు.

పైనమునకు నిప్పుడు నా
మే నొప్పదు శాలకతన మిగుల నలఁగితిన్
మాను మిఁక నన్ను; శక్యము
గానిది సమకూర దంటిఁ గన్న నతనికిన్.

పాప మతఁడు నన్ను వదలునా! మీకు నూ
ఱా ర్లొసంగి రాంకవాదు లిచ్చి
సత్కరింప నేము సర్వసన్నద్ధుల
మైతి మాదరింపుఁ డనియె మగుడ.

విత్తమునకు లొంగి వేయితెఱంగుల
మాఱువారి బ్రతుకుఁదీరు గాంచి
యిట్టివ్రాఁత కొగ్గ నీకుఁజెల్లెఁ డని యేను
నొవ్వపాలుగాక నవ్వుకొనుచు—

పట్టికను బంపినాఁడవా! బాగు! బాగు!
సోదరా! ప్రలోభనములు చూపి నన్ను
లోఁచుకొనఁ జూచితే వెఱ్ఱి యేచె నీకు
నాకు రెండుమాటలు లేమి లోక మెఱుఁగు.

ఈవు పిన్న వగుట నెఱుఁగ వీనియతి; చా
లింపుమా నిరర్థలేఖనమ్ము
తనకు జాబువ్రాయు చన వెట నీకు లే
దంచు నతని మందలించినాఁడ.

———

# అసంపూర్ణచిత్రం

శ్రీ ఆర్. ఎస్. కె. మూర్తి

డాక్టరు శశికళగారా! ఎంత అందంగా గీశా రా చిత్రాన్ని.—మెచ్చుకుంటున్నారు ప్రేక్షకులు.

డాక్టరు శశి గీసిందా ఈ చిత్రాన్ని! సింప్లీ మార్వలెస్!— ఆనందపడుతున్నారు తోడి డాక్టర్లు.

అవునే విమ్మీ, మన శశి చూశావా, ఈ చిత్రంలో ఎంతటి అందాన్ని వెలయించిందో!— కమల మురిసిపోతున్నది.

చూశావు టే కమలా, తెలు పసలు రంగే కాదం టారుకదా? మన శశి చూడు తెల్లనిరంగుని ఎంత భావస్ఫోరకంగా వాడుకున్నదో!—విమల గర్వం.

కాని ఈ కాంప్లిమెంట్లన్నీ వింటున్న శశికి నోట్లో చెక్కపేడువేసుకొని, నములుతున్నట్లు అదేదో వికారంగా ఉంది.

శశి అంటే నేనేకదా!

నా చిత్రానికి ప్రథమ బహుమతి లభించింది, చిత్రకళా ప్రదర్శనంలో. ప్రేక్షకులు, పరిచయస్తులు, స్నేహితులు కాంప్లిమెంట్లు కురిపించటంలో తప్పేమీ లేదుకదా? కాని అవి వింటుంటే ఏమిటోగా ఉంది, నాకు. ముఖ్యంగా విమలచేసిన రిమార్కు నన్నెందుకో బాగా కలవర పరిచింది.

తెలుపురంగుని భావస్ఫోరకంగా వాడానా, నేను? తెలుపు శూన్యత్వముయొక్క రంగు; నా మనసులోని శూన్యత్వాని కది చిహ్నం.

నా భావనలోవున్న శూన్యత్వాన్ని ఆ రంగుతో ప్రదర్శించా ననుకుంటున్నాను, నేను.

దాన్ని భావ స్ఫోరకంగా వాడానంటుందేమిటీ విమల?

*   *   *   *

చిత్రం గీయాలని కాన్వాసుముందు నించు న్నది, శశి. ఆ కాన్వాసెంత శూన్యంగా ఉందో మన సంత శూన్యంగాఉంది, శశికి. మదిలో ఏమీ భావన మెదలలేదు. గాలితెరవీచని పాతాళగహ్వరంలా మనస్సు; నీళ్ళు ఎండిపోయిన మహా సముద్రంలా భావనాజగత్తు. సకల జగత్తు నిశ్శబ్దనీరవజగత్తులా భాసించింది, శశికి.

ఏమీ తోచక, ఊరికే కాన్వాసుముందు నించో లేక, కుంచెను తెల్లరంగులోముంచి గీతలు గీయ సాగింది, శశి.

కాసేపటికా గీతలు మేఘాలుగా భాసించినై, ఆమెకు. దాంతో పైనున్న మేఘాలను పారిపోతున్న మేఘాలుగా, క్రిందనున్నవాటిని ఎగిరి, నురగలు కక్కుతున్న అలలుగా తీర్చిదిద్దింది, శశి.

క్రింద పరచుకున్న మహా సముద్రం—భయో త్పాతమైన నీటి ఎడారి.

పైన విచ్చుకున్న ఆకాశం—పారిపోయిన గాలి ఎడారి. ఒకదానికి ఒడ్డులేదు; రెండవదానికి అంచు లేదు.

ఒకటి అర్థంకాని తన భవిష్యత్తు. రెండ వది జీవంలేని తన వర్తమానం.

రెండూ రెండు మహా శూన్యాలు.

ఆ శూన్యాలమధ్య తాను వేళ్ళాడుతున్న ట్లని పించింది, శశికి.

అందుకే ఆ రెండు శూన్యాలకీమధ్య ఎగురు తున్న ఒక పక్షిని చిత్రించింది, శశి.

పక్షి ఎగురుతున్నది. ఎంతో ఎత్తున ఎగురు తున్నది. అది క్రిందిలోకాన్ని అలవోకగా చూస్తు న్నదా? ఆవేదనతో వెతుకుతున్నదా? ఏమని చిత్రిం చాలి?

దాని రెక్కలలో బలమున్నదిగదా? బలముడిగే

వరకు అది ఎగురుతూనే ఉంటుంది. కాని రెక్కలలో బల ముడిగిన నాడు ?

క్రిందికిదిగి, సేద తీర్చుకోవా లనుకున్ననాడు ఏమున్నది క్రింద ?

గూడు చూసుకొని, గువ్వలను చూసుకొని మురిసిపోవాలనుకుంటే, ఏదీ పట్టుగొమ్మ ?

పక్షి నిరాశావహి. అది ఆవేదనతోనే వెదుకు తున్నది. దాని కన్నులలో వున్నది దీనత్వమే.

ఆ దీనత్వాన్ని, దాని వేదనను ప్రదర్శించా లని ఆకాంక్షించింది, శశి.

అలా ప్రదర్శించా ననేదే ఆమెకు లభించిన తృప్తి.

'అబ్బ, ఈ పక్షి కన్నులలో చూశావా, రమా, ఎంతటి విజయగర్వమున్నదో! ఆకాశపు టంచులకు ఎగిరి పోతున్నానని కాబోలు! లైఫ్ ఉన్నది రమా, ఈ చిత్రంలో !'

ఎవరో పొగడు తున్నారు.

ఎవరో కాదు. డాక్టరు మోహన్. తన జమీం దారు భార్యతో వచ్చినట్లున్నాడు ప్రదర్శనకి.

శశి స్తబ్ధురాలైంది.

శశి అంటే నేనేకదా? నా మనస్సు కలగుండు పడింది. ఆ చిత్రాన్నిగీచిన నా చేతిని ఎవరో విరుచు కొని తీసుకుపోతున్న ట్లనిపించింది.

పక్షి కన్నులలో వున్నది విజయగర్వమా ?

నేను చిత్రించిన పక్షి కన్నులలో జీవమున్నదా? నేను చిత్రించ దలచుకున్నది దీనత్వాన్ని, వేదనను, అంతులేని ఆవేదనను, ఆర్తిలేని నిరాశను.

పక్షి కన్నులలో విజయగర్వమున్న దంటా డేమిటి ? నా కళ పరాభూతమైనదా ?

లేక పక్షి కన్నులలో కనిపించే దీనత్వాన్ని చూడటానికి ప్రపంచం యిష్టపడటం లేదా ?

లేక నా ఆలోచనలోనే ఏమైనా లోపమున్నదా? నా జీవితంలో వేదనలేదేమో ? నేను నిర్వేదం చెంద వలసిన అవసరం లేదేమో ?

నా బాధను నేను ఐడలైజు చేసుకుంటున్నా నేమో ?

ఎంతోమంది పొగడ్తలకు ఎన్నో విధాలుగా ఆల వాలమైన నాకు జీవితంలో నిశ్వాసించవలసిన దేమీ లేదేమో ?

* * *

చిన్నతనంనుంచీకూడ ఎంతోమంది పొగడ్తలకు ఎన్నో విధాలుగా ఆలవాలమైంది, శశి జీవితం.

శశిచాల అందమైనది అనుకుంటుండేది అమ్మ.

వాళ్ళ శశి చాల తెలివైంది—అంటుండేవారు, ఊరివాళ్ళు.

ఎంతశ్రద్ధ లేకపోతే మా సూరమ్మ కూతురు అంత తెలిగ్గా మెడిసనులో సీటు సంపా దిస్తుంది?—అన్నాడు, మామయ్య.

శశి అంటే నేనేకదా ?

నిజమే చాల శ్రద్ధగాచదివి, మెడిసనులో సీటు సంపాదించాను.

అమ్మా, మెడిసనులో సీటు వచ్చిందమ్మా— అంటూ తూనిగలా అమ్మదగ్గరకు ఎగిరివెళ్ళాను, పదేండ్లనాడు.

అమ్మ కనపరచిన ఆనందంలో ఏదో వెలితి— స్ఫురించిందే కాని మనసుకు పట్టలేదు.

'అదికాదే సూరమ్మా, ఆ నాలుగెకరాలకొండ అమ్మి కూతుర్ని చదువులకి పంపిస్తావే అనుకో. రేపిది డాక్టరైవస్తే దీనికి తగినవాడ్ని కట్నాలుపోసి తీసుకు రాగలవా? అసలే మగదిక్కులేని సంసారం'— అని సలహాచెప్పిన మామయ్యను పదేండ్లనాడు క్షమించలేదు, శశి.

'నిజమేననుకో అన్నయ్యా. కాని పిల్లది సంబరపడుతున్నది కదా ? తర్వాత దాని అదృష్టం ఎట్లాఉండో. ఎవరు చూడొచ్చారు?'—అని పదేండ్ల నాడు తన కోర్కెను మన్నించిన అమ్మను ఈనాడు క్షమించగల స్థితిలో ఉన్నదో లేదో ఆమెకే తెలియదు.

కాని అప్పట్లో అమ్మమాటలలో కనిపించిన ఆప్యాయత శశిని ఎంతగానో ఆనందపరిచింది.

రెక్కలు విప్పుకున్న పక్షికూనకు ఎదురు గుండా కనిపించేది, తాను జయించవలసిన విశాల

ఆకాశం.కమ్ముకునే మేఘాలు. ముళ్ళుతిప్పే గాలులు. దాని ఊహకు అందుతయ్యా ?

రెక్కలు విప్పనేర్చిన పక్షిలా సంబరపడింది, శశి. అంటే నేనేకదా ?

*　　　*　　　*

శశి ఈజ్ ఎ డీసెంట్ గర్ల్—అనేది వార్డెను.

శశి ఈజ్ క్లవర్ అండ్ డెలిజెంట్ — అనే వారు గురుదేవులు, గురుదేవతలు కూడ.

శశి ఈజ్ ఎ గుడ్‌ఫ్రెండ్. కాదుటే లిమ్మీ!— అనేది కమల.

శశి ఈజ్ ఎ డేరింగు స్పిరిట్. కాదుటే కమలా !—అనేది విమల, ఉరఫ్ విమ్మీ.

శశి అంటే నేనేకదా ?

నేను మెడికలు కాలేజీలో చేరిన కొద్ది రోజుల్లోనే ఈ కాంప్లిమెంట్లన్నీ సంపాదించాను. ముఖ్యంగా డేరింగు స్పిరిటని !

సీనియర్సు కొత్తవాళ్ళను ఆటలు పట్టించే రోజులు. ఈ హాస్యాలు ఎంతో మొరటుగానూ, బాధావహంగానూ ఉండేవి. మగవిద్యార్థులు సరే. ఆడపిల్లలే ఆడపిల్లల్ని గేలిచేసేవారు.

ఈ విమల నన్నలాగే గేలిచేసింది.

యువర్ నేమ్ ప్లీజ్—అడిగింది విమల.

చెప్పాను.

'శశికళా! శశికళ చాల వోల్డు హీరోయిను. అందుకే నన్నమాట ఆ జాకెటు నలా పరికిణీలో టక్ అప్ చేశావు? హి...హి...సో తుమ్‌హారా నామ్ హై మిస్ 1930—?'—అంటూ గేలిచేసింది' విమల; హిందీ సినిమాల పిచ్చిది కాబోలు!

'థాంక్యూ గ్రానీ'—ఏమీ కలవరపడకుసమాండా ధానం చెప్పాను.

'వ్హాట్?'

'అదే, నామకరణం చేశారుగదా! మా గ్రానీ కూడ నా కిలాగే ముద్దుపేర్లుపెట్టి మురిసిపోతుండేది. ఆ బ్రా కంపెనీవాళ్ళ పుణ్యమాఅనిగాని, లేకపోతే విా రస్టు మా గ్రానీలాగే ఉండేవాళ్ళు'—మొరటు సమాధానమే. అయినా సాధ్యమైనంత సౌమ్యంగా చెప్పింది శశి.

విమల అప్పట్లో ముఖం మాడ్చుకున్నా, తర్వాత, తర్వాత మంచిస్నేహితురాలైంది శశికి.

అంటే నాకే గదా?

*　　　*　　　*

శశి ఈజ్ ఎ పెర్మగాంటు—అనేవాడో సోక్రటీసు. సూరేకాంతం అనుకో—అనేవాడో నూరుపైసల ఆంధ్రుడు. డోన్ట్‌టాక్ రట్. షి ఈజ్ ఎ ఫైన్ క్రీచర్—అనేవాడు మోహను.

మోహను శశికి సీనియరు.

శశిఅంటే నేనేకదా? నాకు మోహను రెండేళ్ళు సీనియరు.

విమల నా స్నేహితురాలైన రోజున ఆమెను చూచి నవ్వినగుంపులో అతనుకూడ ఉన్నాట్ట. అంతే కాదు. విమలచేత నేను తినిపించిన కారానికి అతని నోరుకూడ కాస్త చురుక్కుమనే అన్నదిట.

ఆ కారమే శశిని సూరేకాంతాన్ని, జినోపియానుచేసింది, కో—మెడికోస్ దృష్టిలో

కాని ఆ కారమే మోహన్‌కి శశిని ఆప్తురాలిని చేసింది.

శశి నంటే నన్నేకదా?

నాకు మోహను క్రమక్రమంగా దగ్గరివాడయ్యాడు.

*　　　*　　　*

'నిర్మలత్వంలోనుంచి జనించిన నీ నిర్భయత్వం నన్నెంత ముగ్ధుణ్ణిచేసిందో గుర్తించలేవా, శశీ? నేను నిన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాను' అన్నాడు మోహను.

చల్లటి సాయంత్రం. బీచి కళకళలాడుతున్నది—ఆనందపు హృదయాల సవ్వడులతో. అల్లంతదూరాన ఎగిరి, విరిగిపడుతున్న అలలమోత, పెళ్లి పందిట్లో విషాద సంగీతపు రికార్డు వేసినట్టున్నది. మోహను అన్నమాటలమాటుననుండి యిలాంటి ధ్వనులే ఏవో వినిపించినట్లయింది, శశికి.

శశికంటే నాకేకదా?

నన్ను మోహన్ హృదయ పూర్వకంగా ప్రేమిస్తున్నాడట. నాకూ. మోహనంటే మురిపెం లేకపోలేదు. అతని సాన్నిహిత్యంలో నాలోని ఏవో జీవన స్రవంతులు చిరుగాలికి చల్లదనాన్ని అందించే సెలయేటి తరగలౌతూనే ఉండేవి.

కాని అతని ఆలోచన వేరు. అతను మా ప్రేమకు పెళ్లిలో పరిపూర్ణత్వం సిద్ధించాలని ఆశించాడు. పెళ్లిలో మాత్రమే అది లభించగలదని అతను విశ్వసించాడు.

నాకలాంటి ఆశలేదని కాదు. అప్పటికి నాలు గేండ్లనాడు మామయ్య సూచించిన సమస్యకు పరిష్కారమార్గం మోహన్‌లో నాకు గోచరించలేదని కాదు. కాని నేను మోహన్‌ని ప్రేమించింది కేవలం పెళ్లి సమస్యకు పరిష్కారంగా కాదు.

మోహన్ ఈజ్ ఎ లవబుల్ క్రీచర్; అందుకే మోహన్‌ని ప్రేమించింది—శశి.

అందుకే మోహను, శశి దంపతులుకా వీలులేని పరిస్థితులు ఏర్పడినప్పుడు మోహన్ బాధ పడ్డంతగా శశి బాధపడలేదు.

'జీవితంలో మనం ఆశించినవన్నీ జరగక పోవటం పెద్దషాక్ ఏమీ కాదనుకుంటాను. ఏమంటావు శశీ?' అని ప్రశ్నించాడు మోహన్, శశిని.

'అటు చూడు మోహన్. ఆ అలలు ఎలా ఎగిరి, విరిగి పడుతున్నయ్యో? అలా విరిగిపడుతూ కూడా అవి నిరాశ చెందటం లేదుకదా?' అన్నది శశి.

అందమైన మాటలలో ఒదిగిపోయే భావాలను కొంతమంది తమ స్వంతం చేసుకుంటూ ఉంటారట, ఆ మాటల అందానికి మురిసిపోయి. శశిలో అలాంటి లోలుపత్వం లేదు. తనకేమీ షాక్‌లేదని ఆమె చెప్పిందీఅంటే కారణం ఆమె నిజంగా షాక్ తినకపోవటమే.

జీవితంలో ఆశించినవన్నీ లభించనంతమాత్రాన షాక్ తినేటంతటి దుర్బలురాలుకాదు శశి.

'మా నాన్న దృష్టంతా కోడలుతెచ్చే కట్నం మీదనే ఉన్నది శశీ'—అని బావురుమన్న మోహన్‌ని ఆమే ఓదార్చింది.

ప్రేమ పెళ్లిగా పరిణామం చెందనంతమాత్రాన తన ప్రేమ వ్యర్థమైనట్లు, జీవితం సర్వనాశనమైనట్లు భావించే సెంటిమెంటల్ క్రీచరుకాదు, శశి. సోక్రటీసు చెప్పినట్లు ప్రేమ ఒక సుందరమైన భావం. భగవంతునిలో తాదాత్మ్యం పొందాలనే మానవుని ఆవేదన కది రూపం. మోహన్ లవబుల్ క్రీచరు!

అందుకే ఎక్కువబాధ పడకుండానే మోహన్ నుంచి మంచిస్నేహితురాలుగా యివతలకు వచ్చేసింది శశి.

అదీగాక మామయ్య సూచించిన సమస్యను మరో రెండు, మూడేళ్లు వాయిదా వేయవచ్చునుకదా?

వాయిదా వేసేసింది, శశి. అంటే నేనేకదా?

* * *

ఆ సమస్యనలా వాయిదావేసి యిప్పటికప్పుడే ఆరేళ్లు గడిచిపోయినై.

ఆరు వసంతాలు దొర్లిపోయినై—అనిఉండే వాళ్లం, యిదే గనుక రొమాంటిక్ హీరోయిన్ల జీవితమైతే.

మరి శశి జీవితంలో?

ఆరు శిశిరాలు గడిచినై అనాలా? ఆరు యుగాలు గడిచినై అనాలా?

శశిఅంటే నేనేకదా!

ఏమైనది నా ఆరేళ్ల జీవితం?

మామయ్య సమస్య అపరిష్కృతంగానే ఉండిపోయిందికదా? అపరిష్కృతంగా నన్ను వేధిస్తున్నదా? ఏమో నాకే తెలియదు.

ఆనాడు మామయ్య మాటప్రకారం ఆ నాలుగెకరాల కొండ్రతో ఒక ఇంటిదాన్నయితే బాగుండేదేమో?

కాని మానవురాలుగా జన్మించినందుకు, మనిషి పొందవలసిన విజ్ఞానం అందుబాటులోకివస్తే, దాన్ని కాదని, మొగుడ్ని వెతుక్కుంటూ పోవటమా?

ఈ ఆరేళ్లలో అనేక చిన్న, పెద్ద పాత్రలు తారసపడినై, శశి జీవితంలో.

డాక్టరు ఆనంద్!

శశి [ హౌస్‌సర్జన్ చేస్తున్న రోజుల్లో హాస్పిటల్లో పనిచేస్తుండేవాడు. మెడికోన్‌తో సర దాగా కబుర్లు చెప్తుండేవాడు. శశిని అదేదో కొత్త ఆదరంతో పలుకరించేవాడు.

శశికి అతనూ నచ్చలేదు; అతని ధోరణీ నచ్చలేదు.

'ఆదర్శాలు వల్లెవేయటంకాదు డాక్టర్. ఆచరణ కావాలి'—అన్నది శశి డాక్టరు ఆనందంతో; వరకట్నాలను గురించి లెక్చరిస్తున్న ఆనందంతో.

'ష్యూర్, ష్యూర్. నేను ఆచరణకి సిద్ధమే. నాకు నచ్చిన స్త్రీ నన్ను చేసుకోవటానికి యిష్టపడితే నేను సిద్ధమే'

'ఏమిటి డాక్టర్, ఛాలెంజీ చేస్తున్నారు. మిమ్మల్ని పరీక్షించటానికి ఇప్పుడు ఎవరన్నా మిమ్మల్ని పెళ్లి చేసుకోవాలన్నమాట'—అని నవ్వేశారు మెడికోన్.

అతని రూపము ఏ మాత్రమూ నచ్చని శశికి అతనిలో తన సమస్యకు పరిష్కారమున్నట్లు కనిపించ లేదు. డాక్టర్ ఆనంద్! ఎక్కడున్నాడో యిప్పుడు? ఏదో స్పెషలైజేషనుకని అమెరికా వెళ్లాడు. అక్కడే స్థిరపడి పోయాడేమో?

పాత కుర్చీకి బిగించిన తుప్పుపట్టిన మేకులా తన జీవితమూ స్థిరత్వాన్ని పొందినట్లేననిపించింది శశికి.

ఏమిటీ జీవితమిలా తెల్లవారి పోవలసినదేనా?

పెళ్ళి శారీరక అవసరముమాత్రమే అయితే శశికి అదొక సమస్యకాదు. కాని శశి భావన వేరు.

మానవుడు పురోగామి కావటంలో వివాహ మొక ముఖ్యమైన అడుగు. జీవిత పరిపూర్ణతను సాధించుకునే మార్గంలో అదొక చక్కటి మజిలీ.

మాతృత్వం అనుభవించవలసిన ఆనందం.

కాని ఏమిటీ సమాజపు స్థితి? ఏమిటీ నికృష్టపు స్థితి? జీవిత భాగస్వామిని డబ్బుపెట్టి కొనుక్కోవలసిన ఈ దుర్గతిని ఏమనాలి?

చదువు సంధ్యలుండి, అందచందాలుండి పెళ్లి చేసుకునే తాహతులేని తన జీవితాన్ని ఏమనాలి? తనకే భర్త కొనరాని వస్తువైపోతే, మిగతా ఆడపిల్లల మాటేమిటి?

కట్నాలపిశాచిబారినపడి వికారంగా మారిపోతున్న మానవహృదయ సౌందర్యాన్ని చూచి ఎంతని విలపించగలం?

తన ముందున్నవి రెండే మార్గాలు. తాను అవివాహితగా మిగిలిపోవటం. లేదా తనకంటె తక్కువ వాణ్ణో, తన మనసుకు నచ్చనివాణ్ణో ఎవరినో ఒకరిని ముడిపెట్టేసుకోవటం.

ఎంతమంది పొగడ్తలనో ఎన్నోవిధాలుగా పొందిన తన జీవితంలో ఏమిటీ వెలితి?

సముద్ర, ఆకాశాలమధ్య ఎగురుతూ ఎన్నాళ్లీ జీవితాన్ని గడపటం?

తన జీవితంలో నిర్వేదం లేకపోవటమేమిటి? పక్షి కన్నులలో విజయగర్వ మెక్కడిది?

కాని పక్షి కన్నులలో విజయగర్వమున్నదంటా డేమిటీ డాక్టరు?

తెలుపుని భావస్ఫోరకంగా వాడానంటుందేమిటీ విమల?

తన వేదన ప్రపంచానికి అర్థంకాదా?

తన జీవితంలోని వెలితిని ప్రపంచం గుర్తించ లేదా?

కలలోవేసిన కేకలా తన వేదన ఎవరికీ విన్పించదా?

తన కీ లోకంనుంచి ఏమీ సానుభూతి లభించదా?

చెదరిన తేనెపట్టయింది, శశి మనస్సు.

శశి అంటే నేనేకదా?

* * *

మరొక ఏడాది కలిసిపోతున్నది, కాలగర్భంలో. పాత పాత్రలు పునఃప్రవేశంచేసినై, శశి జీవితం లోకి. డాక్టరు ఆనంద్ తన నగరానికే వచ్చాడు, ఆర్. యమ్. వో. గా.

కొత్తఆదరంతో పలుకరించాడు శశిని.

ది ఛాలెంజ్ ఈజ్ స్టిల్ దేర్—అన్నాడు నవ్వుతూ.

ఆక్సెప్ట్ చేస్తే అతని ఛాలెంజీని?

వివాహమాడితే ఆనంద్‌ని?

తానిలా ఎల్లకాలమూ రెండు మహాశూన్యాల మధ్య ఎగురుతూ ఉండలేదు. అందిన ఆధారాన్ని చేరుకొని సేద తీరటమే మంచిది.

ఆ ఆధారం ఆనందే ఎందుకు కాకూడదు?

* * *

డాక్టరు శశికళగారు గీసిన చిత్రమా యిది. ఎలా నమ్మటం?—అంటున్నారు ప్రేక్షకులు.

డాక్టరు శశిగీసిందా ఈ చిత్రాన్ని.' ప్చ్—అంటున్నారు తోటి డాక్టర్లు.

అదికాదే విమ్మీ, ఆ ఓడేమిటి? అంత అందవికారంగా ఉన్నదికదా? దానిమీద ఆ అందాలపక్షి కూర్చోవట మేమిటి చెప్పు—అంటున్నది కమల, కళ్ళనీళ్ళపర్యంతమై.

ఇంకా అంతకంటె ఆ అందాలపక్షి అలలపై పడి కొట్టుకుపోయినట్లు చిత్రించినా గ్రాండుగా ఉండేది. మన శశి భావనలో ఏమిటీ ఈ సౌందర్య రాహిత్యం?—అంటూ బావురుమన్నది విమల.

ఏమిటీ సౌందర్య రాహిత్యమే? శశిభావనలోనే వికారమా?

మరుసటి సంవత్సరం ప్రదర్శనాని కో చిత్రాన్ని గీసిచ్చింది, శశి.

శశి అంటే నేనేకదా? నిరుటి చిత్రాన్నే మరొక విధంగా చిత్రించి యిచ్చాను.

ఎక్కడినుంచి వచ్చిందో ఒక పాతకాలపు ఓడ. దాని తెరచాపమాటున సేద తీర్చుకుంటున్నది అందాలపక్షి.

నల్లటి మేఘాలు బెదిరిస్తున్నాయి ఆకాశంలో. తెల్లటి నురగలు కక్కుతున్నాయి సముద్రంలోని అలలు.

కాని పక్షి కళ్లలో బెదురులేదు. తనకు తెరచాప నీడ లభించింది కదా?

కాని ఏమి టీ వ్యాఖ్యలు?

పక్షి ఆధారం చూసుకోవటం సౌందర్య రాహిత్యమా?

అలలపైపడి చనిపోవటం గ్రాండుగా ఉంటుందా?

ఈ జీవితపు సుడి గుండాలలో పడి రాలిపోతే తప్ప తనకీ లోకపు సానుభూతి లభించదా?

ఏమిటీలోకం? ఏం చేయాలి తాను?

దొరికిన తెరచాప మాటున కూర్చొని గుమికూడి వస్తున్న మేఘాలనుంచి తప్పించుకోవాలా?

లేక రెక్కలలో బలమున్నంతవరకు ఎగురుతూనే ఉండి, బలముడిగిననాడు అలలపైపడి నమసిపోవాలా?

అలా పడిపోయిననాడు 'గ్రాండ్'అని మెచ్చుకుంటుందా ఈ లోకం!

ఎంత నిర్దయురా లీ ప్రపంచం?

తెరచాపమాటున సేద తీర్చుకుంటున్న పక్షి మెడను విరిచేయాలని ముందుకొస్తున్నాడో, ఓడ కళాసి. అతన్ని ఉత్సాహపరుస్తున్నారు మిగిలిన ఓడ కళాసీలు.

చిత్రాన్నిలా మార్చిస్తే?

లేక విమల సూచించిన మార్పునే అంగీకరిస్తే?

లేక చిత్రంలో ఏ మార్పునూ అంగీకరించనని మొండిగా, బండగా తన దోవన తాను పోతే?

బండగానా?

ఓ గాడ్! ఏంచేయా లీ అసంపూర్ణ చిత్రాన్ని?

# గజారణ్య సంహిత

## శ్రీ ఆవంచ సత్యనారాయణ

శ్రీమికీటకముల బారికి గుఱిగాకుండా లబ్ధమగుచున్న ప్రాచీన బృహద్గ్రంథములలో 'గజారణ్య సంహిత' మఱియొకటి. దీనినికూడా నా కిచ్చినవారు నా బంధువులు కాకర్ల గ్రామవాసులు శ్రీ వారణాశి వేంకటకృష్ణమూర్తిగారు. తాళపత్రదశలోనున్న యీ గ్రంథమునకు 1950 ప్రాంతములోనే ఒక కాగితపు ప్రతిని వ్రాసి తాళపత్రప్రతిని మద్రాసు ప్రాచ్యలిఖిత భాండారమునకు పంపిరి. [1]తరువాత అది తిరుపతికి చేరినట్లు ప్రాచ్యలిఖిత భాండాగార సంరక్షకులు తెలియజేసిరి. తిరుపతి ప్రాచ్యలిఖిత భాండాగారమువారు దీనిని పట్టించుకొన్నట్లేలేదు.

[2]ఇంతవఱకు యీ గ్రంథమునుగూర్చి వాఙ్మయ ప్రపంచమునకు తెలియజేసినకీర్తి విద్యారత్న శ్రీ నిడుదవోలు వెంకటరావుగారికే చెందుచున్నది. వీరి వ్రాతననుసరించి శ్రీ బులుసు వెంకటరమణయ్యగారు తమ [3]ఆంధ్రకవిసప్తతిలో దీనిని పేర్కొనిరి.

### కృతికర్త-కృతిభర్త

ఈ గజారణ్య సంహితను రచించినకవి కవిధాటి బలభద్రకవి. ఈ గ్రంథమునందు ప్రథమాశ్వాసము లభింపనందున కృతికర్త—భర్తలన్నుగూర్చిన సంపూర్ణ వివరములు లభించుటలేదు. మొత్తము ఆఱు శ్వాసముల గ్రంథము పూర్వఖండము. మఱి యుత్తరఖండ మెంతగలదో! ప్రథమాశ్వాసము మొత్తమును షష్ఠాశ్వాసమున చివరభాగమును అలబ్ధములు. ఈ ప్రబంధమునకు కృతిపతి గౌరరాజు బసవన. నందవరీక బ్రాహ్మణుడు. ప్రస్తుతము ఒంగోలు మండలమందుగల కంభం గ్రామకరణము; ఆశ్వాసాద్యంత పద్యములవలన యీతడు నాటికాలమున ప్రసిద్ధవ్యక్తియేనని తెలియుచున్నది. ఈతడు కృష్ణనరస రాజువలన సన్మానింపబడినట్లు ఈ క్రింది పద్యమువలన తెలియుచున్నది. బహుశః ఈతడో యీతని సోదరుడో కృష్ణనరసరాజువద్ద యేదో ముఖ్యోద్యోగమునందుండి యుండవచ్చును. లేనిచో ఆశ్వాసాద్యంతములందు బసవనను యిట్లు పొగడుటకు **వీలులేదు.**

కారుణ్యైక సముద్ర ససమగ్ర
స్వాంత రాజీవజీ
వారేపోరువితర్కతర్కముఖవి
ద్యాధీతినై పుణ్యపు
ణ్యారూఢాత్మజ కృష్ణ కృష్ణనరస
క్ష్మాధీశ లబ్ధప్రతి
ష్ఠారాజ్యా త్యభినంద నందవరవంద్య
క్ష్మామరాగ్రేసరా (2—

ఈతడు పినపోచనకుమారుడని ఈ పద్యమువలన తెలియుచున్నది.

శ్రీ మద్భీగిరికుల ఘన
భీమాగ్రజ కృష్ణజనక పినపోచాగ్రగ
ర్వామృతధీరా వరతే
జోమందిర గౌరరాడ్బసవబుధశౌరీ (5—1)

---

1. I am to inform you that the work Gajaranya Samhita (R. 1422) was purchased from Sri Varanasi Krishna Murthy in 1950 and the same was transferred to Sri Venkateswara Research Institute, Tirupati A. P. along with the other Telugu Manuscripts—Letter from Curator, G.O.M.S—dated 16—7—63.

2. దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము—పుటలు 401—402.

3. ఆంధ్ర కవి సప్తతి — పుటలు 140.

పై పద్యమువలన భీమప యాను నాతని కీతడు అగ్ర జాడని, కృతి రచనాకాలమునకు బసవరాజునకు కృష్ణుడను కుమారుడు గలడనియు తెలియుచున్నది. పెద ఓబామాత్యుని పౌత్రుడే గౌరరాజు బసవన.

ఈ క్రింది పద్యములవలన ఈతనిని గుఱించిన మఱికొన్ని వివరములను తెలుసుకొనవచ్చును.

> శ్రీ మద్ఘన కంబపుర
> క్ష్మామండల కరణవృత్తి సంపాదక స
> ద్భీమా గ్రజాగ్రజ కళా
> స్తోమభరణ గౌరరాడ్బసవధీరఘనా (2—)
> మునిజనఘనతేజా
> పోచమాంబా తనూజా
> త్రినయన మత సన్మా
> శ్రీమ దోబాత్మజన్మా
> వినుత గురు సమాఖ్యా
> భీమరాడ్భృత్యముఖ్యా
> వనజభవ కులీనా
> బస్వరాజప్రధానా (2—)

ఆతని సోదరుడైన భీమన ఆనాడు ప్రసిద్ధ వ్యక్తియై యుండవలెను. లేనిచో అనేకమారులు ఈతని ప్రశంసించుట కుదరదు.

కృతికర్తను గుఱించిన వివరములు ఆశ్వా సాంత గద్యయేదప్ప మఱేదియు లభ్యమగుటలేదు. ఆతని ఆశ్వాసాంత గద్య యిట్లు గలదు.

'ఇది శ్రీ సూర్యనారాయణ ప్రసాద లబ్ధ కవితా పాండిత్య రామకవీంద్రపుత్ర కవిఘాటి బలభద్ర ద్వినామక ప్రణీతంబైన శ్రీ గజారణ్య సంహితా పూర్వఖండంబునందు...శ్వాసము.'

ఈ కవి కాలనిర్ణయమునకు ఆధారములు— లభించుచున్న భాగమునందు లభ్యమగుటలేదు. షుమారు 250 సంవత్సరములనాటి వాడు గావచ్చును.

### గజారణ్య క్షేత్రము

గజారణ్యక్షేత్రమనగా జంబుకేశ్వరమని ప్రసిద్ధి. ఇది ప్రస్తుతము తిరుచురాపల్లి మండలమున తిరువనైక్కవల్ అని పిలువబడుచున్నది...ఇచ్చ టనే గల శంకరాచార్య మఠమునకు విజయరంగ చొక్కనాథుడు క్రీ. శ. 1780 ప్రాంతమున దాన మిచ్చిన దానశాసనముగూడా గలదు... కాని ప్రస్తుత గ్రంథము జంబుకేశ్వరమునకు సంబంధించినదిగాదు. పూర్వము కాళహస్తిపరిసరమున గల [4]ప్రాంతము నకు గజారణ్యమను పేరుగలదు. ప్రాచీన కాలమున ప్రస్తుత మార్కాపుర ప్రాంతములోని కొంతభాగమును గజారణ్యమని పిలుచుచున్నట్లు[5] ఆధారము గలదు.

### కృతి వివరములు—కవిత్వశైలి

ఈ గ్రంథమునం దధికభాగము నేటి ఒంగోలు మండలమందుగల మార్కాపురము (మారికాపురము)న వెలసిన లక్ష్మీ చెన్నకేశవమాహాత్మ్య ప్రతిపాదికము. మార్కాపురము పుణ్యక్షేత్రమనియు కుండకీ (గుండ్ల కమ్మనది) తీరమున నుండుటచే పవిత్రభూమియనియు ఈ గజారణ్య సంహితయందు చెప్పబడినది. మార్కం డేయ మహర్షి ఈ భూమిని కీర్తించుచు—

> 'కృతయుగే గజారణ్యం,
> త్రేతాయాం మాధవీపురీ
> ద్వాపరే స్వర్గ సోపానం,
> కలౌ స్యా న్మారికాపురీ'

అని చెప్పినాడు. ఈ క్షేత్రమునుగుఱించి రసవంత ముగా ప్రబంధశైలిలో వ్రాయబడిన గ్రంథమిది.

లభించినంతవఱకును గ్రంథపాతములు లేవు గాని ఆద్యంతములందు ఉప్తమైన భాగముతోబాటు కొన్ని ఆకులు మధ్యలో లోపించుటచే కొన్ని కథాభాగ ములు మధ్యలో ఆగిపోయినవి. దొఱికినంత వఱకును మూడువేల పద్యములకుపైగా గలవు.

గజారణ్య సంహితకు మూలము గలదేమోయని శోధించుచుండ సంస్కృతమున [6]గజారణ్య మాహాత్మ్య

---

4. అ వ్వనాభిధానంబు గజకాననంబు ...' 1—67 కాళహస్తి మాహాత్మ్యము—ధూర్జటి.

5. 'కృష్ణవేణీ నృసింహాద్ర్యోరంతరే కుండికా తటే గజారణ్య మితిఖ్యాతం మార్కండేయ ప్రకా శితం.'

6. R. No. 1422 G. O. M. S. Madras.

The manuscript Gajaranya Mahatmyam deals of the greatness of the place now called TiruVanaikkanal in Tiruchirapalli District and this contains no information about Gajaranya in Ahdhra Pradesh'— Letter from the Curator dated 8—8—63.

మను గ్రంథము గలదని తెలిసినది. కాని అది జంబు కేశ్వరక్షేత్ర మాహాత్మ్యమును గుఱించి తెలియ జేయునది.

ఈ గ్రంథమునకు సంస్కృతమూలము గలదని ప్రస్తుత మది లభ్యమగుటలేదని పంచమాశ్వాసమున రాక్షసులు స్వర్గముపై దాడి వెడలినపుడు దేవతలు విష్ణువును స్తుతియించిరని చెప్పుచు కవి

భీమసోదర ! బసవధరామరేంద్ర
దేవ గీతాది మంత్రముల్ తెనుగుసేయ
గాదుఁగావున నితిహాస ఘట్ట నామ
మాత్రముల నుచ్చరింతుఁ గ్రమప్రయుక్తి

అని చెప్పినాడు. కావున కవి దీనిని అనువాదముగానే రచించెననుట తథ్యము.

లబ్ధముగాని ప్రథమాశ్వాసమునందు కేశి యను రాక్షసుని చెన్నకేశవుఁడు వధించిన వృత్తాంత ముండి యుండవచ్చును. ఈ ఊహకు నిదర్శనము చతుర్థాశ్వాసమునందుగల శివపార్వతుల సంవాదమున

కేశిదైత్య దివోదాసకృత వి
రుద్ధ బాధ లందంటలేదని పల్కితీవు
కేశి వృత్తము మును వింటిఁ గృష్ణువలన
నా దివోదాస వృత్తాంత మానతిమ్ము

అని పార్వతి శివుని కోరుట. ద్వితీయ తృతీయా శ్వాసములందు కేశివధ వృత్తాంతములేదు.

ఈ బలభద్రకవి కవిత్వము సంస్కృతపద మయము. కొంతవఱకును ఓజోగుణపూరితమై యుండి అద్భుతమైనధార గల్గియుండును. ఎచ్చటను కుంటు పడని శైలి. యతిప్రాసలకొఱకు తడవులాట, వ్యర్థ పదప్రయోగము లితని రచనలో గాన్పించవు. సమర్థు డైన కవియని ఘంటాపథముగా చెప్పవచ్చును. శైలికి రెండు పద్యముల నిచ్చుచున్నాను.

[7] శ్రీయోషాశయపల్లవా గ్రఖహ నౌ
చిత్యంబు నేకాంతిక
శ్రేయస్స్వాంత నిశాంతదీప విపులార్చి
శ్రేణి గీర్వాణ దై
తేయ ప్రస్ఫుట మౌళిరత్నరుచి
సందీప్తంబు మంత్రాద్య వి
ద్యా యోషిత్కబరీ లతాంత
మజగార్భాంతత్వ సంజీవమున్ (2—)

ఎల్లశరీరధారులకు
నిత్యగుణం బవినానుబంధమై
చెల్లుచునుండు కుండలకు
చీరలకు మృత్తికనూలుబోలె న
ట్లల్లిననేమి మిథ్యసుధి...క
...శరీరము తోటిపాటుచే
నిల్లగుగాని యన్యుల మ
నీషల బోవదు మూర్తి బోవకన్ (3—)

ఈతనిది కథాకథనాత్మకశైలి. కథను చెప్పుట యందే కవిదృష్టి లగ్నముగాని వర్ణనములు ఎడనెడ జేసినను సంక్షిప్తముగా నుండును.

ఇందు ద్వితీయాశ్వాసమున సూర్యోదయ, శశిర, హేమంతఋతువర్ణనము, పంచమాశ్వాసమున సుతజన నము, వనవిహారము, జలక్రీడ, సూర్యాస్తమయ చంద్రోదయ వర్ణనములు, తృతీయాశ్వాసమున మంత్రము రణము మొదలైన అష్టాదశ వర్ణనముల లోనివి ప్రబంధశైలిలో వర్ణింపబడినవి. ఐనను వాని నిడివి చాలా తక్కువే.

## కథా విష యము లు :

ఇందు ద్వితీయాశ్వాసమున పుష్కల వృత్తాం తము, ముద్గల చరిత్ర,సువిందోపాఖ్యానము,సుద్యుమ్నో పాఖ్యానము. తృతీయాశ్వాసమున ఇంద్రబ్రాహ్మణ సంవాదము,మారికాపుర మహిమ, కుండకీనదీ జననము చతుర్థాశ్వాసమునభూలోకము సర్వబాధలకులోనగుట, విష్ణువు బ్రహ్మాదులకు రాజధర్మముల నుపదేశించుట, దివోదాసపట్టాభిషేకము, అతడు చెన్నకేశవునిపై దాడి వెడలుట, బ్రహ్మ దివోదాసునికి మారికాపురీ మాహాత్మ్యమును చెప్పుట, పంచమాశ్వాసమున రాక్ష సులు స్వర్గముపై దాడివెడలుట, దేవతలు చెన్నకేశ వుని శరణుజొచ్చుట, సృంజయాఖ్యానము, సృంజ

---

7. ఈ వ్యాసమునందలి పద్యములను నేను సంస్కరించలేదు. యథాతథముగా ఉదాహరించితిని.

యుని కూతు నారదుడు వివాహమాడుట, తుంబురుని శాపముచే నారదుడు కోతియగుట, నారదశాపమోక్షము, శంఖలిఖితోపాఖ్యానము, మంథరయనువేశ్య కథ, వీర బాహోపాఖ్యానము, షష్ఠాశ్వాసమున చండివేశోపా ఖ్యానము—అను విషయములు వర్ణింపబడినవి

విష్ణువు బ్రహ్మ కుపదేశించిన దీర్ఘమైన రాజనీతి ప్రసంగమువలన, నాటిరాజులు వసూలుచేయు పన్నులను గురించి తెలియుచున్నది.

పశుహిరణ్యముల నేబదిపాళ్ల నొకపాలు
ధాన్యంబులం దెల్ల దశమ భాగ
మతి దుర్జనార్థ చౌర్యార్థంబు లన్నియు
సద్ధర్మములయందు షష్ఠమాంశ
మార్జించి దుష్టజనాదుల శిక్షించి
శిష్టులనెల్ల రక్షించిపెంచి
రంకు ముచ్చిమయు గ్రూరతయును సైపక
క్షితిపతి ప్రజల బోషింపుచున్న
బలవిహీనాత్మకులఘాతిజలచరముల
కరణి నడవక భూప్రజల్ కరుణ దమము
గలిగి యితరేతరప్రీతి గడల కొనగ
వెలయుచుందురు నిజజాతివృత్తియందు(3—)

ఇట్టి అమూల్యములగు అనేక విషయముల నిక్షిప్తముగాయున్న ఈ గ్రంథమును చెదపుర్వుల కాహారము కానీయక కాపాడి నా కొసగిన శ్రీ కృష్ణమూర్తి గారికి అత్యంతము కృతజ్ఞుడను.

రవినై ద్వాదశనామరూపములచే
బ్రహ్మాండ గర్భంబునన్
దివియున్ భూమియు నేర్పరింపుచు
ధరాదేవుల్సహాయుల్గ శా
శ్వతమందేహులఁబారద్రోలుచు మహా
ధ్వాంతంబులన్ ద్రోచుచున్
వ్యవహారంబులకెల్ల సాక్షి వగుచున్
వర్తింతు వీ వంతటన్



# "యౌవనే విషయైషిణాం"

## "ఆంగీరస్"

[గతసంచిక తరువాయి]

### 5

ఇప్పుడు యువజనంలో ప్రపంచం అంతటా ఒకవిధమైన అలజడి కన్పిస్తున్నది. ఇందుకు బహుమంది బహుకారణాలు చెబుతున్నారు. ముఖ్యంగా ఐరోపాలో ఆ కారణాలను విశ్లేషించి, వానికి దాదాపు శాస్త్రప్రతిపత్తి అంతటి స్థాయిని చేకూర్చడంగూడా జరుగుతున్నది. యువజనంలో కన్పిస్తున్న క్రమంలేని ప్రవర్తనలకు వారు పెరిగిన అభద్రమైన వాతావరణం ఒక కారణమని, అంతేగాక వారి తల్లిదండ్రుల మధ్య పొసగనితనాలవంటివి బలిసి, ఆ యువజనంలో స్వైరవృత్తి ఏర్పడిందని నిగమిస్తున్నారు. అయితే ఇటువంటి సిద్ధాంతం సర్వత్రా అనువర్తనీయం అనిగాని, సర్వేసర్వత్రా కన్పించేదిఅనిగాని అనలేము. తల్లిదండ్రులమధ్య తగాదాలు, వివాదాలు ప్రతిదేశంలోను వుంటాయి. అయితే ఆ ప్రతిదేశంలో, అటువంటి వాతావరణంలో పెరిగిన సంతానం, స్వైరధీ తాడితము, దూషితము కావడంలేదు. అదేవిధంగా తమకు ముందుకాలంలోవున్న స్త్రీ పురుష సంబంధాలు, పైకి సమర్యాదము, లోపల నిశృంఖలము, తుచ్ఛముఅయి ప్రవర్తిల్లిన పద్ధతినిచూచి, తమకు ముందుతరంలోని నీతిసూత్రాలు పైన పటాటోపములు, లోపల లొటారములు కావుటచూచి, ఈ తరం ఎదురుతిరుగుతున్నదని, విశృంఖలతను వహిస్తున్నదని అంటూ ఈ స్థితికి కారణాలను వెమకడం గోచరిస్తుంది. పంథొమ్మిదవ శతాబ్దంలో బ్రిటన్, ఫ్రాన్సు మొదలైన దేశాలలో స్థితిని గురించి 'On sexual revolutions in History' అన్న ఒక వ్యాసంలో ఆర్నాల్డ్ టోయన్‌బీ ఇట్లా వ్రాశారు: '19 వ శతాబ్దంలో ఆంగ్లోశాక్సన్‌దేశాలలో స్త్రీ పురుష సంబంధమైన నీతిసూత్రాలను గురించి అధికారికంగా వెలయింపబడిన కట్టడి చాలా గట్టిగా వుండేది. ఫ్రాన్సులో అటూ ఇటూగా అదే పద్ధతి చెల్లుతూవుండేది. అయితే ఆచరణలో తరచు ఈ నీతిసూత్రాలు కికురింపబడి, భంగపరచబడి, సిద్ధాంతానికి ఆచరణకు నడుమ విరోధం బాధమై, చివరకు ఆ నీతియొక్క కట్టడులు భ్రష్టనీతి పద్ధతులకు దారితీయగా, విషమఫలితాలు ఏర్పడ్డాయి.' అంతకు ముందుగూడా చరిత్రలో ఇటువంటి కొన్ని సందర్భాలు ప్రవర్తిల్లివున్నట్లు టోయన్‌బీ దాఖలాలు చూపించారు. ఆ దాఖలాలు ఎన్ని దేశాలకు, ఎన్ని నాగరికతలకు సంబంధించినవి అన్నది సమస్యకాదు. అటువంటి దృష్టాంతాలు చరిత్రలో వున్నాయి. ఇంగ్లండునే తీసుకుందాము. 'క్రామ్‌వెల్ ఏలుబడి కాలం వుంది. అది పూర్తిగా నైతికధర్మము, పూర్తిగా మడికొట్టి కొనడము—మీద నడిచింది. ఆ తర్వాత వచ్చిన రెస్టొరేషన్ కాలంలో ఆ నీతిఅంతా విశ్లథమైపోయింది. ముఖ్యంగా రీజన్సీకాలంలో నడిచిన భ్రష్టనీతిపై తిరుగుబాటుకు విక్టోరియన్ కాలంనాటి నీతిపద్ధతికి కారణం కన్పిస్తున్నది' అని ఆ చరిత్రను టోయన్‌బీ వివరించారు.

చరిత్రలో చూడవలసిన అంశాలు కొన్ని వుంటాయి. ముఖ్యంగా నీతివిషయంలో. అందులోనూ స్త్రీ పురుష సంబంధమైన నీతివిషయంలో. ఎందు చేతననగా నీతివిరళత్వం కానీయండి, లేక నీతిప్రాభవం కానీయండి, బాహుళ్యంమీద సర్వే జనులను ఒక్కరీతిగా పాలించవు. అవి మనిషి మనిషికి మారుతూ వుంటాయి. అచ్చట వయస్సు, ఇల్లు, కుటుంబపు కట్టుడలు, అనభిజ్ఞాతమైన కొన్ని అంతర ఆదర్శాలు గూడా పనిచేస్తాయి. ఇప్పుడు కొన్ని ఇతర దేశాలలో వచ్చిన నీతి విప్లవాన్నే పరిశీలన చేద్దాము. ఆ విప్లవాలు కొద్దిమందికి మాత్రమే పరిమితమై వుండటం

కన్పిస్తుంది. అవి సామాజిక ప్రకోపాలు అవడంచేతను, వానికి అధికార ధూర్వహత్వం అన్నది లేకపోవడం చేతను, వాని పలుకుబడి, ప్రాబల్యాలు పరిమితము అవచ్ఛిన్నము అయివుండటమే గాక, తత్కాలంలోనే తత్సద్వ్యతిరక్తమైన భావస్థితియొక్క ఆవిర్భావానికిగూడా కారణం అవుతున్నాయి. ఒక కాలంలోని అపధర్మానికి, ఇంకోకాలంలో విక్రియ బయలు దేరుతుంది అన్న సిద్ధాంత ప్రాతిపదిక సమంజసమై కన్పించదు. ఒక నీతి కఠినమై, సడలింపులు ఎరుగనిదై, జన జీవితానికి బంధకమైనదైనప్పుడు, తత్క్షణంలో దానికి ప్రతిక్రియ, ఆ ప్రతిక్రియను అనుసరించిన క్రియా కలాపము ఆరంభం అవుతాయి. ఇందుకు హిప్పీల ఉద్యమాన్ని ఈ కాలంలో ఉదాహరణగా ప్రదర్శించవచ్చు. ఒకప్పుడు ఆంధ్రదేశంలో సాగిన స్వైరప్రేమవాదాన్నిగూడా ఇందుకు ఉదాహరణంగా చెప్పవచ్చు. ఇప్పుడు ఆ సంగతులు మాట్లాడేవాళ్లే తెలుగుమాట్లాడేప్రాంతాలలో కన్పించరు. అదేవిధంగా మరికొన్ని ఉదాహరణలుగూడా ఏ దేశం చరిత్రను ఏ ప్రాంతంచరిత్రను వెదికినా కన్పిస్తాయి.

ఇక్కడ చెప్పవచ్చిన విషయం ఇది. ఒక భావం అంటూ వున్నప్పుడు, దానికి ఆ వెంటనే ప్రతి భావంగూడా పుడుతుంది. ఆ భావజన్మ, దానికి ప్రతియైన భావము రాత్రి పగలులాగా ప్రవర్తిల్లుతూ వుంటాయి. అసలు ఏ మనిషికి ఆ మనిషి తన్నుతాను చూచుకోగల్గినప్పుడు, అనుక్షణము తనలో ఇట్టి భావ సంఘర్షణ కొనసాగడం చూచుకోగల్గుతాడు. ప్రతి మనిషిలోను ఈ సంఘర్షణ జరుగుతూనే వుంటుంది. దానికి విరతిగూడా వుండదు. మనస్సును కట్టడంకన్న, వదలడం తేలిక గనుక, లోపల జరిగే ఈ సంకల్ప వికల్పక్రియాకలాపం అంతా పల్లాన్ని చూచుకుంటూ, లోకాన్ని చూచి నిలుస్తూ, ఆ మనిషి శక్తి అశక్తతలనుబట్టే గట్టుకట్టుకుంటూ నడుస్తుంది. అనగా ఒక మహావిషయాన్ని గురించి విశ్లేషణం చేస్తున్నప్పుడు, దానిని దానియొక్క విస్తరణ స్థితిలోనేగాక, వైయక్తిక స్థితిలోగూడా తరచిచూడవలసి వుంటుంది. ఇచ్చట విస్తరణ అన్నది ఒకానొక ఆంతర ప్రకోపంయొక్క ప్రసరణమే గనుక, ఏవంవిధమైన ఆంతర ప్రకోప సామాన్య ధర్మ విలసనంవున్న జనం మేరకే దాని ప్రసరణము, విస్తరణ జరుగుతాయి. అందువల్ల ఇచ్చట కార్యాన్నిచూచి కారణాన్ని నిర్ణయించి, దానికి ఒక సిద్ధాంత స్థాయి కల్పించడంలో సామంజస్యం కన్పించదు. కారణాన్నిబట్టి కార్యవిలసనాన్ని, ఆ కారణానికి స్థానమైన అంతఃప్రకోపలక్షణాన్ని బట్టి, దానిని మీమాంసించడానికి పూనుకున్నప్పుడు, భ్రష్టనీతి వికారాలను వింగడించడము, నియమించడము సాధ్యం అవుతుంది. అట్లాగాక. ఒక వికారంయొక్క పరిమిత విస్తరణను అపరిమిత విస్తరణ అన్నంతగాచేసి, దానిని వింగడించి, సమాజగతిధర్మాన్ని విశ్లేషించడము, నిగమించడము చేసినప్పుడు అది ఏకదేశత్వస్థితిని విశ్వస్థితిలోపెట్టినట్లే, అది అది కాని దైనందు వలన సంభవించే ఇతర వికారాలు బహుధా సంప్రాప్తం అవుతాయి.

## 6

కార్యాన్నిబట్టి కారణాలను నిగమించడానికి దిగినప్పుడు కొన్నిసందర్భాలలో అంతా అయోమయంగా తయారై పూరుకుంటుంది. ఇందుకు చరిత్రను గురించిన వ్యాఖ్యానాలను చూస్తే చాలు—అది అట్లా అని తెలిసిపోతుంది. కారల్ మార్క్స్ చరిత్రకు ఒక వ్యాఖ్యాన పద్ధతి వెలయించాడు. అదే చరిత్రకు ఆర్నాల్డ్ టోయన్‌బీ వెలయించిన వ్యాఖ్యానం అందుకు భిన్నమై ఇంకోవిధంగావుంది. కారల్ మార్క్స్ సమాజ ధర్మాన్నిగురించి ఒకటి చెప్పాడు. ఆ సమాజాలు అట్లా ఏర్పడ్డానికి ఆర్థికాదికమైన వ్యవహారమే అధిష్ఠాన కారణం అన్నంతగా అతని ఆ వాదం నడిచింది. అదే సమాజాన్ని తీసుకొని, ఆ సమాజాన్ని శాసించే పద్ధతిలో అర్థధర్మం అంతప్రధానంకాదని, అధికారవ్యామోహం అత్యంతప్రధానమైనదిగా అవభాసిస్తున్నదని బెర్ట్రాండ్ రస్సెల్ నిరూపించాడు. వీనినిబట్టి తేలేవిషయం ఒక్కటే. ఏఒక్కకార్యాన్ని గురించిగాని, విప్రతిపత్తిలేని పద్ధతిలో, పూర్వపక్షరహితమైన పద్ధతిలో కారణాన్ని అన్వేషించడం కుదరదు. ఇంతవరకు కుదరలేదు. ఇది ఇట్లా వున్నది కనుకనే నీతివిషయంలోను వివాదం వస్తున్నది. ఈ నీతివిషయంలో స్త్రీ పురుష సంబంధము, తత్సంబంధమైన నీతి సంఘంయొక్క సుస్థితికి ముఖ్యము, అవ

సరముగనుక, ఆదిమ కాలంనుంచీగూడా దానినిగురించి మేధావులు చర్చిస్తూనే వచ్చారు. మనువుదగ్గరనుంచి ఈ విచారణ సాగుతూనేవుంది. భగవద్గీతలలో అర్జునుడు 'యద్యప్యేతే నపశ్యంతి, లోభోపహతచేతసః' మొదలైన శ్లోకాలలో ఈ విచారణను చేసిన తీరును బట్టి ఒకనాటి ఆలోచనా పద్ధతిలోని, ఒకభాగము లేక ఒక పార్శ్వముయొక్క రూపము కన్పిస్తుంది.

గీత మొదటి అధ్యాయంలో అర్జునిని వచనాలు ఇట్లా వున్నాయి.

యద్యప్యేతే నపశ్యంతి
లోభోపహత చేతసః
కులక్షయం కృతం దోషం
మిత్రద్రోహేచ పాతకం
కథం నజ్ఞేయ మస్మాభిః
పాపాదస్మా న్నివర్తితుమ్
కులక్షయం కృతందోషం
ప్రపశ్యద్భి జనార్దన
కులక్షయే ప్రణశ్యంతి
కులధర్మా స్సనాతనాః
ధర్మే నష్టే కులం కృత్స్న
అధర్మోఽభిభవ త్యుత
అధర్మాభిభవా త్కృష్ణ
ప్రదుష్యంతి కులస్త్రియః
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ
జాయతే వర్ణసంకరః.

ఇందులో వర్ణసంకరం మొదలైన విషయాన్ని అట్లా వదిలివేసి, తక్కిన విషయాలనుచూస్తే గమనించ వలసిన విషయాలు కొన్నివున్నాయి. లోభోప హతచేతసః, దోషం ప్రపశ్యద్భిః అస్మాభిః; స్త్రీషు దుష్టాసు— ఈ మాటలు గమనించ దగినవి. అంతేగాక కులక్షయకృతం మొదలైన వాక్య సంతానంగూడా గమనించదగిందే. ఇది ఒక వికారంఅన్నది వుండగా, దానికి విరుద్ధమైన ధర్మపద్ధతి దానివెంటనే అక్కడవుంటున్నది. ఆ రకమైన విరుద్ధలక్షణాల, లేక వికారాల యుగపత్స్థితి ఇచ్చట లోభోపహతచేతసః; దోషం ప్రపశ్యద్భిః అస్మాభిః; అన్నమాటలలో ప్రతీతిని పొంది వుంది. ఇక నీతి భ్రష్టం అయిపోవడానికి కులక్షయము, కులస్త్రీలు చెడిపోవడముమీద ఆరోపించబడింది. పురుష ప్రసక్తి లేదు. ఆ నీతి క్షామాన్ని అర్జునుడు ఇచ్చట స్త్రీలు చెడిపోవడంమీదనే నడిపించాడు. ఇది యదార్థం అనలేము. ఉభయత్రా నీతిక్షేత్రాంవల్లనే నీతి చెడుతుంది. అయితేఇచ్చట ఆ నీతిని విస్తృతంచేసికాక, కులంవరకు, అనగా వంశం వరకు పరిమితంచేసి చెప్పడంలో, ఆ మీమాంసాపద్ధతిలోని లోతును గ్రహించవచ్చు. విస్తృతిమీద విచారణలో ఫలితం పల్చబడిపోతుంది. నీతిని వింగడించి, ఏకత్రస్థితిలో దానిని చూచినప్పుడు దాని పూర్వాపరాలు, వృద్ధిక్షేత్రాలు తెలుస్తాయి. ఇచ్చట కులక్షయానికి కారణానికి లోభోపహతచేతసత్వాన్ని చెప్పడంలోవున్న ఔచిత్యాన్నిగూడా గ్రహించవలసి వుంది. ఇది దుర్యోధనాదులను గురించి చెబుతున్నమాట. వారి రాజ్యలోభాన్ని గురించి వింగడిస్తున్నమాట. బెర్ట్రాండ్ రస్సెల్ 'Power' అన్నగ్రంథంలో మీమాంసించినదానికి, ఇచ్చట ఈ 'లోభోపహత చేతసః' అన్న మాటలకు వున్న సామ్యంగూడా గుర్తించదగిందిగా వుంది. మరి లోభం కామంయొక్క ఒక్క లక్షణమేకదా. ఈ కామభావం కాష్ఠస్థితిని ఉదాత్తభావగర్భితంగా ఈ మంత్రం సుష్ఠుగా చెబుతున్నది.

బ్రహ్మ క ఇదం కస్మా ఆదాత్, కామః కామాయ, కామోదాతా, కామః ప్రతిగ్రహీతా, కామగ్ం సముద్రమావిశ, కామే నత్వా ప్రతి గృహ్ణామి.

ఈ మంత్రం అర్థం ఇది—'బ్రహ్మ బ్రహ్మ కొరకు దానిని ఇచ్చెను. కామమె కామాభిలాషి కిచ్చెను. కామమె దాత. కామమే ప్రతిగ్రహీతయును. ఓ ప్రజాపతీ! కామసదృశమగు సముద్రమును ప్రవేశింపుము; ఓ ద్రవ్యమా కోరికతో నిన్ను గ్రహించుచున్నాను.'

## 7

ఐరోపాలో ఇప్పుడు కన్పిస్తున్న ఈ విపరీత లక్షణంలో గమనించవలసిన ఇంకో విశేషాన్ని పైన పేర్కొన్నటువంటి, (ది సెక్సుయల్ రివల్యూషన్' లోనే) టోయన్‌బీ వివరించారు. విక్టోరియన్ కాలంలో నీతిఅంతా 'నొసలు బత్తుడు, నోరు తోడే'లన్న ధోరణి

ణిలో సాగిందనిగదా ఆయన నిగమనం. దానిని ప్రాతి పదికగా తీసుకొని ఇప్పుడు కన్పిస్తున్న ఈ విప్లవ లక్షణాన్ని గురించి వివరిస్తూ ఆయనఇట్లా వ్రాశారు. ‘‘I believe that the present movement in favour of a greater liberty in sexual behaviour is, at least partly a healty reaction against Victorian hypocricy. What the young people of today are saying in effect is this:our predecessors were no better than us. We do not pretend anything. We do openly what they did secretly’’.

కొంచెం ఆలోచించిచూస్తే ఇది విపరీతంగా కన్పిస్తుంది. ఎందుచేతనంటే, అవతలి ఆ పూర్వీకులు చేసింది తప్పని, Hypocricy అంటూనే, దానిని ముసుగు తొలగించి సాగించడం విపరీత ధీ విశేష మున్నూ, ఆమయమున్నూగాక ఏమౌతుంది! ఒక వ్యాధిని పైకిదాస్తూ, లోపల అపథ్యం చేస్తున్నప్పుడు—అది ఎంత చెడ్డదో, ఆ వ్యాధిని రోడ్డున పడవేసి, అది ఏదో స్వస్థత అనుకోవడము, వారు రహస్యంగా చేసినదానిని మేము బహిరంగంగా చేస్తున్నా మనడము—ఏవిధంగా, ఎంతటి యుక్తిసహంగా ఆలోచించినా, ఆరోగ్యవంతమైన విషయంగా కన్పించదు. ఆ తిరుగుబాటు లక్షణం అన్నది ఆరోగ్యవంతమైన దేమో, భగవంతుడికే తెలియాలి. కాని ఆలోచించి చూస్తే, ఆ పూర్వులది Hypocricy అయితే, వీరిది పూర్తిగా Wikedness గా కన్పిస్తుంది.

అది ఒక్కటేకాదు. ఈ యువజనం ఒక రకమైన స్వైరవృత్తిని అవలంబించారు. ఆ స్వైర వృత్తి తప్పని, అది చేయదగిన పనికాదని వారికి తెలుసు. కాని ఆ విపరీతచిత్తవృత్తిని వారు నియమించుకోలేక పోతున్నారు. ఆ సంయమించుకోలేని తనానికి తాత్వికమైన హేతుకల్పన చేస్తున్నారు. దానికి ఏదో ౼ాడుగు తొడుగుతున్నారు. అందుకు ఈ వాదం అనగా పూర్వులు, తుచ్ఛులు, మేము మర్యాదస్థులము—అన్న పద్ధతి వాదం వెలయించడానికి వారు దిగుతున్నారా అనిపిస్తుంది. కానిపక్షంలో, ఆ తిరుగుబాటు సముచితానికి, సమసంయమనానికి దారితీయాలి. విక్టోరియన్ కాలంలోనేమి, లేక మరి అటువంటివే అయిన ఇతర చారిత్రకకాలాల్లోనేమి, ఒక చెడు అతఃపూర్వం కొనసాగినప్పుడు— దానికి ప్రతిక్రియగా తద్భిన్నమైన, అచ్ఛంగా మర్యాదమైన సమ్యక్‌భావసంపత్తి ఉద్భవంచెందుతూవచ్చింది. ఇప్పుడూ అటువంటిది సంభవం కావచ్చు. పైన ఉదహరించిన భగవత్ గీతాశ్లోకంలో దురాచార, సదాచారాల యొక్క యుగపత్‌స్థితి చెప్పబడింది. లోకాన్నిచూచినా అది అట్లాగే అనిపిస్తుంది. అందువల్లనే తక్కిన ఈ విపరీతకాముకచిత్తవృత్తులు వట్టి వికారాలై, ప్రకోపాలై నిల్చిపోతాయి.

ఇటువంటి వికారాలు చరిత్రలో ఇప్పుడే పుట్టలేదు. అవి అట్లా యుగయుగాలుగా సాగుతూనే వస్తున్నాయి. ముందుగూడా సాగుతాయి. మనిషి అన్నం తింటున్నంతవరకు, సంసారం చేస్తున్నంతవరకు అవి అంతే. మరి ఆ రెండుపనులు చేయకుండా మనిషి వుండడు. అందుకే మనిషినిగురించి ఆలోచిస్తున్నప్పుడు ఈ వికారాలన్న వాటిని నియమించడానికే సర్వదా ప్రయత్నం జరుగుతూవచ్చింది. సంఘం కట్టుబాట్లే కాక, ఆత్మ సంయమనం ఆదిగాగల పద్ధతులు చెప్పబడినాయి. ఇప్పుడు ఈ తిరుగుబాటు ఆ రకం చెలియలికట్టలనే దాటి, స్వైరం అయిపోతుందేమో నన్నంత భయం అక్కడివారికి కల్గుతున్నది. ఈ భయంతో ఈ విపరీతస్థితికి కారణాలు వెదుకుతున్నారు. కొందరు మేధావులు ఆ వైపరీత్యాలకు అనుకూలమైన సిద్ధాంతాలు వెలయిస్తున్నారు. అక్కడ ఏదో Establishment అంటూ వున్నదని, దాన్ని విచ్ఛిన్నం చెయ్యాలని, అప్పుడుగాని లోకం రోగం కుదరదని చెబుతున్నారు. కొందరు ఈ రకమైన విపరీతపు ధోరణిలో ముందురానున్న ఉజ్వల భవిష్యత్తులను చూస్తున్నారు. మరికొందరు ఒక సమాజంయొక్క పతనావస్థను, అంతిమదశను సంలక్షిస్తున్నారు. ఇట్లా ఒకేరకమైన కార్యాన్నిగురించి కారణాలు గురువై, బహుళమై కన్పిస్తున్నాయి. ఈ స్థితిఅంతా ‘ఎక్కడ సత్యము; ఎక్కడ వలపు; ఎక్కడ నేమము ’అన్న పద్ధతిగా పర్యవసిస్తూ వుంది. అచ్చట ఏదోఒకటి వున్నది—అందులో అనుమానం ఏమీలేదు. కానీ ఈ సిద్ధాంతులు తమ తమ మేధ

స్సులనుండి పుట్టిన హేతుకల్పనలను, ఆ వున్నదేదో దానిపై అధ్యారోపంచేసి, దానిని మరీ అయోమయము, అర్థక్లిష్టము చేస్తున్నట్లు కన్పిస్తుంది. వీరిలో కొందరు సంయమనాన్ని నీతి నిబంధనను కోరుతూవుండగా, కొందరు సర్వవైనాసికమైన ధర్మాలను ప్రపంచిస్తున్నారు. ఇంతకన్నా మానవుని మేధకు పట్టిన వ్యాధి, అయోమయస్థితి ఇంకా ఒకటి వున్నదా అని అనిపించే ఒక విచిత్రమైన అవ్యవస్థ ఏర్పడుతున్నది. శ్రోత్రియులను గురించి వ్రాస్తూ, పెద్దన్నగారు—వారిని బుద్ధి జాడ్యజనితోన్మాదుల్ కదా! అన్నారు. ఇప్పుడు ఈ సిద్ధాంతులను, వారి సిద్ధాంతాలను చూస్తూవుంటే, అలనాటి పెద్దన్నగారి ఆ మాటలు జ్ఞాపకం వస్తాయి.

## 8

అయితే లోకంలో అన్నికాలాలలో అన్ని దేశాలలో ఎవ్వరుగాని, 'తుచ్ఛ సుఖముల్ మీసాలపై తేనియల్' అని అనలేరు. ఆ అనలేరనడానికి మన ప్రబంధ సాహిత్యం అంతటా దాఖలాలు వున్నాయి. అచ్చట అచ్చమైన మనుష్యులను తీసుకొని, ఆ ప్రబంధ కారులు మనుష్యుల చిత్తవృత్తులను నిరూపించడానికి పూనుకొన్న కారణంచేత, సర్వప్రవృత్తులవారు—తెలుగుదేశానికి సంబంధించినంతవరకు, ఆ ప్రబంధాలలో కన్పిస్తారు. ఆ ప్రబంధ కవులు, పూర్వగాథలను ఇతివృత్తాలుగా గ్రహించే తమ ప్రబంధాలను రచించుకుంటూ పోయినా, ఆ కవులు తమ కాలాన్ని ఆ రచనలలోనికి పట్టడానికి, గట్టిప్రయత్నం చేశారు. అందువల్లనే తెలుగుదేశంయొక్క సామాజిక చరిత్రకు అవి ఆధారభూతమైన గ్రంథాలు అవుతున్నాయి. పెద్దన్నగారిని లేకపోతే శ్రీనాథులవారిని తీసుకొని అక్కడనుంచి, కూచినుంచి తిమ్మకవివరకు వున్న ప్రబంధకవులయొక్క గ్రంథాలను చూచుకుంటూ పోతే, తెలుగుదేశంలో సంప్రాప్తమైన శృంగార సంబంధమైన విప్లవంయొక్క లక్షణాలు కొన్ని గోచరిస్తాయి. 'పంచారామవధూటీ పంచాస్త్ర విహార కేళి పాంచాలురు'— మొదలైన పద్ధతి వర్ణనలను చూచి, కూచిమంచి తిమ్మకవి తన రసికజనమనోభిరామంలో ఒక ఆశ్వాసం ఆశ్వాసంలో వర్ణించిన శృంగారలీలావిలాసాలనుచూస్తే, నాజూకుగా ప్రారంభమైన ఆ ధోరణియొక్క శ్లథావస్థయొక్క లక్షణం గోచరిస్తుంది. మహాసామ్రాజ్యాలకాలంనుంచి, జమీందారీలవంటి సంస్థానాలుగా ఆ రాజ్యాలు విడిపోయిన నాటికి ఏర్పడిన చిత్తవృత్తియొక్క లక్షణం గోచరిస్తుంది. అయితే ఆ కవులు చాలా సందర్భాలలో జాగ్రత్తలు పడ్డారు.- ఒకవంక సమాజాన్ని, సమాజంలోని విపరీత చిత్తవృత్తులను ఇట్లా ప్రదర్శిస్తూనే, ఇంకోవంక, ఆ ప్రకోపాలను నియమించుకొనడానికి, మార్గాలను ఆ ప్రబంధాలలోనే సూచిస్తూ వచ్చారు.

> 'ఆశ్రమంబులలోన గార్హస్థ్యమధిక
> మనఘ! లక్షణవతియైన అలుచూవె
> తగిన అవలంబునంబు . తద్ధర్మములకు'

అంటూ శ్రీనాథుని కాలంనుంచి చెబుతూనే వచ్చారు.

ఇందుకు చూడగా ఒక్కటే కారణం కన్పిస్తుంది. ఒక భావ ప్రకోపము, తదుపశాంతి లక్షణము—యుగపత్తుగానే వుంటూ వుంటాయి.సమాజం స్వస్థమైనదైనప్పుడు ఇట్లా వుండాలి. శరీరంలో వ్యాధి లక్షణాలకు, ఆ లక్షణాల ఉపశాంతికి, అవసరమైన అన్నిహంగులు ఏలా అమరివుంటాయో, ఏలా ఒక దానిని అంటి ఒకటిగా వుంటాయో, అదే విధంగా సంఘశరీరంలోగూడా వుంటాయి. అయితే ఆ స్థితి సమత్వాన్నిమించి, విషమంలో పడినప్పుడు వ్యాధి లక్షణాలకు, తదుపశాంతి పద్ధతులకు వైషమ్యం ఏర్పడ్డప్పుడు, వ్యాధి లక్షణం బలీయమైనదైనప్పుడు విప్లవం వస్తుంది. అది ప్రళయ లక్షణం కల్గింది అయినా కావచ్చు. కాని అది ఎప్పుడోగాని, జరగదు. ఆలోచనలు, ఊహాపోహలు సావధానస్థితిలో వున్నంత వరకు జరగదు.

తెలుగుదేశంలో ప్రబంధ కవులు ప్రదర్శించిన ఈ సాంఘిక చైతన్యంలోని కొన్ని లక్షణాలను అనంతర కాలీయులు మరికొంతఆటవెలివారు విమర్శించారు. ఆ విమర్శ ఆప్రబంధాలను, వానిలో చూపబడిన సంఘంయొక్క లక్షణాలను సమ్యగవగాహనం చేసుకొని కాక, అచ్చట వాడిన పదబంధాదికాలమీద తగాదాలు పెంచారు. కచ కుచాదిపద ప్రయోగ బాహుళ్యం

వున్నదంటూ, ఆ రకం పదజాలాన్ని తొలగించి, వానిని సంస్కరించాలని చూచారు. అది ఒక రకమైన 'మడివాదం'గా పెరిగిపోయింది. ప్రబంధ కవులను, వారి కాలాన్ని, ఆ కాలం లక్షణాన్ని, వారి గ్రంథాలలో చూడటం మానివేసి, తమకు ఎబ్బెట్టుగా కన్పించిన భాగాలను తీసుకొని, కొన్ని గ్రంథాలకు అశ్లీల గ్రంథ నామధేయాన్ని తొడిగి, వానిని నిషేధింప జేసేంతవరకు, పరిస్థితులను పరిణమింప జేశారు. ఇచ్చటగూడా విచిత్రం ఏమంటే; ఆ రకమైన విపరీత ధోరణిపై, ఆ వెంటనే ప్రతిక్రియ ప్రారంభమైంది. ఆ 'మడివాదం' నిరసింపబడి, పూర్వపక్షం చేయబడి, తిరిగి ఆలోచనాపద్ధతి సమస్థితిలో పడేవిధంగా పండితులైనవారే కృషిచేశారు.

ఈ చరిత్రను తిలకించినా, సంఘంలో ఒక వ్యాధి, దానికి నిదానమూ, చికిత్స, ఒకదానిలో ఒకటి అనుసంధితం అయి కొనసాగుతూ వుంటాయన్న పద్ధతి కన్పిస్తుంది.

ఒకప్పుడు ప్రారంభంఅయిన ఒక విపరీతస్థితి, తిరిగి అతఃపూర్వంకన్నా, ఉన్నతమైన స్వస్థస్థితిలోపడడానికి కొంతకాలం పట్టవచ్చు. కాని ఆ కాలంలో ఎప్పుడో ఒక విపరీతం పుట్టినప్పుడు దానికి స్వస్థస్థితి కల్గకతప్పదు. ఆ స్థితికల్గిన తర్వాత తిరిగి విపరీత స్థితి, తిరిగి స్వస్థత, తిరిగి విపరీత స్థితి, తిరిగి స్వాస్థ్యము—ఈ విధంగా చక్రనేమి క్రమంలో అది అట్లా సాగుతూవుంటుందా అనిపిస్తుంది.

## 9

ఇటువంటి స్థితి ధర్మానికి మనదేశ చరిత్రనుంచి గూడా కొన్ని ప్రసిద్ధమైన ఉదాహరణలు చూపించవచ్చు. ఈ చరిత్ర, అనగా చరిత్ర అని చెప్పదగిన చరిత్ర, గౌతమబుద్ధుని కాలంనుంచి ప్రారంభం అయినట్లు కొందరు చరిత్రకారులు చెప్పడంవుంది. అట్లాగే, ఆ కాలంనుంచే చరిత్ర ప్రారంభమైన దనుకుందాం. ఆయన, ఆ గౌతమబుద్ధుడు వర్ణాశ్రమ ధర్మాదికమైన వ్యవస్థమీద ఎదురుతిరిగాడని, తిరుగుబాటు లేవదీశాడని గూడా చరిత్రకారులు వ్రాశారు. అది నిజమే అనుకుందాము. పిటకాలు మొదలైన బౌద్ధధర్మ గ్రంథాలను చూచినా, ఇది ఇట్లాగేనని అనిపించవచ్చు. కాని అచ్చట తరచిచూస్తే ఇంకోఅంశం కూడా కన్పిస్తుంది. బుద్ధుడు పరమార్థంలో వర్ణాదిక ధర్మాలనుకాదన్నాడుగాని, వ్యావహారికపద్ధతిలో వానిని నిరసించినధోరణి అంతగా కన్పించదు. భగవత్ గీతలలో 'సర్వధర్మాన్ పరిత్యజ్య, మామేకం శరణం వ్రజ' అని శ్రీ కృష్ణుడు చెప్పినట్లే, బుద్ధుడుగూడా చెప్పినట్లు కన్పిస్తుంది. అట్లా కాని పక్షంలో త్రిరత్నాలని చెప్పబడే—బుద్ధం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి—అన్నవానికి, తక్కిన బుద్ధుని ప్రవచనప్రపంచానికి ఏకవాక్యత కుదరదు. ఇచ్చట ముఖ్యంగా చూడవలసిన వాక్యాలు రెండే. మామేకం శరణం వ్రజ—అన్నదిన్నీ; బుద్ధం శరణం గచ్ఛామి—అన్నదిన్నీ.

ఇక్కడ ఇంకో విశేషాన్నిగూడా గమనించవలసి వుంది. ఆశ్రమధర్మంలో నాల్గు అవస్థలు చెప్పబడినాయి. బ్రహ్మచర్యము, గార్హపత్యము, వానప్రస్థము, సన్యాసము—అని. బుద్ధునికాలంలో ఆయనచేత చెప్పబడినట్లు చెప్పబడుతున్న ధర్మంలో ఆ ఆశ్రమధర్మ వ్యవస్థలో మొదటిదానికి, చివరిదానికి ప్రాముఖ్యం వచ్చి, మధ్యవున్న గార్హపత్య వానప్రస్థాలులోపించి అది మధ్యమపదలోపి సమాసంవతుగా పరిణామం చెందినట్లు గోచరిస్తుంది. ఇచ్చట ఈ మార్పుతో సంఘంలో కొన్ని విపరీతాలు సంభవించాయి. ఆశ్రమ ధర్మంలో వయస్సు, దానియొక్క పరిపాకము మొదలైనవి లుప్తమై ఆ లుప్తము కావడమువన్నది కొన్ని విపరీత పరిణామాలకు దారితీసినట్లుతోస్తుంది. వైదికమతంలో వామాచార పద్ధతులు ప్రబలినట్లే, బౌద్ధంలోగూడా వామాచారాలు ప్రబలాయి. వైదికమతంలో వామాచారానికి తాత్త్విక పరివేషం కల్పించబడినట్లే బౌద్ధంలోను ఆ వామాచారాలకు ఒక పరివేషం కల్పన చేయబడింది.

'Two Vajrayana Works' అన్న గ్రంథా

నికి పీఠికవ్రాస్తూ బి. భట్టాచార్య ఇట్లా వ్రాశారు:

"A great Variety of influences which cropped up during the centuries from the time of Maha Pari Nirvana of Buddha, and the distruction of Buddhism from the Indian soil. .in about 13 th century of christian era, helped a great deal in bringing about this degeneration. The introduction of the theory of Mahasukha in the conception of Buddhist Nirvana was the first and the primary cause of the weakening in the strength of the-religion. The second is the imposition of the most strict and unnatural rules of discipline amongst the members of the Sangha who could follow them only upto a certain extent and not for ever afterwards in exactly the same lines as shown by Buddha. The third force which had also exerted a weakening influence is the theory of Karuna which required that each individual Bodhisatva should sacrifice every thing-himself, his happiness, his family and children-for the emancipation of the suffring humanity. This had a wide spread circulation among masses, and the result was that the vow to emancipate others was reduced to a mere convention and what is worst-the priests took shelter under its cover and found in it an excuse for committing acts of great sin and immorality"1

పూర్తిగా ఇట్టిది కాకపోయినా, ఇంకొక విధమైన అసహజ సన్యసన, పద్ధతినిగురించి Unnatural asceticism ను గురించి ఆర్నాల్డ్ టోయిన్‌బీ —యిరోపా విషయంలో ప్రస్తావించి వున్నారు : Christianity has gone further than Jadai-sm towards an essentially unnatural asceticism' అని ఆయన వ్రాశారు. సన్యసన పద్ధతి గూడా హద్దులు దాటి, అసహజమైన స్థితిలో పడ రాదని వీని తాత్పర్యంగా స్పష్టపడుతున్నది. బుద్ధుని అనంతరం వచ్చిన భారతీయ తాత్వికులలో గూడా ఈ రకమైన అభిప్రాయమే కల్గింది. గౌడ పాదులు మొదలు అనంతరీయులైన తాత్వికులు—ఈ విషయాన్ని గురించి అదే విధంగా ఆలోచించారు. శంకరుడు తన అద్వైతాన్ని స్థాపిస్తున్నప్పుడు, దానివలన ఆయన అప్పటి సమాజంలో నూల్కొలప దలచిన స్వస్థత ఇటువంటిదే అనిపిస్తుంది. తనకు ముందు ప్రచలితమైన తాత్వికభావసంపత్తిని అనుసంధానం చేసుకుంటూ, సమన్వయించుకుంటూ, శంకరుడు తిరిగి తాత్విక మీమాంసలో స్వస్థతను చేకూర్చడానికి ప్రయత్నించినట్లు తోస్తుంది. వ్యవహారజగత్తులో తిరిగి అస్వస్థతకు దారితీయని వ్యవస్థ ఏర్పడ్డానికి అనువైన తాత్వికభావప్రపంచాన్ని ఏర్పచడానికి ఆయన ప్రయత్నించాడు. ఇప్పుడు వేదాంతం అనబడుతున్న తాత్విక పద్ధతిని స్థాపించాడు. వ్యవహారజగత్తులో తిరిగి ఆశ్రమధర్మాలు స్వస్థం అయినాయి. పరమార్థంలో ఈ వ్యవహారజగత్తును మాయగా నిరూపించడానికి ఆయన ప్రయత్నించాడు. దృశ్యజగత్తును మాయగా చెప్పడం అన్నది మహాయానబౌద్ధంలో గూడా వుంది.

",We must never forget that in Hinduism, of which Mahayana is but a Buddhistic form, Maya-the Cosmic apparance is worshipped as a Goddess, the feminine aspect of the inexpressable one" అని సేకోద్దేశటీక అన్న వజ్రయాన బౌద్ధగ్రంథానికి వ్రాసిన పీఠికలో మారియో. ఇ. కారెల్లి అన్నాడు.2 అనగా ఒక కాలంలో అయోమయం అయిపోతూవచ్చిన భారతీయ తాత్వికభావ ప్రపంచంలో వ్యవస్థను చేకూర్చడానికి జరిగిన ప్రయత్నం మహాయానంతోనే ప్రారంభమై, అక్కడి

---

1. Two Vajrayana works-Introduction. P. P. 9. Oriental Institute-Baroda.

2. సేకోద్దేశటీక—P. 5. Oriental Institute-Baroda.

నుంచి కొనసాగుతూవచ్చి, ప్రస్థానత్రయ భాష్య రూపంలో రామానుజ, మధ్వాచార్యాది మేధావుల పర్యంతము కొనసాగుతూవచ్చిందని తాత్త్వికచరిత్రను బట్టి మనం అనుకోవలసివస్తున్నది. ఈ తాత్త్విక చింతనలో ఉత్తరోత్తర గృహస్థధర్మానికి అధికమైన ప్రాధాన్యం, పరమమైనస్థితి చేకూర్చబడుతూవచ్చింది. సాహిత్యంలో ఈ భావస్థితిని తెనాలిరామకృష్ణుడు తన పాండురంగమాహాత్మ్యంలో ఉదాత్తరమణీయంగా వర్ణించివున్నాడు :

కీలారములనుండి పాలింటికేతేర
బహుధాన్యములు చేలబండియొరగ
నెడ నెడ పెండిండ్లు వడుగులు వొడయ
కృతార్థులై యర్థించు నర్థులలర
బరిచారికా సమితి పనిపాటు[illegible]పాటింప
జుట్టంపు సందడి నెట్టుకొనగ
గ్రామమెంతయు నిజప్రాభవంబున మన
సత్యనిష్ఠకు దన్ను సాక్షిగోర
నిత్య నైమిత్తికములు నిర్నిద్రబుద్ధి
నాచరించుచు హరిభుక్త మాత్మ భార్య
భక్తి నిడ భుక్తి గొనుచున్కి ముక్తి గాక
నిదురవంటిది, రాతి వంటిదియు గాదు.

(సశేషం)



కలగూరగంప :

# శ్రీ విశ్వనాథకు భారతీయ జ్ఞానపీఠం అవార్డు



పద్మభూషణ, కళాప్రపూర్ణ, కవిసామ్రాట్ డా॥ విశ్వనాథ సత్యనారాయణగారికి భారతీయ జ్ఞానపీఠం వారి అవార్డు లభించింది. అది ఆయన రచించిన 'శ్రీమద్రామాయణ కల్పవృక్షము'నకు వచ్చింది.

జూలై నెల 17 వ తారీఖున జ్ఞానపీఠం సెలక్షన్‌బోర్డు అధ్యక్షులు డా॥ బెజవాడ గోపాలరెడ్డి అందుకు సంబంధించిన ప్రకటన చేశారు.

ఈ అవార్డు లభించినవారికి లక్ష రూపాయల బహుమతి, ప్రశంసాఫలకము సమర్పిస్తారు.

భారతరాజ్యాంగం గుర్తించివున్న భాషలలో ఏభాషలోనైనాసరే అత్యంతప్రతిభాసంపన్నంగా రచన చేసినవారికి ఈ అవార్డు లభిస్తుంది.

ఇంతకుముందు ఈ అవార్డు ఐదుసార్లు ఇచ్చి వున్నారు. శ్రీయుతులు జి. శంకర కురుప్; తారాశంకర వంద్యోపాధ్యాయ; డా॥ కే. వి. పుటప్ప; డా॥ ఉమాశంకరజోషి; డా॥ సుమిత్రానందన్‌పంత్; ఫిరాఖ్ గోరఖ్ పూరిగార్లకు ఆ బహుమతులు లభించాయి.

వీరిలో శ్రీ జోషి, శ్రీ సుమిత్రానందన్ పంత్‌లకు సమిష్టిగా ఆ అవార్డు ఇచ్చారు.

ఇప్పుడు శ్రీ సత్యనారాయణగారికి ఇచ్చారు.

ఈ బహుమతి 1955 నుంచి 1963 వరకు మధ్యకాలంలో ప్రచురింపబడిన ఉత్తమగ్రంథాలను పరిశీలించి, ఆ అనంతరం ఈ నిర్ణయం చేశారు. ఈ నిర్ణాయక సంఘంలో ఉత్తరప్రదేశ్ గవర్నర్ డా॥ బి. గోపాలరెడ్డి (అధ్యక్షులు), డా॥ ఆర్. ఆర్. దివాకర్, డా॥ నీహార్‌రంజన్‌రాయ్, డా॥ కరణ్ సింగ్, డా॥ కే. జి. సయూదీన్, డా॥ ఏ. ఎన్. ఝా, డా॥ హజారీప్రసాద్‌ద్వివేది, డా॥ ఉమాశంకర్‌జోషి, శ్రీమతి రమాజైన్, శ్రీ ఎల్. సి. జైన్‌లు వున్నారు.

సత్యనారాయణగారికి ఈ అవార్డును ప్రకటిస్తూ జ్ఞానపీఠంవారు చేసిన ప్రకటనలో ఇట్లా వున్నది :

'సృజనాత్మక సాహిత్య రచన అతినిసర్గంగా ఆయనకు అబ్బింది. అత్యంతము గాఢశీలంతో ఆయన ఆ రచనా వ్యాసంగాన్ని కొనసాగించారు. వయస్సులో వున్నప్పుడు ఉత్సాహశక్తితోను, పరాయణ చిత్తంతోను రచనా వ్యాసంగంలో నిమగ్నులైనారు. ఇప్పుడు ఆయనకు 76 సంవత్సరాలు. ఇప్పుడుగూడా కనీసం ప్రతి రెండు నెలలకు ఒక నవలనో లేక ఒక కావ్యాన్నో ఆయన ప్రచురిస్తూనే వున్నారు.'

ఆయన రచించిన రామాయణ కల్పవృక్షం ఆరుకాండలుగా రచింపబడింది. కాండకు దాదాపు రెండువేల పద్యాల చొప్పున ఆరు కాండలలోను మొత్తం పన్నెండువేలదాకా పద్యాలు వున్నాయి. కల్పవృక్షాన్ని తాము 'సకలోహ వైభవ సనాథము'గా వ్రాశామని ఆయన చెప్పుకున్నారు.

కల్పవృక్ష ఉపోద్ఘాతంలో ఈ పద్యంవుంది.

'వ్రాసిన రామచంద్రు కథ
వ్రాసితివంచపెంచుకో, వృథా
యాసముగాక, కట్టుకథ
లైహికమా, పరమా యటన్న తా
చేసిన తండ్రి యాజ్ఞ యును
జీవుని వేదన రెండు నేకమై
నా సకలోహవైభవ స
నాథము నాథకథన్ రచించెదన్.'

సత్యనారాయణగారు బహు గ్రంథకర్తలు. కావ్యాలు, నాటకాలు, నవలలు, కథలు, విమర్శ వ్యాసాలు, గ్రంథాలు అనేకం రచించారు. వారు రచించిన నవలలు దాదాపు అరవైకి పైబడివున్నాయి. అనేక కావ్యాలు రచించారు. చిన్న కథలను రెండు మూడు సంపుటాలుగా ప్రకటించారు. 'కావ్యాలలో 'విశ్వనాథ మధ్యాక్కరలు'కు సాహిత్య అకాడమీ బహుమతి లభించివుంది. తెలుగు సాహిత్యంలో అనితర సాధ్యమైన కృషిచేసి తెలుగు సరస్వతిని పరిపుష్టం చేశారు.

శ్రీమద్రామాయణ కల్పవృక్షానికి జ్ఞాన పీఠం అవార్డు లభించినదన్న వార్తను విన్న రోజున ఆయన అన్నమాటలు ఇవి.

'జరిగిన ఐదారు సంవత్సరాలుగా అవార్డు వస్తుంది అంటూనే వున్నారు. అది నేటికి లభించింది. లక్షరూపాయల అవార్డు ఒకకవికి రావడం లాభదాయకమే. ఇది చిన్నమొత్తమేమీకాదు. రెండు నెలల క్రితమే మృత్యుముఖంనుండి బయటపడిన నేను ఈ వయస్సులో అవార్డు అందుకోనడం లాభదాయకంగా భావిస్తున్నాను.

'గత కొద్ది సంవత్సరాలుగా వస్తుందనుకొన్న అవార్డు ఇప్పుడు వచ్చినందున పెద్దఆశ్చర్యమేమీ కల్గడంలేదు. అవార్డు రావడానికి తోడ్పడినవారందరికీ కృతజ్ఞత వ్యక్తం చేస్తున్నాను.

'ఒక తెలుగుకవికి, తెలుగు రచనకు జాతీయ స్థాయి అవార్డు రావడంవలన ఇతరభాషలతోపాటు తెలుగుభాష కూడా ఉన్నతస్థానాన్ని పొందింది. నా రచనలన్నీ విజ్ఞానదాయకాలు. సామాన్యప్రజలకు అర్థమయ్యేలాగున వ్రాశాను.

'ఎనభై వంతులు స్వీయరచన, ఇరవై వంతులు వాల్మీకి రచన ఆధారంగా రామాయణ కల్పవృక్షం వ్రాశాను.' —కపర్ది.

# ఆంధ్రభారతము— "తగు" శబ్దవిచారము

పంచమ వేదమనంబఱగిన 'జయ' సమాఖ్యంబను భారతమున పదునేను పర్వముల నాంధ్రీకరించిన మహాకవి— ఉభయకవిమిత్రుఁడు, ఆంధ్రభాషకు దిక్కనఁదగిన 'తిక్కన' తనకు సుమారు రెండు మూఁడువందలేండ్లకుఁ బూర్వము, వాగనుశాసన బిరుదాంకితుఁడగు 'నన్నయభట్టు' సంస్కృత ప్రథమముగా మూఁడు పర్వములొక కొంచెె మించుమించునా నాంధ్రీకరించగా తరువాత మిగిలిన పర్వములను— అనువదించుటలో సంస్కృత ఛాయయిష్టముగాక, తెనుఁగు బాసఁ బునరుద్ధరించు ప్రయత్నమునఁనేమో, తెలుఁగు జిలుఁగు వెలుఁగులు వెలికిఁ దొలకరింప దెలుఁగు నుడికారము పెంపు సొంపలరింపఁ దెనిగించెను. అందు సమయస్ఫూర్తిగా సందర్భానుసారముగా వివిధఘట్టములందు నక్షరరామణీయకత వెల్లివిరియ — నావిర్భస్ఫురిత నాటకీయ ప్రజ్ఞాప్రాభవములతో సంతరియలంత తునియలుగల పదజాలముతో నామూలమూడము విరచించెను. ముఖ్యముగాఁ దనకెక్కుడు ప్రియమగు జాను తెనుఁగు పదము లుపయోగించెను. దేశీయములును మిగుల ప్రయోగించెను. అందులో 'తగు'శబ్ద మెన్నిపర్యాయ లెటనెట నెట్లు ధ్వని ప్రాధాన్యముగా రసోచితముగా వాడెనో తెలిసికొనుటకే యీ వ్యాస ముద్దేశింపఁబడినది.

తొలుదొలుత విరచితమగు విరాటపర్వమున ప్రథమాశ్వాసమున విరాటమహారాజు కొలువున గుప్తవేషములతో మెలగు విషయమున పాండవులందఱకు నొక్కొక్కరి కొక్కొక్కచోట మాత్రమే, 'తగ' శబ్దము ప్రయోగించియున్నారు. ద్రౌపదికిఁగూడా మఱియొక 'తగ' శబ్దము వాడఁబడెను. ఈ పర్వమున నార్గురకు 'తగ'పద ముపయోగించుట విచిత్రముగా నున్నది. ఇయ్యది దేశీయము. అకర్మకక్రియ. నైఘంటికమున 1. సమ్మతించు 2. సరిపడు 3. యుక్తమగు నర్థములుమాత్ర మీయఁబడినవి. కాని తిక్కయజ్వ మహాకవి. పలుచోట్ల వివిధార్థభావయుక్తముగఁ బ్రయోగించియున్నాఁడు. విరాటపర్వ ప్రథమాశ్వాసమున 146 వ పద్యము మొదలుకొని 291 (ఆశ్వాసాంతము) పద్యమువఱకు—అనఁగా 145 పద్యములలో 6 పర్యాయములు సరాసరి వాడియున్నాడు.

తెనుఁగు నుడికడలి యనఁదగిన 'తిక్కన' ఈ పద ప్రయోగమింత యెక్కువగా మక్కువగా నెందులకై వాడియుండునో ? ఊహింపఁదగియుండును. ఇట్లె భారతమునం దెల్లెడల మిగుల సాజముగా వాడిన ప్రయోగము లగపడుచున్నవి. ఈ విషయ మాంధ్ర పాఠకు లెఱుంగుదురు. కావున—ఇందలి గుణ విశేషములు, ప్రయోగ ప్రామాణ్యములు, ఔచితీయుతములు—విరివిగా విమర్శింతురని సూచనప్రాయముగా వ్రాయడమైనది. రసజ్ఞులు మన్నింతురుగాత ! పద ప్రయోగము లిట్లున్నవి. గమనింతురని మనవి.

తగ జపించుచుండె
తగ నిట్లనియెన్
పార్థి తగన్ గొనియాడుము
నీకుఁ దగు పదవి నిచ్చెద
చన్నుఁ గవఁ గప్పి తగన్
తగఁ బెనగుదు
ఉండుదురు దగన్
తగ ఘటించిరో? కాక
తగఁ జేయఁగాక
ఈవ తగంగన్.
తగునె? విధాత
ద్రుపదనందనకుఁ దగన్
చేసెదన్ దగన్
తగ విన్నవించిరిట్లని
తగు భంగి మనకు
తగ విచారించి
ఏన తగుదు
తగు ధైర్య మియ్యెడన్
తగంగ నుక్కొక్కిన యట్లు !
తగ సమర్పించెద
వాంఛలకుం దగంగ
తగు సారథి దొర కొనినన్
తగనాడి నన్నుం బిలిపించి
తగు సారథి
పలుకుటయుఁ దగన్
ఖాండవ మేర్చునప్పుడుఁ దగన్
విధముం దగఁ జెప్పుము
అరదంబుఁ దగన్
దీనికిఁ దగఁగన్
తగు వారలు
తగు మాటల
తగ నీ యెఱిగిన
తగ ధనంబులుఁ గొని
కీడు రాకుండఁ దగఁ బరికింప
తగం దెగి
తగుఁ జెనయంగ
తగ దీనికి గారణమిది
తగు నాజ్ఞ సూయాణముగ
తీవ్రతకుం దగంగ
ఇట్లనఁగాఁ దగునయ్య
తగ నజ్జనపాలకుతో
తగఁ బ్రార్థన సేయుట
తగ నూతనమగు కానుక
తగుదురు వీరల్
తగ దుచిత వృత్తిన్
ఏది తగు నది చేయుము
అని తగఁ జెప్పె.

—కవితా కళానిధి.

# కళాప్రపూర్ణ

# శ్రీ గుర్రం జాషువా కాలధర్మం

పద్మభూషణ, కళాప్రపూర్ణ, నవయుగకవిచక్రవర్తి శ్రీ గుర్రం జాషువా జులై 24 న కాలధర్మం చెందారు. అప్పటికి ఆయన వయస్సు డబ్బది అయిదేళ్లు. ఆ డబ్బదిఅయిదు సంవత్సరాలలోను అధికమైనకాలం కవితారచనలో గడిచిపోయింది. పిరదౌసి, గబ్బిలము, కాందిశీకుడు, క్రీస్తు జీవితం మొదలైన కావ్యాలేగాక, వేరువేరు కవితాఖండికలతో ఖండ కావ్యసంపుటాలుగూడా ఆ కాలంలో వెలువడ్డాయి. ముక్కుతిమ్మనగారి తరువాత తెలుగు కవిత్వంలో ముద్దుపలుకులు ఎక్కువగా జాషువాగారి కవిత్వంలోనే పరవళ్లు త్రొక్కాయి.

జాషువాగారు వచనరచన అంతగా చేయలేదు గాని, ప్రహ్లాదనాటకం ఒకటి వ్రాశారు. జాషువాగారి కవిత్వంలో ఎంతగాంభీర్యం వున్నదో అంతలోతు, ఎంత లోతు వున్నదో అంత మెత్తనితనం వున్నాయి.

'ఏ తొలికోడి కంఠమున
నీయినబింబము నిద్రపోయెనో'

వంటి అందమైన బావబలంగల పద్యాలు ఆయన కొల్లలుగా రచించారు. పిరదౌసి మొదలైన కావ్యాలలో ఆయన కథాకథన నైపుణ్యము, శిల్పాన్ని తీర్చే పద్ధతి ప్రస్ఫుటమై కన్పిస్తాయి.

'ఒక్కొక పద్దియమ్మునకు
ఒక్కొక నెత్తురుబొట్టు
మేనిలో తక్కువగా రచించితి'

వంటి ప్రౌఢమైన రచనతో ఆ రచనలు సాగాయి.

ఆయన ఖండకావ్యాలు, పిరదౌసి, గబ్బిలం జనాదరణాన్ని బాగా పొందాయి.

1966 లో క్రీస్తుజీవితం అన్న గ్రంథానికి రాష్ట్రపతి బహుమతి లభించింది. ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు 1969 లో ఆయనను కళాప్రపూర్ణ బిరుదంతో సత్కరించారు. 1970 లో ఆయనకు పద్మభూషణ బిరుదం లభించింది. నవయుగకవిచక్రవర్తి అన్న బిరుదమును ఆయన ప్రజలవలన పొందారు.

జాషువాగారి మరణంతో తెలుగు సాహిత్యాకాశంలో ఒక ఉజ్వలనక్షత్రం అస్తంగతమై పోయింది.

—సా. గో



# గ్రంథ విమర్శలు

## మేఘదూత

(కాళిదాస మహాకవి రచనకు శ్రీ ముకురాల రామారెడ్డి గేయానువాదము; ప్రచురణ: చంద్రభూషణ్ ప్రచురణలు, సుభాష్‌నగర్, కలువకుర్తి. 57 పేజీలు; వెల రూ. 2.)

**గాలీ నీరూ** నిప్పూ నేలా నింగీ మేఘమూ, మేఘసందేశమూ అన్నికాలాలవీ అందరివి. కవికుల గురువు కాళిదాసు ఏ ఆషాఢ ప్రథమ దివసాన మేఘదూత కావ్యాన్ని ఆలపించాడో ఆనాటినుండీ రసజ్ఞులకు మరపురాని మధురానుభూతి శతాబ్దాల తరబడి కలుగుతున్నది. భారతీయభాష లన్నింటిలోకి పరివర్తన చెందటమేగాక ఒక్కొక్క భాషలోను కుప్పలెప్పలుగా మేఘసందేశానికి అనువాదాలూ, అటువంటివేలయిన సందేశకావ్యాలూ, వాటి ఛాయలూ కన్పిస్తున్నాయి. మనభాషలోకూడ శతాధికంగానే మేఘసందేశ కావ్యానికి అనువాదాలూ ప్రతిరూపాలూ వచ్చాయి. శ్రీ ముకురాల రామారెడ్డి రచించిన 'మేఘదూత' కాళిదాస మహాకవి 'మేఘసందేశః' కావ్యానికి సరికొత్త అనువాదం. శతాధికంగా వెలువడిన మేఘసందేశ అనువాదాల రాశిలో యిదికూడ ఒకటిగా చేరిపోతుందావంటే యిది కొంత విశిష్టమైన అనువాదమని చెప్పాలి. ఇది గేయరూపంలో సాగిన అనువాదం. వీరి గేయరచనకు చక్కని నడక, లలితమైన పదజాలం గొంతెత్తి చదివితే లయవిన్యాసం చెవికి ఇంపుగొలిపేదిగా ఉండటమూ యీ అనువాద విశిష్టతకు తోడ్పడ్డాయి. సంస్కృతమూలంతోపోల్చి చదివితే ఏ అనువాదమూ కూడ మేఘసందేశకావ్యపు దరిదాపులకైనా రావనేది రసజ్ఞులందరికీ తెలిసిన విషయమే. రామారెడ్డిగారు తమ అశక్తతను తెలుసుకొని

> 'వెన్నెలల వడబోసి విందు చేయుట యెట్లు?
> పరిమళాల పసందు పట్టిచూపుట యెట్లు?
> మౌళిక్రప్రభతో బిగేలుమను జీవ
> రత్నమ్మున్నదున్నట్లు బొమ్మదీయుట యెట్లు?
> దివ్యనాగరిక 'సంభావ్యకవితలు నీవి
> అణుమాత్రభోగినై అనుభవించుట యెట్లు?
> విశ్వమోహనమైన విరహరాగము నీది
> 'ఆంధ్రి'తోనే సొంత మాలపించుట యెట్లు?

అని 'మనస్కృతి'లో వెల్లడించారు. అణుమాత్రభోగియై అనుభవించిన కవి తన పలుకులలో విశ్వమోహన విరహరాగాన్ని ఆలపించాలని చాపల్యంతో ప్రయత్నించారు. కాళిదాస మహాకవి హృదయాన్ని గాయపరచకుండా అనువదించటం అసలు సాధ్యపడుతుందా? మందాక్రాంత వృత్తాన్ని తెలుగులోనికి తీసుకురావాలంటే సరియైన వృత్తమేది? వచనానువాదం తప్ప గత్యంతరంలేదా? సంస్కృత శబ్దాలలోఉన్న ప్రౌఢిమ మాధుర్యాలను విడిచి పుచ్చవలసిందేనా?—ఇటువంటి ప్రశ్నలెన్నో మేఘసందేశ **కావ్యాన్ని** అనువదించాలను కొనేవారిని ఎదుర్కొంటూ ఉంటాయి. 'పూల ఘుమఘుమ పిల్లగాలి మోసినయట్లు' కాళిదాస మహాకవి భావాలను తెలుగులోనికి తేవాలని మేఘసందేశాన్ని హృదయమంతా నింపుకొని

> 'నిలువుటద్దమువంటి నీ ప్రతిభలోనుండి
> నా భావరూపమై నా రచన బింబించు'

అని చెప్పుకుని ఆత్మవిశ్వాసంతో యీ రచనను ప్రారంభించారు.

సంస్కృత మూలంలోని ప్రతిశబ్దాన్ని, దాని అర్థమూ, పరిమళమూ చెడకుండ తెలుగులోనికి తీసుకొని రావటం ఏ అనువాదకునికీ సాధ్యంకాని పని. భావం చెడకుండ, మూలంలోని ఔన్నత్యాన్నంతటినీ తేలేకపోయినా సాధ్యమైనంతవరకు లాలిత్యం చెడకుండ లయవిన్యాసంతో ఆంధ్రీకరించారు శ్రీ రామారెడ్డి.

> 'దీర్ఘీ కుర్వన్ పటుమదకలం
> కూజితం సారసానాం
> ప్రత్యూషేషు స్ఫుటిత కమలామోద
> మైత్రీ కషాయః
> యత్ర స్త్రీణాం హరతి
> సురతి గ్లాని మఙ్గానుకూలః

శిప్రావాతః ప్రియతమ ఇవ
ప్రార్థనా చాటుకారః'

అనే శ్లోకాన్ని

'శిప్రాదరిని ఘళ్లు ఘళ్లుమని త్రుళ్లిపడు
అలల తుంపురులలో జలకేలిలో దేలి
ఊరు చెమటల జాలు నుప్పు నుప్పన నార్చు
సురత భోగులమీద సురటీలనే వోలి
పాలయల్కమానుకొను కలహంస దంపతుల
గానాల వెనువెంట తానాలు వచరించి
తొలివెల్గులందు రూపులు దిద్దుకొనెడి ప
ద్మాను లిండ్ల విడిసి, కమ్మని తావులను మేసి
వలపు తలపులరేపు వగల గాలులజాడు
సురభిళార్ద్ర విశాల పరిసరమ్ముల జాడు.

హాయిహాయిగ సాగవోయి ఆపయిని
చుట్టుబా టనుకోకు చూడు ఉజ్జయిని—

అని పలికిన గీతాన్ని పరిశీలిస్తే రామారెడ్డిగారు అణుమాత్రభోగిగానేగాక కాళిదాస హృదయాన్ని చక్కగా అర్థం చేసుకున్నవారని తెలుస్తుంది.

'వక్రః పన్థా యదపి' అనటంలోని సొగసు 'చుట్టుబా టనుకోకు' అని పలకటంలో లేదు.

'జ్యోతిర్లేఖావలయిగళితం యస్య బర్హం భవానీ
పుత్రప్రేమ్ణా కువలయ దళ ప్రాపి కర్ణేకరోతి
ధౌతాపాఙ్గం హరశశిరుచా పావకే స్తం మయూరం
పశ్చాదద్రి గ్రహణ గురుభిర్గర్జితైర్నర్తయేథాః'

అనే సుప్రసిద్ధశ్లోకాన్ని కమ్మని తెనుగు నుడికారంతో

'సేవించి పోవోయి, దేవతల దళవాయి
సతి, చండికామాత, సాకతపు గారాబు
కొండ—కొమరయగారు కొలువున్న చాకొండ
నెమ్మితేరువజీరు నెలవురా ఆ కొండ
గర్జాధ్వనుల శైల గహ్వరమ్ములు మ్రోయు
కొమరుసాములవారి నెమలి చిందులు వేయు
తెరగంటి నెమలి కందెరలంటి నెలమాను
తక్కులొత్కెడి లోయ తరిపివెన్నెలగాయ
చెంగలించెడి నెమలి రంగురంగుల పురులు
రాలిపడి, గిరిజాత పూలకొప్పునుదాయ
తరియించరా ! దేవగిరిని దర్శించి
పుణ్య మొడిగట్టరా ! పూలు వర్షించి'

అని యీ విధంగా ఆంధ్రీకరించి 'సుగంధాన్ని మోసే పిల్లగాలిని' అన్నమాట నిజమని నిరూపించుకొన్నారు.

'కామార్తాహి ప్రకృతి కృపణాశ్చేతనాచేతనేషు'
అనే శ్లోకపాదానికి

'ప్రేమేమి పిచ్చియో ! కామార్తుడగువాడు
చెట్లతో నైతమ్ము చెలి మాట మాటాడు'

అనటం కాళిదాస కవితకు న్యాయం చేకూర్చటంలేదు.

తన ప్రియురాలిని చూడదగినవేళ ఏదో వివరిస్తూ యక్షుడు

సవ్యాపారా మహని నతథా పీడయేద్విప్రయోగః
శఙ్కే రాత్రౌ గురుతరశుచం నిర్వినోదాం సఖీం తే'

అని చెప్పినచోట రామారెడ్డిగారు చక్కగా

నెట్టునెట్లో పగళ్లు—పిట్టమెదలనిరేలు
తెలజాడు తన కెట్లు తెల్లవారినదో'

నని ఆంధ్రీకరించారు. రస విషయంలో అనౌచిత్యాలు దొర్లకుండ జాగరూకత వహించారు. యక్షుడు తన ప్రణయ రహస్యాలు మేఘునితోచెప్పి ఆనవాలుగా తన ప్రియురాలికి తెల్పుమని చెప్పనప్పుడు కాళిదాసు మహాకవి ఎంతవరకు శృంగారాన్ని పోషించి, అవధులు దాటకుండ సంయమనాన్ని ప్రదర్శించాడో అట్లాగే రామారెడ్డిగారుకూడ ఆ అవధుల నెఱిగి ఆంధ్రీకరించారు.

మేఘసందేశ కథను యువతరం పాఠకులకోసం ప్రత్యేకంగా ముందుగా వివరించారు. తన అనువాదం చదివి, విని—మిత్రులూ, కవులు వెల్లడించిన అభిప్రాయాలనుకూడ పొందుపరచారు. ఆ అభిప్రాయాల లోని ప్రశంసావాక్యాలు అంతగా అతిశయోక్తులని అనిపించవు. శ్రీశ్రీ వీరి అనువాదాన్ని విని ఇది Transcreation అని మెచ్చారట. మేఘసందేశ కావ్య ప్రాశస్త్యాన్ని వర్ణిస్తూ

> 'మనుషు లుండేడిదాక, మమత లుండేడిదాక
> గగనభాగాల మేఘాలు మెదలెడిదాక
> విరహవీణలమీటి వినగవచ్చు నిది
> కాళిదాసుని విధుర కవిత కావ్య మిది'

అన్నారు. ఈ మాటలు ప్రత్యక్షర సత్యాలు. ఇంతటి ఉత్తమకావ్యాన్ని అనువదిస్తూ 'పద్యానికొక్క నెత్తురు చుక్కైనా తగ్గుతుంది' అని తమ శ్రమనుగూర్చి వాపోయారు. వీరి శ్రమ చాలవరకు ఫలించింది.

శ్రీ ఎం. బలరామాచార్య తీర్చిన ముఖపత్రం ఎంతో అందంగా కన్నుల కింపుగా, కావ్యానికి తగ్గట్టుగా ఉన్నది.

—రామ మోహనరాయ్.

## జ ల ద గీ తి

(మేఘసందేశమునకు ఆంధ్రీకృతి)

(రచన: శ్రీ వక్కలంక లక్ష్మీపతిరావు, ఎమ్. ఎ.; ప్రతులకు: శ్రీమతి వి. సీతాదేవి, కూచిమంచి వారి అగ్రహారం, అమలాపురం; క్రౌను 1/8 పే. 66 లు. వెల రు. 3/—లు.)

మేఘదూతమునకు ఇది మరియొక అనువాదము; కాళిదాసకృతికి ఇంకొక పూజా పుష్పము. ఇది ద్విరదగతిరగడలో ప్రాసాది నియమములలో కొంత స్వేచ్ఛ నవలంబించి నడచినది. అనువాద విషయములోగూడ కొంత స్వేచ్ఛ నవలంబించిరి. ఆ స్వేచ్ఛ ఆదిలోనే ప్రారంభమైనది.

> 'అధికారమత్తుడై హద్దు మీరినవాఁడు
> అడుగో! యక్షుండొకఁడు పుడమిపై నున్నాఁడు!
> తాండవించిన దతని తలపై శనిగ్రహము!...'

రచయిత 'అంజలి'లో,

> 'ఆ కాళిదాసు మన యాంధ్రుడై యున్నచో
> ఈ మేఘసందేశ మెట్లుండు ననుకొంటి!—'

అనుకొన్నిన తడవుగా 'జలదగీతి'గా నవతరించిన దనిరి. 'తెలుగు తీయందనము తొలికెనో తలకెనో' అనియు సందేహించిరి. బహుశః పైని 3 వ పాదమువంటి చేర్పులే తెలుగు తీయందనముగా రచయిత భావించి యుండవచ్చును. కాళిదాసు ఆంధ్రుడై యుండినచో ఈ జలదగీతివలె వెలసి యుండెడిదని భావించుట మాత్రము సాహసము.

'సమీక్ష'లో శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు 'ఎంత చెప్పినను కాళిదాస రచనాలగ్నబుద్ధుల నొప్పించ లేము. అది వారిదోషముకాదు' అన్నమాటలు వాస్తవములు.

కాళిదాసు రచనలోని బిగువుతోగూడిన మాధుర్య మిందులో మృగ్యమైనను, కాళిదాస రచనలోని వ్యస్తపదములను సమాసములను పెక్కింటిని రచనలోకూర్చి కాళిదాస సౌరభము మధ్య మధ్య వాసించునట్లు చేసినందులకైనను రచయిత నగ్గించుచున్నాము. అచ్చు అందముగా ఉన్నది.

—నోరి నరసింహశాస్త్రి.

## మం దా ర దా మ ము

(రచన: శ్రీ ఇలపావులూరి శేషగిరిరావు 'గిరీంద్ర'. ప్రతులకు: జయశ్రీ నికేతనము, ఇలపావులూరు, (వయ్యా) తాళ్లూరు, ఒంగోలుజిల్లా మూల్యము: రెండు రూపాయలు.)

మందారదామము కావ్య కదంబము. కావ్యావళి, రాగవీణ, శ్రీపద్మనాభశతకము అను మూడు లఘుకృతుల సంపుటి యిది. మొదటిది పదునేడు విడివిడి ఖండికలు గలది. కొన్ని మాత్రాచ్ఛందముల గేయములు—వచన పద్యములు. మరికొన్ని మార్గకవితా ఛందమున పద్యములు. ప్రకృతి వర్ణనములు, దేశభక్తి, వీరము—ఈ మొదలైన విషయములను కవితా వస్తువులుగాచేసి చేసినది తొలికృతి. మార్గకవితా ఛంద

మున వ్రాసిన పద్యముల రచనా విధానమును చూచి నచో కరుణశ్రీగారి ప్రభావము కొంత పడిన జాడలు తోచును. ఇదేమి దోషముకాదు. కరుణశ్రీ అంతటి మహాప్రసిద్ధుడైన వర్తమానకవి ప్రభావము పడక తప్పదు. శ్రీ శేషగిరిరావుగారు మంచి ఊహశాలి యైనకవి. ఆపాతమధురమైన గంగా ప్రవాహము వంటి ధార మిక్కిలి ఆకర్షకముగా నున్నది.

రెండవది రాగవీణ. చక్కని భావబలిము కలది. ప్రణయానురాగమును పది మంచి రాగముల పేర్లుపెట్టి శ్రీ శేషగిరిరావుగారు పరమ సుకుమార ముగా వర్ణించిరి. ప్రణయమునకు వియోగమును మించిన నికషణములేదు. కవులెట్లో దానిని కల్పించు కొందురు. ఈకవియు అట్లే కల్పించుకొనెను. మేఘ సందేశమువలె ఇదియేమి మరుత్సందేశమా అన్నట్లుం డును. ఈప్రణయ కావ్య రచనమున క్రొత్తందనమును కవి చాకచాక్యముగా ప్రవేశపెట్ట గలిగినాడు.

మూడవది అనంతపద్మనాభప్రభూ అన్న మకుటముగల నూటయేడు మత్తేభ శార్దూల వృత్త ముల శతకము. ఇంకొక్క పద్యమున్నచో బాగుండెడిది. తెలుగులో శతకము వ్రాయట చేయని కవి సాధారణ ముగా నుండడు. తెనుగు శతకము లనగానే దూర్జటి, అన్నమయ్య, రామదాసు గోపన్న, విశ్వనాథ ఈ మొదలైన వారొక అయిదార్గురు ముందుకు వచ్చెడు వారున్నారు. ఈ యందరి మంచి లక్షణములును శ్రీ శేషగిరిరావుగారి యందున్నవి. లోకమును సుని శితముగా చూడగల భావింపగల నిజాయితీ ఉన్న కొలదియు శతకము రక్తిగట్టును. ఈ పద్మనాభ శత కము కవియొక్క ఆర్తి హృదయమును సలక్షణముగా వ్యక్తీకరించుటతో పాఠకులను స్పదింపజేయగల శక్తి కలిగియున్నది. ఈయన ఒక కథావస్తువుతోడి కావ్యరచనకు యోచనచేసిన ఒక ఉత్తమ కావ్యము సృష్టింపబడు అవకాశము పుష్కలముగా నున్నదని పించు చున్నది.

## తొలకరి పిలుపు

(రచన : సుపాణి. ప్రచురణ : తిలక్ ప్రచు రణాలయ. మెంటేపూడి, (వయా) శృంగవృక్షం, పశ్చిమగోదావరిజిల్లా. మూల్యము: ఒక రూపాయి.)

ఈ ఖండకావ్యరచయిత అసలుపేరు రావెల పురుషోత్తమరావు. ఆయన కలంపేరు సుపాణి. ఈ ఖండికలన్నియు ఆయన కవితావ్యాసంగపు తొలి రోజు లలో పరిమళించినవి కావలయును! ఈ కాలమున ఆధునికులు యువకులు వచనపద్యాలే ఎక్కువ వ్రాయు చున్నారు. ఇందులో కవిత్వమంతా అలాంటి పద్యాలు గానే ఉన్నది. ఇప్పుడే ఈ కవినిగూర్చి అంతగా చెప్పట మంచిదికాదు. ఈయనకు వర్తమానజీవితమే ప్రధాన మైన కవితావస్తువు. నీతిని ధర్మమును కాలానుగుణ ముగా ప్రబోధించుట కవి బాధ్యతగా ఈయనయందు కనిపించుచున్నది. మరియు నిజాయితీతోకూడిన జాతీ యత, భారతీయ మతతాత్త్వికత రెండును ఈ కవి భావయిత్రి ప్రవాహమునకు అద్దరి ఇద్దరిగా సొగసు ఒంపులు తిప్పినవి. కవికుమారుడు ఆధునికమైన ఆవేశము పొంగు లేనివాడుకాడు. మరియు అట్లని అరాచకవాదికాడు. నిరాశావాదికాడు. భవిష్యత్తుమీద మంచిఆశలు పెంచుకొన్న మానవతావాది—కవి శ్రీ పురుషోత్తమరావుగారు. శ్రీ నారాయణరెడ్డిగారు చెప్పినట్లుగా 'చెప్పేరీతికంటె చెప్పదలచుకొన్న నీతికి ప్రాధాన్యమున్న వచనకవితా సంకలనమిది.' ఆధునిక వర్తమాన వచన కవితాభిమానముకల వారందరును శ్రద్ధగా చదువుటకు యోగ్యమైనకృతి యిది. పర మేశ్వరు డనుగ్రహించి ఈయన మంచినిపించే మనిషి రూపు కట్టగల జవసత్వములుగల కవిత్వమును మునుముందింకను వెలయించునుగాక.

## యువకవిత

(సంపాదకుడు : శ్రీయస్. వెంకటరంగారెడ్డి. ప్రతులకు: సంపాదకుడు, పోస్టుగ్రాడ్యుయేట్ సెంటర్, వరంగల్లు. మూల్యము: అమూల్యము.)

వరంగల్లు పోస్టుగ్రాడ్యుయేట్ సెంటర్ విద్యార్థికవులు ఏడుగురు తమ రచనలను కొన్నింటిని ఒక సంపుటముగాచేసి ప్రచురించిరి. ఇది పోస్టు గ్రాడ్యుయేట్ సెంటర్ ప్రిన్సిపాలుగారికి ఆచార్య వెంకట్రామయ్యగారికి అంకితము.

ఇదంతా ఇప్పటి కాలమున వచ్చే వచనకవితా రచనావిధానము లోనిదే. యువతరానికి ఎప్పుడును ఉన్నతమైన ఆదర్శములు సామాజిక రాజకీయ

విషయము లందన్నింటను ఉండును. ఈ సంపుటము లోని— యస్. వెంకటరంగారెడ్డి, మాదిరాజు బ్రహ్మానందరావు, యం. వెంకటనారాయణ, పాకాపురి రాజు, బాస రవీంద్రనాథ్,వసంత పాల్వాయి, యం. వి. ఆర్. కృష్ణ— అందరును భూతభవిష్యద్వర్తమానముల గుండ ఈదేశము ప్రగతిలక్షణమును దర్శించుటకు యత్నించినారు. అందరును మంచి ఆశావాదులు. దళిత వర్గములయం దభిమానము కలవారు. సమాజముయొక్క మంచినైపుకు మళ్లుటను మనసా వాచా అభిలషించినవారు. నిత్య జీవితాలనుకూడ ఈకవి కుమారులు నిశితముగా పరిశీలించి వాస్తవము గ్రహించి వ్రాయుచున్నారు. దేశాభిమానముగలిగి సమాజముయొక్క అభ్యుదయమును ప్రబోధించు ఇలాంటి యువతరము కవుల సుసంఘటితమైన కవితాశక్తి ఇప్పుడు శతపరంపరలుగా విజృంభించుట కావలయును.

# వెలిగించే దీపాలు

(రచన : శ్రీ మానేపల్లి సత్యనారాయణమూర్తి. ప్రతులకు : తిలక్ ప్రచురణాలయం, మెంటేపూడి (Via) శృంగవృక్షం, పశ్చిమగోదావరిజిల్లా. మూల్యము: అమూల్యము.)

అదివాస్తవిక కవిత, భావకవిత, అనువాదకవిత అని మూడుభాగములు కలదిగా ఈ డెబ్బదియొక్క పుటల గ్రంథము సమకూర్చబడినది. ఆ విధముగా ఇది వచనకవితా సంపుటము. కాలస్వరూపుడుగా పరమేశ్వర సంభావన సుదృఢముగాగల ఈ కవి ఇష్టదేవతారాధనతో కావ్యమును మొదలుపెట్టినాడు. కాలపరిగణనము సూర్యునివల్ల నిలుకలదైనది. ఆయన లేనప్పుడు కాలములేదు. అందువల్ల ఆయనయే కాలము. 'సర్వ చరాచర ప్రాణికోటికీ జీవనదాత.' ఈ కవి అప్యాతి కూడ. కాలంలో కలసిపోవుటయే—కాలస్వరూపమును పొందుటయే ధ్యేయము. అహమస్మి—అథాతో ధర్మ జిజ్ఞాసా—జీవన్ఛద్రాణిపశ్యతి—శివరాత్రి — మంగళ సూత్రం—ఈ మొదలైన శీర్షికలుపెట్టి చేసిన రచనలు 'గతంలోకి కాళ్ళు ముడుచుకొని భవిష్యత్తులోకి నిరీక్షించడమే వర్తమానంలో చెయ్యగలిగింది'అన్న కవి సూక్తి సర్థవంతము చేయుచున్నవి.

రెండవ భాగము భావకవిత. 'చందమామ వాయించిన వీణలాగ—ఆకాశం కోరికలతో పులకరించేలాగ—నక్షత్రాల కనురెప్పల రెపరెపలాగ, నీవు పాడావు' (పుట. 39). నామరూపములులేని అతిమానుషమైన ఒకానొక భావసుందరీ విషయికములైన ఈ వచనకవితలు వెనుకటి భావకవుల కవితలను తలపించుచున్నవి. ప్రకృతి పురుషుని మేల్కొలుపు పాటతో ఈభాగము ముగిసినది.

మూడవభాగం అనువాదాలు షెల్లీవి నాలుగు, సుమిత్రానందన్ పంత్, ఫ్రెంచికవి జాక్ ప్రివేర్, రష్యన్ రచయిత యెతుషెంకో—మొదలైన వారివి ఒకటి రెండుగా పద్యాలు అనువాదాలు చేయబడినవి. ఆయాకవుల ఏఏ శీర్షికలతోడి రచనల కివి అనువాదములో స్పష్టముగా చెప్పియుండవలసినది. ఊరక కవి పేరుచెప్పిన మాత్రాన ఆ కవికృతులనుండి దీనికి మూలమైనదానిని పట్టుకొనుట అంత సులభము కాదు.

'అంతా అనుకున్నట్టే జరిగితే అది జీవితమెలా అవుతుంది. నిరాశలే నిస్పృహలే జీవితం విలువ పెంచుతాయి. మరేమీ బెంగపడకు జీవితం ఎప్పుడూ నిన్ను వరించదనుకోకు. నీ జీవితంలోకూడా ఎప్పుడో ఒకప్పుడు రంగుదీపాలు వెలుగుతాయి'—ఈ యువకవి ఆరోగ్యవంతమైన జీవిత దృక్పథము ఇది.

—క్షేమేంద్ర.

---

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1, Editor : S. Sambhu Prasad.